ప్రసిద్ధకవి, విమర్శకుడు, సౌజన్యమూర్తి

# డా॥ నండూరి రామకృష్ణమాచార్య

షష్ట్యబ్ద మహోత్సవ సందర్భంగా

సాదరంగా సమర్పించిన

అక్షరనీరాజనం

# కృతి స్వీకృతి

## ప్రగతిగీతాప్రవక్త

## డా॥ నండూరి రామకృష్ణమాచార్య

## ఆశీరామోదము

**1**

శాస్త్రి ఎవడు వేడి కన్నీటి కెరటాలు!
కరగినట్టి యెడద కవిత చేసి!
బొందె తోడ ఎవడు పొందె జీవన్ముక్తి
నవ్వుకొనుచు జగతి నటన గాంచి

**2**

బ్రదికె కవిత కెవడు బహిరంతరాత్మయై!
మెదడు - ఎడద తోడ మేళవించి;
అతడు కృష్ణశాస్త్రి - ఆంధ్రవాఙ్మయములో
భావకవుల మేలుబంతి యయ్యె

**3**

వ్రాసె-ఇంద్రధనువు వన్నెచిన్నెలు చెక్కి-
పలుకు పలుకు తళుకు బెళుకు దిద్ది
వెలిగె కృష్ణశాస్త్రి నిలువెల్ల కవితయై!
తెలుగుతల్లి యెడద పులకరింప

**4**

శిష్యుడైన సుకవి చెన్నయ్య పేర్మిమై
భాస్కరుండు - "విశ్వబాంధవుండు"
కృష్ణశాస్త్రి చరిత - కృతి సమీక్షలు వ్రాసి
ఇచ్చిరి కృతి నను సుకృతిని జేసి!

**5**

కృష్ణశాస్త్రి లేడు - ఏమిచ్చుటకు నేడు!
ఏను మీకు ఏది ఇవ్వలేదు!
"తెలుగు తల్లి" - మీకు - తేజోయశము లిచ్చు
సర్వతోఽభివృద్ధి సాకుగాత



పద్మశ్రీ, కళాప్రపూర్ణ
డా॥ సి. నారాయణరెడ్డి

# అభిప్రాయం

తెలుగులో భావకవిత్వయుగానికి రాయప్రోలు ప్రారంభకుడయితే కృష్ణశాస్త్రి స్థాపకుడూ, వ్యాపకుడూ.

కృష్ణపక్షంతో గొంతెత్తిన కృష్ణశాస్త్రికీ, గొంతు మూగవోయిన తర్వాత కలమెత్తిన కృష్ణశాస్త్రికీ ఎంతో అంతరముంది. అప్పటి కృష్ణశాస్త్రి చెక్కిన అక్షరాల రెక్కలమీద దిక్కుల్ని చుట్టివచ్చిన 'గగనపథ విహార విహంగమపతి.' చుక్కల రసం పోగుచేసుకుని భావచిత్రాల కద్దిన శిల్పి.

రానురాను కృష్ణశాస్త్రి పలుకుమారింది. పదం మారింది. మన స్తత్వం మారింది. కవితాతత్వం మారింది. ఒంటరితనం నుంచి, కంటకాలకన్నీళ్ళ నుంచి, రహస్తీరాలనుంచి ఆయన బయటపడ్డాడు. మనిషీ, మందీ, మట్టీ, మానూ, ఊరూ, ఏరూ ఆయన నయనపరిధిలోకి ప్రవేశించాయి. మానవతావాదం మరిన్ని విలువల లోతులతో ఆయన కవితలో చోటుచేసుకుంది. పద్యం, పాటా, మాటా - పలికిందేదయినా అచ్చమైన కవిత్వంగా, అంతకంతకు నిరాడంబరంగా అంతరంగాన్ని ఒరుసుకుంటూ పారింది.

కృష్ణశాస్త్రి జీవితాన్నీ, సాహిత్యాన్నీ రెండు భాగాలుగా వింగడించి రచించిన సమీక్షణ గ్రంథమిది. అయితే సమీక్షణంతోపాటు సముచిత పరిశోధక లక్షణం కూడా ఉండడంవల్ల ఈ గ్రంథానికి గురుత్వం కలిగింది.

డా॥ బి. భాస్కరచౌదరి, శ్రీ జి. చెన్నయ్య కళాశాల అధ్యాపకులుగా, నిరంతర సాహిత్య పరిశోధకులుగా తమ సమర్థతను ఇదివరకే నిరూపించుకున్నారు. ఈ గ్రంథరచనతో వారి సాహితీపరిశీలనవిమర్శనశక్తులు మరింత స్ఫుటంగా భాసిస్తున్నాయి. కేవలం కృష్ణశాస్త్రి కృతులపై వెలువడిన రచనలపైనే ఆధారపడక, సమకాలీన రచయితల, వ్యక్తుల అభిప్రాయాలను కూడా సేకరించి ఈ గ్రంథరచనలో ఉపయోగించుకోవడం ఈ గ్రంథం విలువను పెంచిన మరోగుణం. ఈ రచయితలిద్దరికీ వస్తువివరణంతోపాటు సుమధురమైన శైలీనైగనిగ్యం కూడా అలవడడం ప్రశంసావహం.

(సం) సి. నారాయణరెడ్డి

# రెండు మాటలు

నవ్యాంధ్రసాహిత్యలోకంలో దేవులపల్లి వేంకటకృష్ణశాస్త్రికి విశిష్టమైన స్థానం ఉంది. భావకవిత్వానికి స్ఫూర్తిని, కీర్తిని కలిగించిన 'భావకవి'గా అతడు పాఠకుల మనఃఫలకాలమీద చెరగని ముద్రనువేశాడు. గళం మూగవోయినా కన్నుమూసేటంత వరకూ ఆయన ఎంతో వైవిధ్యాన్ని సంతరించుకొన్న రచనలను వెలయించాడు.

కవి జీవితానికి, అతడి కృతులకు ఆధారాధేయ సంబంధం ఉంటుంది. విడదీయరానంతగా పెనవేసుకొని ఉండే వాటిని పృథఃకరించి పరిశీలించినట్లయితే రచయితకు పూర్తిన్యాయం జరగదు. కాబట్టే ఈ పుస్తకం కృష్ణశాస్త్రి జీవితం - సాహిత్యం అన్న రెండు ప్రధాన ప్రకరణాలుగా విభజింపబడింది.

ఇంచుమించు అరవైయేళ్ళపాటు బహుముఖాల ప్రవహించిన కృష్ణశాస్త్రి సాహితీస్రవంతి పోకడలను, దానితత్త్వాన్ని ఒక క్రమబద్ధమైన ప్రణాళిక ననుసరించి ఆవిష్కరించడానికి ఇందులో ప్రయత్నం చేశాము. ఎన్నో మలుపులకు లోనైన కృష్ణశాస్త్రి జీవితానికి, ఎంతో వైవిధ్యాన్ని సంతరించుకొన్న అతడి సాహిత్యానికి సంబంధించిన ఈ అనుశీలన సహృదయపాఠకుల మన్ననకు పాత్రమవుతుందని విశ్వసిస్తున్నాము.

కృష్ణశాస్త్రి జీవితవిశేషాలను తెలియజేసిన కృష్ణశాస్త్రి కుటుంబసభ్యులు శ్రీమతులు రాజహంస, లక్ష్మి, డా॥ వింజమూరి అనసూయ, శ్రీయుతులు బుజ్జాయి, వి. వి. ఎల్. ప్రభాకర్; ప్రసిద్ధరచయితలు, మిత్రులు శ్రీయుతులు పాలగుమ్మి పద్మరాజు, డా॥ దాశరథి, ఆరుద్ర, ఏల్చూరి సుబ్రహ్మణ్యం, ఆవంత్స సోమసుందర్, డా॥ బాలాంత్రపు రజనీకాంతరావు, బాలాంత్రపు నళినీకాంతరావు, కవికోకిల ఆవంత్స వేంకటరంగారావు, వేదుల శ్రీరామచంద్రకీర్తి, కురుమెళ్ళ వెంకటరావు గారలకు మా కృతజ్ఞతాంజలులు.

విషయసేకరణలోను, ఇతరత్రాను మాకు తోడ్పడిన ఆత్మీయమిత్రులు శ్రీయుతులు ఎస్. పద్మనాభరావు, టి. కె. రంగరామానుజాచార్య, లంకా వెంకప్ప శాస్త్రి, ధనికొండ శ్రీధరరావు ప్రభృతులకు మానమోవాకాలు.

కృష్ణశాస్త్రి కవితమీద, మా మీద ఉన్న అభిమానంతో ఈ పుస్తకాన్ని చదివి నాలుగు మంచిమాటల్ని వ్రాసిన పద్మశ్రీ, కళాప్రపూర్ణ ఆచార్య పి. నారాయణరెడ్డి గారికి మా హృదయపూర్వక నమస్సుమాలు.

షష్ట్యబ్ది శాంతి మహోత్సవాన్ని పురస్కరించుకొని మేము సమర్పించిన ఈ చిరుకానుకను స్వీకరించి అపారవాత్సల్యంతో 'ఆశీరామోదము'ను అందజేసిన సహృదయులు, సుహృదులు ఐన డా॥ నండూరి రామకృష్ణమాచార్యగారికి మా అభిమాన పూర్వకమైన అభివాదాలు,

ఈ పుస్తకాన్ని సకాలంలో అందంగా ముద్రించి యిచ్చిన బాలాజీప్రెస్ అధినేత శ్రీ సి. మాణిక్యంగారికి, వారి సిబ్బందికి మా కృతజ్ఞతలు.

సహృదయులైన పాఠకులకు మా అభినందనలు.

చిత్తూరు, బి. చెన్నయ్య

మార్చి 10, 1980. డా॥ బి. భాస్కర చౌదరి

# విషయానుక్రమణిక

## కృష్ణశాస్త్రి జీవితం



## కృష్ణశాస్త్రి సాహిత్యం

# కృష్ణశాస్త్రి జీవితం

"వింతగాఁ దోఁచు నాదుజీవితము నాకె
జిలుఁగు వెన్నెలతోఁ జిమ్మ చీకఁటులతో"
(నాజీవితము - కృష్ణపక్షము)

డా॥ బి. భాస్కర చౌదరి

# తెలుగుపల్లె - చంద్రంపాలెం

"కాలవ ఒడ్డున ఒరిగి నీడ చూసుకొనేదో, !
చేలనడుమ పడుచులాగ చేయెత్తి పిలిచేదో,
తోటవెనుక కాస్తకాస్త తొంగితొంగి చూసేదో,
కొండపక్క నిలిచేదో
ఎంత తీయగా, చల్లగా ఉండేది
తెలుగుపల్లె! " ('మా ఊళ్లో వీధి అరుగు' - కృష్ణశాస్త్రి)

ఇరవయ్యోశతాబ్ది వెలుగురేకలు అప్పుడప్పుడే విచ్చుకొంటున్న కాలంలో పిఠాపురానికి రెండుమైళ్ళ దవ్వులో 'మేలుకొని కలలు కంటున్నట్టు' 'అరమోడ్పుకన్ను' లాగా ఉండే తెలుగుపల్లె అది. పేరు చంద్రంపాలెం. నల్లని ఎత్తైన పెద్ద రాతిగోడలతో కొట్టవచ్చినట్టు స్ఫుటంగా కన్పించే వెలమదొర వెంకట్రాయణింగారి దివాణం ఆ ఊరి లోదే. కొడిగట్టిపోతూన్న వ్యవస్థకు సూచికగా 'పెరిగి పెరిగి బద్దలుచేసి పడగొడుతుందేమో' అన్నట్టుగా బీటలువేసిన ఒక గోడలోనుంచి రావి మొలక లేచి నిలబడి ఉంది. నున్నగా నిగనిగమంటూ మెరుస్తూ ఉండే గచ్చుతో వీధిగుమ్మానికి అటూ ఇటూ 'మహాబడాయి' గా ఉండే దివాణపుటరుగులమీద పరచిన తివాచీలపై అప్పటికే మునసబు శేషాద్రి, కరణం జగ్గరాజు, షావుకారు, సిద్ధాంతి మొదలైన ఊరి పెద్దలు కొలువుదీరి ఉన్నారు. 'విరిచి వెనక్కుకట్టిన' జరీఅంచు పంచెతో, 'దక్కిణీ తరహాపాగ' తో, 'బుగ్గమీసం' తో, 'అంగారఖా' తో, 'నుదుటిపై పెద్దనామాల' తో ఎంతో ఠీవిగా ఆసీనులైఉన్న రాయణిం గారు కౌజుల్నీ పుంజుల్నీ 'నాకౌంకట్టడం' లో తన నైపుణిని ఉట్టంకిస్తు న్నారు. అంతవరకూ 'కిలకిల మాట్లాడుతూ' ఊరిబావినుండి నీళ్లు

తెస్తున్న అమ్మలక్కలు దివాణం వీధి అరుగు దగ్గరకు వచ్చేసరికి 'అందెల రవళిలో రవ్వంత వడిముడుకూ', బిందెల నీళ్ళలో రవ్వంత 'తొట్రుపాటూ,' కన్పించేటట్టు 'రెండోవైపు' తలలు తిప్పు కొని నడచి పోయారు. 'దండెలతో, దంతపుకోళ్ళతో, రాయంచ రెక్కలతో, పరుపు బాలీసుల' తో అరుగుమీద ఒకవైపుగా అమ ర్చిన సవారీలలోకి పెద్దల కన్నుగప్పి అప్పటికే జొరబడిన పిల్లల మన సులు ఊయల లూగిపోతున్నాయి; ఉత్సాహంతో ఉరకలు వేస్తు న్నాయి. పిల్లల సవ్వడికి రాయణంగారి కనుబొమలు ముడిపడినాయి. దొరగారి యింగితం కనిపెట్టిన నౌకరు అదలింపుతో సవారిలోని పిల్లలు బిలబిలమంటూ వీధిలోని లేగదూడతోబాటు చెంగున దూకి బంతుల లాగా ఎగిరిపోయారు.

ప్రతిభావంతుడైన కవికి ఉదారం నీచం అనీ, రమ్యం జుగుప్సితం అనీ ఏదీ ఉండదు. అతడి భావపింఛికతో స్పృష్టమైన ప్రతి అల్పవస్తువూ పరమ రామణీయకమై పోతుంది [1]. తాను పుట్టిపెరిగిన ఊరిమీద అరవైఏళ్ళ తర్వాత మనసు మళ్ళినప్పుడు కృష్ణశాస్త్రి ఆవిష్కరించిన అనేకానేక స్మృతులు ఇటువంటి ఎన్నో భావచిత్రికలకు అద్దం పట్టు తున్నాయి. చిన్నప్పుడు నిసర్గమైన ప్రకృతి ఒడిలో గడపిన మధురక్ష ణాలూ, అరమరలు లేని పల్లీయుల ప్రవృత్తితో పెనవేసుకొని పోయిన ఆత్మీయతా కృష్ణశాస్త్రి హృదయ ఫలకంమీద ప్రగాఢమైన ముద్రను వేసి ఉన్నాయి. 'గగనపథ విహార విహంగమపతిని నేను' అని గొంతెత్తి పాడిన కృష్ణశాస్త్రి జీవితం మలిసంజెలో పెలయించిన అనేక రచనలకు ఈ చిన్ననాటి అనుభవాలే ప్రేరకమై ఉండడం గుర్తింపదగి ఉంది. ఆ దృష్టితోనే ఈ ప్రకరణంలో కృష్ణశాస్త్రి కృతులకు ప్రాతి పదికలైన అంశాలు కొన్ని అనుశీలింపబడినాయి.

'మనిషీ, చెట్టూ చేమా, పిట్టా జంతువూ కలిసి ఒకే ఒక కుటుంబం' లాగా ఉండిన కాలంలో 'చల్లని అంకంమీద పవళింప జేసుకొనే' తల్లి వంటి పల్లె ఒడిలో 'గారాంగా' పెరిగినవాడు కృష్ణశాస్త్రి. 'దివాణపు స్తంభాలమీది విటంకాల' లోని 'పావురపు కువకువలు,' వీధి అరుగుమీది సవారీలోనుంచి కనబడే దివాణం లోపలి 'భిత్తిభాగాది శోభిత గోపగోపికా బహుళ కేళీ చిత్రపటములు'; 'స్వాగత వచనం లాంటి' వీధి అరుగులు; కాంవయ్యమేష్టారి 'ముక్కుకొసలకాగా జారిన కళ్ళజోడూ, ఏడాది పొడుగునా తొడుక్కునే నల్లకోటూ'; ఊరి పొలిమేరల్లోని పచ్చని వరిపొలాలూ; చేలగట్లమీద తీర్చినట్లు 'గాలివేళ్ళు తగిలి పరవశమై తలలూపు' తున్నట్లుండే తాటిచెట్ల వరసా; చెట్టుకింద పుట్టగోచీతో దూడల్ని కాస్తూ పాటలుపాడే గొల్లపిల్లవాడూ; 'చెట్టు కొమ్మమీద నుంచి వడ్రంగిపిట్ట టక్కుటక్కుమని కొట్టే చప్పుడూ'; 'తుర్రున ఎగిరే పాలపిట్ట రెక్కసీలిచాలూ'; 'నూర్పుల సందడీ'; గాలి రెక్కలమీద అడపాదడపా వచ్చే గ్రామకలకలమూ'; గట్లనూ పుట్లనూ దాటి గంతులేస్తూ పోయే గూడులేనిబండి యెడ్ల మెడగంటల సవ్వడి'; పిఠాపురం పరిసర ఉద్యాన వనాల్లో నుంచి' మేము ఉన్నాం నీకేమీ భయంలేద' న్నట్టు ఠీవిగా ఆకాశంలోకి పొడుచుకుని కనబడే' కుంతీమాధవ, కుక్కుటేశ్వరుల ఆలయగోపుర విమానాలూ; 'చల్లని నీటి అలలతో మాలిన్యం కడిగే' మాధవ పుష్కరిణిలోని అరవిచ్చిన అరవిందాల చెలువాలు, సౌరభాలు; తీర్చి కల్పించినట్లు నలుచదరంగా' రాతిమెట్లతో కూడిన 'పాదగయ'; మాఘశుద్ధ ఏకాదశినాడు పొన్నవాహనం[2] మీద రాత్రిపూట జరిగే ఊరేగింపుటుత్సవం; పాడ్యమినాటి రాత్రి జరిగే (శ్రీ) పుష్పయాగం, దానికి ముక్తాయింపుగా ముత్తయిదువలు పాడే మంగళహారతిపాటలూ, ఆరగింపుపాటలూ, లాలిపాటలూ,

పవ్వళింపు పాటలూ కృష్ణశాస్త్రిమీద చిన్ననాడే ఎంతో ప్రభావాన్ని నెరపినట్టు అతడి రచనలు నిరూపిస్తున్నాయి.

"మహాకవి నిలయమగుటచే రక్తికి, మహారాజాస్థాన మగుటచే భుక్తికి, మాధవక్షేత్రమగుటచే ముక్తికి నిదానమై" న[3] పిఠాపురం పరిసర ప్రాంతాల్లోని ప్రజల జీవన సరళిలోని వైవిధ్యాన్ని కృష్ణశాస్త్రి ఎంత బాగానో ఆకళింపు చేసుకొన్నాడు. కాబట్టే అతడు గ్రామస్థుల 'నిత్యలౌకిక జీవితానికి' నెలవులైన కరణం మునసబుల వీథి అరుగులను, 'వేడుకలకీ కాలక్షేపానికీ' ఆటపట్టయిన దివాణం వీథి అరుగును, 'ధర్మచింతనకీ ఆముష్మికగోష్ఠికీ' కేంద్రమైన శాస్త్రిగారి వీథి అరుగును కళ్ళకు కట్టేటట్టు చిత్రింపగలిగాడు.[4] ఒకే సంస్కృతి ఆవరణలో 'జాతి అంటూ, ధనమంటూ, చదువంటూ తేడాలు లేకుండా మామా అన్నా పిన్నీ వొదినా అయిపోయి ఒక్కటిగా కలిసిపోయిన పల్లీయుల ముగ్ధప్రవృత్తిని; ఏ 'ఏటిబిడ్డున'నో, 'కొండఘాటీల'నో 'శయించి' అప్పుడప్పుడూ 'మావితోట దుప్పటి'ని తొలగించి తొంగిచూచే పల్లియ ప్రకృతిని కృష్ణశాస్త్రి ఎంత బాగా చదువుకున్నదీ 'ఏడాదిపొడుగునా', 'వేణుకుంజం', 'గౌతమి' వంటి నాటికలు ఖాష్యం చెబుతున్నాయి.

జమీందారీ 'సావాసం' వల్ల కృష్ణశాస్త్రిలో కొంత 'బద్ధకమూ భోగమూ' చోటుచేసుకొన్నాయి. ఆ విషయాన్ని అతడే ఒకచోట చమత్కారంగా ప్రస్తావించి ఉన్నాడు.[5] అది అతడిమీద మరోరకంగా ప్రభావాన్ని నెరపి ఉండడం ఇక్కడ గుర్తింపదగి ఉంది. చిన్నప్పుడు తండ్రి పెదతండ్రులతో కలసి పిఠాపురానికి సాగించిన ప్రయాణాలు, ఆ కచేరీ సావిళ్ళు, రత్నకంబళాలు, పరిమళ ద్రవ్యాలు, ఏ నవరాత్రి ఉత్సవాలప్పుడో ప్రత్యేకంగా ఏర్పాటు చేయబడే విద్వత్పరీక్షలు

పండితసమ్మానాలు, మస్లండ్ మీద కొలువుదీర్చే రాజావారు, రజత వేత్రహస్తులైన చోపుదారుల బరాబరులు-అన్నీ కృష్ణశాస్త్రి హృదయ ఫలకంమీద చెరగని ముద్రను వేశాయి. 'అప్పుడు పుట్టిఉంటే', 'సువాసన ద్రవ్యాలు' మొదలైన ఊహా చిత్రాలు దీనికి చక్కగా సాక్ష్యం చెబుతున్నాయి.

చిన్నప్పుడు తన మూపుమీద కూర్చోబెట్టుకొని కబుర్లు చెబుతూ రెండుమైళ్ళ దవ్వున ఉన్న పిఠాపురానికి పొలంగట్లల్లోనూ, పుంతల్లోనూ బడిపోయే తన 'బావ', ఇంటిముందు ఖాళీస్థలంలో రామశాస్త్రిగారు పురాణం చెబుతుంటే 'ముదుకదుప్పటి కప్పుకొని' గుట్టుపెట్టే తన 'కాపు' ఐన రంగయ్య; 'నల్లగా పెద్దనామాలతో వెంకటేశ్వరస్వామి' లా ఉండే అంగడి శ్రీరాములు; మరీ భక్తుడైన జియ్యన్న; 'పెద్ద పట్టైనామాలు' తో 'ఎర్రచారల నిడుపాటి కళ్ళ'తో, 'కోటేసిన గరుడముక్కు' తో, 'ముందు ముళ్ళుగట్టుకునే అంగరఖా' తో, 'తలవెనకపై భాగానికి లాగి గోపురంలాగా కట్టిన జుట్టుముడి' తో పదిమందిలో ఉన్నా ఇట్టే ఆనవాలు పట్టగలిగిన మునసబు శేషాద్రి శ్రీవైన విగ్రహము కృష్ణశాస్త్రి ఎదలో చిన్ననాడే బొమ్మకట్టినాయి. కాలంతో బాటు స్ఫుటమైన రూపురేఖల్ని దిద్దుకొన్న అవి 'గుహుడు,' 'ధనుర్దాసు' మొదలైన రచనల్లోని మూర్తి చిత్రణకు స్ఫూర్తినిచ్చి ఉన్నాయి. తన ఎదపై చెరగని ముద్రను వేసిన కొన్నిబొమ్మల కతడు అక్షరాకృతిని కూడా కల్పించి ఉన్నాడు[6].

ఎన్నో ఆటుపోటులకు లోనైన జీవితం మలిసంజెలో కృష్ణశాస్త్రిలోని 'మానవుడు' తలఎత్తడం గమనింపదగిన ముఖ్యవిశేషం. "మనిషితో ఎడతెగని సావాసమూ, ప్రేమిస్తే ఆనందం, దవ్వు అయితే బాధతో కొట్టుకుపోవడం, ఇది నాకు తెలుసు. ఇది నా మతం. నాకిక వేరే మతంలేదు, కులం అసలే లేదు. నేను మనిషిని"[7] అన్న కృష్ణశాస్త్రి

మాటలు మనిషి పొందుకోసం అతడు ఎంతగా ఆరాటపడిందీ పట్టి యిస్తున్నాయి. కృష్ణశాస్త్రిలోని మానవుడు బలీయుడైనప్పుడే, 'విచక్షణా వీక్షణాల' తో లోకాన్ని తరచి చూచినప్పుడే "రిక్షావాడు మొదలుకొని అంతరిక్షంలో కొలువైయున్న ఈశ్వరునిదాకా ఆయన ఆలోచనలు పరచుకొన్నాయి."[8] వడబోసిన ఇటువంటి లోకానుభవంతోనే, వివేచనతోనే కృష్ణశాస్త్రి పాతచెప్పులాంటి నారయ్యతాత అతుకుల బతుకును వ్యాఖ్యానించ గలిగాడు[9]. 'కాళ్ళ అంచుల దగ్గర తుక్కయిన ఇజారు' తో, వీపుమీద 'రూపాయి బిళ్ళంత మాసికల' తో, 'బొత్తాలు లేని కమీజు' తో, 'గజ్జెలగుర్రం' లాంటి రిక్షామీద 'జులాయిగా' తిరిగే అహమ్మద్ లోని 'వేదనాకిరీటంతో మరీ ఉన్నతుడై' పోయిన మనీషిని పసిగట్టగలిగాడు[10]. వచన రచనలో తన లోకజ్ఞతకు, మానవతకు రూపం కల్పించుకున్న మహాశిల్పి'[11] ఐన కృష్ణశాస్త్రికి అగాధమూ, గంభీరమూ, అనంతమూ ఐన మానవ జీవితమే ముడిసరుకు కాగలిగింది; స్ఫోరకమైంది[12]. చిన్నప్పుడే కృష్ణశాస్త్రి హృదయ క్షేత్రంలో దానికి బీజావాపనం జరిగింది – లోకవృత్తాన్ని అనుకరించడానికే కాదు, ఆధ్యాత్మిక చింతన శిఖరపుటంచులను అధిరోహించడానికిన్నీ.

"కోనేటి నీళ్ళల్లోకి ఒదిగి నేనెన్ని సార్లో నా ప్రతిబింబమే కాదు– నా హృదయాంతరాళాలు కూడా చూచుకున్నాను. అలాగ చూచుకున్నప్పుడల్లా, కోనేరు నా సంగతిని తెలుసుకుని గలగల మంటుంది, ఉసురుసురంటుంది. నేనప్పుడు కోనేటి కడుపులోనుంచి గోపుర శిఖరమెక్కుతాను."

"కోవెల – కొలను" – కృష్ణశాస్త్రి

# తండ్రి - పెదతండ్రి

మీ పవిత్ర యశో నిర్మలాపగా తి
శీతల తరంగ జల సుధా సేచనమున
కలుష కౌటిల్య కర్దమ మలినమైన
మీ తనయు జీవితము కూడ పూతమయ్యె.

( 'మా బాబయ్య - నాన్నగారు' - కృష్ణపక్షం.

1912 వ సంవత్సర ప్రాంతంలో ఒకరోజు తమ్మనశాస్త్రిగారు[1] రాజా చెల్లయ్యమ్మారావు హైస్కూల్లో హెడ్మాష్టరు గదిలో కూర్చొని ఉండగా ఒక ఆంగ్లేయుడు వచ్చాడు. హెడ్మాష్టరు ఆయన్ని కూర్చోబెట్టి ఉచిత మర్యాదల్ని చేశాడు. ఆ తర్వాత ఇద్దరూ దాదాపు ఇరవై నిముషాలు ఆంగ్లంలో సంభాషించుకొన్నారు. ఆ స్కూల్లోనే గౌరవాంధ్రపండితులైన తమ్మన శాస్త్రిగారికి ఆ సంభాషణలో ఒక్క ముక్కకూడా అర్థం కాలేదు. అట్లాగే చెవులప్పగించి వింటూ ఉండి పోయారు. ఆ తర్వాత ఇంటికి వెళ్ళిన శాస్త్రిగారు అప్పట్లో స్కూలు ఫైనలు చదువుతున్న కృష్ణశాస్త్రిని పిలిచి హెడ్మాష్టరు గదిలో తాను ఆలకించిన సంభాషణక్రమాన్ని ఒక్క అక్షరం పొల్లుపోకుండా, ఒక్క అపశబ్దం లేకుండా అప్పజెప్పి, దాన్ని తెలుగులోకి తర్జుమా చేయమని అడిగారు[2]. అప్పుడు ఆశ్చర్యంలో మునిగిపోవడం బాలుడైన కృష్ణశాస్త్రి వంతయింది.

అటువంటి అసాధారణమైన ధారణాపటిమతోనే తమ్మన శాస్త్రి గారు అగ్రజులైన సుబ్బారాయశాస్త్రులతో కలిసి అప్పటికి చాలాకాలం మునుపే అవధానాల్ని నిర్వహించారు[3]. దేవులపల్లి సోదరకవుల అవధాన ప్రదర్శన చిత్రమైన పరిస్థితుల్లో ప్రారంభమైంది. "1879 లో శ్రీమాన్

మాడభూషి వేంకటాచార్యులవారు పిఠాపురాస్థానమున నవధానము గావించిరి. అప్పుడు గంగాధర రామరాయేంద్రులు 'మన యాస్థానమున నిట్టి యవధానముచేయు ప్రతిభావంతులుండిరే' యని ప్రశ్నించిరట. మరునాఁడు దేవులపల్లి సోదరుల శతావధానము ప్రారంభమైనది. అనన్య సామాన్యమగు కవితాధారతో నా యవధానము జయప్రదముగా నెఱవేరినది. వేంకటాచార్యులవారు సోదరకవుల ప్రతిభకు నివ్వెఱపోయిరి. మహారాజు తన సంస్థానకవుల శక్తికానందపడెను. అప్పటి నుండియు నాస్థానమున వీరిపేరు మాఱుమ్రోసినది[4]" అని మధునాపంతుల సత్యనారాయణశాస్త్రిగారు పేర్కొన్న సంఘటన వారి ధారణాపటిమకు ఒక చక్కని తార్కాణ.

దేవులపల్లి పూర్వీకులది ఆకిరిపల్లి. కృష్ణశాస్త్రి తండ్రిదాకా దేవుల పల్లి వంశంలో విద్వత్కవులు కాని వారూ, రామభక్తులు కాని వారూ ఎవరూ లేరు. వారు నానా రాజాస్థాన మండపాల్లో ఎన్నో సత్కృతుల్ని పొందినారు. కాబట్టే "దేవులపల్లి వంశమున దేవులు పుట్టిరి" అని చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిగారు ప్రశంసించినారు. పిఠాపుర సంస్థాన వ్యవస్థాపకులైన శ్రీరావు తెనుంగు రాయణింగారి ఆహ్వానాన్ని మన్నించి కృష్ణశాస్త్రి ముత్తాత (దేవులపల్లి వేంకట కృష్ణశాస్త్రిగారు) చామర్లకోటకు వచ్చి మకాం ఏర్పరచుకొన్నారు. ఆ తర్వాత వారి వంశీయులు పిఠాపురం సమీపంలోని చంద్రంపాలెంలో నివాసాన్ని కల్పించుకొన్నారు. ఆ రోజుల్లో దేవులపల్లి సోదరకవులుగా లబ్ధ ప్రతిష్ఠులైన సుబ్బారాయశాస్త్రి, తమ్మనశాస్త్రిగారలు కవిసార్వభౌములైన కూచిమంచి తిమ్మకవి మునిమనుమడు కూచిమంచి వేంకట్రాయ మంత్రివద్ద కవిత్వపు మెలకువలను అవగాహన చేసుకొన్నారు. తమ కాలంనాటికి లబ్ధప్రతిష్ఠులైన శిష్టు కృష్ణమూర్తిశాస్త్రి, మాడభూషి వేంకటా

చార్యుల పరిచితివల్ల తెలుగు కవితలోని జిగిబిగిని గ్రహింపగలిగినారు. "సుబ్బారాయశాస్త్రిగారూ, తమ్మనశాస్త్రిగారూ మా వంశానికి నాయకమణులు. గంగాధర రామరాయ మహీపతి పండితసభలో పట్టపు సింహాసన మధిష్ఠించినవారు. ఆశువుగానైనా ప్రబంధపద్ధతి నతిశయించే కవనము చెప్పి ఆనందగజపతి మహారాజు నంతవానిచే నింతివారు లేరను గండె పెండారములను గడించినవారు. ప్రస్తుతం పీఠికాపుర సంస్థానాధీశ్వరులూ శ్రీ శ్రీ శ్రీ మహారాజా రావు వేంకటకుమారమహీపతి సూర్యారావు బహద్దరు వారికి గురువులై ఆస్థానకవులై, ఆప్తబంధువులై వారిచే 'మా సంస్థానము మీదే' యని మన్నింపబడినవారు. సకలసద్గుణసంపన్నులు. శ్రీరామపాదభక్తులు"[2] అన్నకృష్ణశాస్త్రి మాటలు వారి సౌహృదసౌమనస్యాల్ని చక్కగా వ్యక్తం చేస్తున్నాయి. ఈ గుణవిశేషాలు పూర్వీకులనుండి, ముఖ్యంగా తండ్రి పెదతండ్రులనుండి కృష్ణశాస్త్రికి ఎంతవరకు సంక్రమించాయో పరిశీలించడమే ఈ ప్రకరణంలోని ముఖ్యోద్దేశం.

ఇంటివద్ద అహరహమూ జరుగుతుండిన కవితాగోష్ఠులు; చిన్నప్పుడు రంగయ్యకాపు మూపుమీద కూర్చొని చంద్రంపాలెంనుండి పిఠాపురం వెళ్ళేటప్పుడు తండ్రో పెదతండ్రో కంఠతా పెట్టించిన అమరం, బోధించిన అమరభాషా కావ్యాలలోని రహస్యాలు[3]; తండ్రి పెదతండ్రులు తన చేత చిన్నతనంలోనే చేయించిన 'వ్యస్తాక్షరి'[4] మొదలైన అంశాలన్నీ కృష్ణశాస్త్రిలో చిన్నప్పుడే కవనమల్లే ఉత్సాహాన్ని[5] రేకెత్తించాయి. కవితాసాధనలో తండ్రి పెదతండ్రులవద్ద ఎక్కువకాలం శిక్షణపొందే అవకాశం కృష్ణశాస్త్రికి లభించలేదు.[6] కాని వారు పరమపదించాక కూడా కృష్ణశాస్త్రి పేరి పేరయ్యశాస్త్రులవంటి విద్వాంసుల వద్ద సంస్కృతకావ్యాల్ని సలక్షణంగానే అధ్యయనంచేశాడు.[7] దీనికి తోడు "పద్యరచనలోఉన్న ఉదాత్తమైన సంస్కారం దిగ్దంతులవంటి

మాడభూషి వేంకటాచార్యులవారు పిఠాపురాస్థానమున నవధానము గావించిరి. అప్పుడు గంగాధర రామరాయేంద్రులు 'మన యాస్థానమున నిట్టి యవధానముచేయు ప్రతిభావంతులుండిరే' యని ప్రశ్నించిరఁట. మరునాఁడు దేవులపల్లి సోదరుల శతావధానము ప్రారంభమైనది. అనన్య సామాన్యమగు కవితాధారతో నా యవధానము జయప్రదముగా నెఱవేరినది. వేంకటాచార్యులవారు సోదరకవుల ప్రతిభకు నివ్వెఱపోయిరి. మహారాజు తన సంస్థానకవుల శక్తి కానందపడెను. అప్పటి నుండియు నా స్థానమున వీరిపేరు మాఱుమ్రోసినది[4]'' అని మధునాపంతుల సత్యనారాయణశాస్త్రిగారు పేర్కొన్న సంఘటన వారి ధారణాపటిమకు ఒక చక్కని తార్కాణ.

దేవులపల్లి పూర్వీకులది ఆకిరిపల్లి. కృష్ణశాస్త్రి తండ్రిదాకా దేవుల పల్లివంశంలో విద్వత్కవులు కాని వారూ, రామభక్తులు కాని వారూ ఎవరూలేరు. వారు నానా రాజాస్థాన మండపాల్లో ఎన్నో సత్కృతుల్ని పొందినారు. కాబట్టే "దేవులపల్లి వంశమున దేవులు పుట్టిరి'' అని చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిగారు ప్రశంసించినారు. పిఠాపుర సంస్థాన వ్యవస్థాపకులైన శ్రీరావు తెనుంగు రాయణింగారి ఆహ్వానాన్ని మన్నించి కృష్ణశాస్త్రి ముత్తాత (దేవులపల్లి వేంకట కృష్ణశాస్త్రిగారు) చామర్లకోటకు వచ్చి మకాం ఏర్పరచుకొన్నారు. ఆ తర్వాత వారి వంశీయులు పిఠాపురం సమీపంలోని చంద్రంపాలెంలో నివాసాన్ని కల్పించుకొన్నారు. ఆ రోజుల్లో దేవులపల్లి సోదరకవులుగా లబ్ధ ప్రతిష్ఠులైన సుబ్బారాయశాస్త్రి, తమ్మనశాస్త్రిగారలు కవిసార్వభౌములైన కూచిమంచి తిమ్మకవి మునిమనుమడు కూచిమంచి వేంకట్రాయ మంత్రివద్ద కవిత్వపు మెలకువలను అవగాహన చేసుకొన్నారు. తమ కాలంనాటికి లబ్ధప్రతిష్ఠులైన శిష్టు కృష్ణమూర్తిశాస్త్రి, మాడభూషి వేంకటా

కృతుల్లోనుండి చాలాపద్యాల్ని భావయుక్తంగా ఆలపించాడు. ఆ ధోరణి గిట్టని సనాతన సాహితీసమారాధకులు కొందరులేచి 'ప్రాచీన కావ్యాల్లో మంచిపద్యాలు లేవా? అవి రావా?' అని కృష్ణశాస్త్రిని అధిక్షేపించారు. 'ప్రాచీనకవుల కావ్యాల్లోనుండి నాలుగు పద్యాల్ని పెద్దలు చదివితే నేను పది పద్యాల్ని చెప్పగలను' అని ఆ సందర్భంలో కృష్ణశాస్త్రి చెప్పిన సమాధానం[10] అతడి ఆత్మప్రత్యయాన్నే కాక, తండ్రులనుండి తనకు సంక్రమించిన అసాధారణమైన ధారణాశక్తిని, ప్రాచీన కావ్యాలతోడి పరిచయాన్ని[11] తెలియజేస్తున్నది. కాబట్టే కృష్ణశాస్త్రి ధారణాశక్తినిగూర్చి ప్రస్తావిస్తూ పురాణం సుబ్రహ్మణ్య శర్మగారు "ఆయనకు తేదీలు, సంవత్సరాలు, కవుల వర్ణక్రమం అంతా కంఠోపాఠం" అని వ్యాఖ్యానించి ఉన్నారు.[12] 'భారతి' రజతోత్సవ సంచికలో కృష్ణశాస్త్రి వెలువరించిన 'పాతిక సంవత్సరాల తెలుగు కవిత్వము' దీనికి అద్దం పట్టుతున్నది.

> వేలుపురాఘువుండు; పదివేల పురాణము లన్యునెన్న నీ
> యేలికలెన్న రావుకులు లెప్పటివారల కప్పుడొప్పు భూ
> పాళి నిజంబుగాఁ దనకటంచును దేవులపల్లి వంశ భూ
> పాళి దలంచుచుండుఁ దనపాలిటి కీ యుభయంబె ప్రాపుగన్.

దేవులపల్లి వంశీకులు ఇహానికి పీఠికాపుర ప్రభువునూ, పరానికి శ్రీరామచంద్ర ప్రభుపాదపీఠికనూ సమాశ్రయించినవారు. కృష్ణశాస్త్రి పెదతండ్రి సుబ్బారాయశాస్త్రిగారు చెప్పిన పై పద్యం ఆ విషయాన్నే హృద్యంగా తెలియజేస్తున్నది. ఆ దృష్టితోనే 'శ్రీరామపంచాశత్తు' ('శ్రీరామ స్తవం - సంస్కృతం) ను వెలయించినవారు 'శ్రీరామరాయ విలాసమును ఆవిష్కరించినారు.[13] ఆయన తమ్ములైన తమ్మనశాస్త్రి గారికి తమప్రభువుల పట్టాభిషేకోత్సవం ఎంత 'నయనోల్లాసము' ను

కల్గించిందో 'శ్రీయతిరాజవిజయము'[14] అంత హృదయోల్లాసాన్ని చేకూర్చింది. కాబట్టే "ఒకయేలిక నొకవేలుపు నొకరీతిగ గొలిచి యున్న నియమశీలురు మావారు"[15] అని కృష్ణశాస్త్రి వ్యాఖ్యానించి ఉన్నాడు. కాని దేశకాలపరిస్థితులకు అనుగుణంగా కృష్ణశాస్త్రిలో మోసులెత్తిన అభ్యుదయభావాలు వాటికి విపరీతంగా ప్రవర్తిల్లి ఉండడం గుర్తింపదగి ఉంది.

భాషామత సంప్రదాయాలు, సాంఘికసమస్యలు మొదలైన విషయాలకు సంబంధించిన తండ్రి పెదతండ్రుల దృక్పథానికి కృష్ణశాస్త్రికి ఆమడదూరం. 'ఆర్యులనాటి తపశ్శాలులలో నుండి దారితప్పి కాలంతప్పి కాని రోజుల్లో చిక్కబడ్డ' తన సోదరుడు దేవులపల్లి వెంకట్రామయ్యకూ, తనకూ ఉన్న తేడాను ఎత్తిచూపుతూ కృష్ణశాస్త్రి నిర్మొహమాటంగా ఉట్టంకించిన మాటలే దీనికి చక్కని సూచికలై ఉన్నాయి. "భాషావిషయాల్లో, మతాభిప్రాయల్లో, సాంఘికసమస్యల్లో మేము ఇద్దరమూ చెరోధ్రువం వాళ్ళమూనూ. రెండువందలేళ్ళ క్రిందటి మా రామశాస్త్రిగారు ఆకస్మికంగా దిగివచ్చినట్టయితే మా అన్నగారికి చేయినందిచ్చి 'ఈ వేషమెవరోయి' అని నన్నుజూచి మాత్రం కన్యాశుల్కంలో అవధాన్లుగారిలాగ ఆగ్రహించే వారేమో పాపం. అయినా మా అన్నయ్యమాత్రం నన్నర్థంచేసుకొని అభిమానించి ఆదరించేవాడు; నా తమ్ముడని గర్వపడేవాడు. నా కిప్పుడూ కళ్ళు చెమ్మగిల్లుతున్నాయి. ఆయన తాను నిశ్చయించుకొన్నట్లు నా తండ్రు లిద్దరివలెనే కవీఅయాడు. సుగుణవంతుడూ అయాడు. నేనో నేటివాణ్ణేనని సిగ్గుపడను."[16] ఎన్నో ఆటుపోటులకులోనైన జీవిత చరమదశలోమాత్రం కృష్ణశాస్త్రి తండ్రి పెదతండ్రుల కావ్యాల్ని తిరగేసేటప్పుడు, ముఖ్యంగా తమ ఇలవేల్పయిన శ్రీరామచంద్రమూర్తిపట్ల వారి ప్రగాఢమైన భక్తి ప్రవత్తులకు ప్రతీకలైన పద్యాల్నిచూచి నిట్టూర్చేవాడు; మననంచేసుకొని విచలితు

డయ్యేవాడు.[17] తరతరాలనుండి దేవులపల్లి వంశీకుల రక్తనాళాల్లో ప్రవహిస్తూ ఉండిన రామభక్తికి కృష్ణశాస్త్రికూడా వివశుడైనట్లు జీవితం మలిప్రొద్దులో అతడు వెలయించిన కొన్ని చలనచిత్ర గీతాలు ఎలుగెత్తి చాటుతున్నాయి.

తండ్రి పెదతండ్రులలాగానే కృష్ణశాస్త్రికూడా 1925 వ సంవత్సరంలో వెలువరించిన 'కృష్ణపక్షము'ను అప్పటి పిఠాపురం రాజావారైన రావు వేంకటకుమారమహీపతి సూర్యారావు బహద్దరువారికి అంకితం ఇచ్చాడు. "వారిబిడ్డడగుటచేతనే ఈ కవికి ప్రభుభక్తికలదు. అందువల్లనే కృష్ణపక్షము పీఠికాపుర మహారాజున కంకితమగుట సంభవించినది" అని 'కృష్ణపక్షము'ను సింహావలోకనంచేస్తూ తల్లావఝ్ఝల శివశంకరశాస్త్రి వ్యాఖ్యానించి ఉండడం గమనింపదగిఉంది. కాని అంతకు మూడేండ్లమునుపే పిఠాపురం రాజావారి హైస్కూల్లో ఉద్యోగం ఊడడానికి, ఆతర్వాత 1941 లో కాకినాడ రాజావారి కాలేజీలో చేస్తూండిన ట్యూటరు ఉద్యోగానికి రాజీనామా చేయడానికి కృష్ణశాస్త్రి రాజాగారలమధ్య పొడసూపిన అభిప్రాయభేదాలేకారణం.[18] తరాల అంతరాన్ని, స్వతంత్ర ప్రవృత్తిని ఎత్తిచూపుతున్న ఒక చిన్నసంఘటనని ప్రస్తావించి ఈ ప్రకరణాన్ని పూర్తిచేయడం సంభావ్యమౌతుంది.

గంగాధరరామారావు అస్తమయం (1890) తర్వాత కొన్ని సంవత్సరాలు పిఠాపురం సింహాసనానికి సంబంధించిన వారసత్వపు వ్యాజ్యం నడచింది. ఆ అభియోగాన్ని నెగ్గిన రావువేంకట కుమారపతి సూర్యారావు 1905 లో రాజ్యభారాన్ని స్వీకరించి 1907 లో పట్టాభిషిక్తులయ్యారు. వారి వ్యాజ్యపరిష్కారానికి దేవులపల్లి సోదరకవుల సాక్ష్యంకూడా ఎంతో దోహదం చేసింది. తమ ప్రభువుల అభియోగ విజయవార్తను విన్న సంతోషంతో అప్పటికప్పుడే ఆ వార్తను మోసుకువచ్చిన దివాణం నౌకరు దుండమ్మకు సుబ్బారాయశాస్త్రులు తమ చేతికున్న బంగారుగొలుసును తీసి యిచ్చేశారు.[19] ఆ ఫ్యూడల్ వ్యవస్థలో ఇముడలేని కృష్ణశాస్త్రి ఆ బంగారుగొలుసుల్ని తెగగొట్టుకొని బయటుపడ్డాడు.[20]

# దేశికులు

నాయెదలోఁ ద్వదీయ చరణమ్ముల చిహ్నము లెన్నఁడేనియున్
మాయవ, యేనిశీథపుఁ దమస్సులు మాసినఁగాని జీవయా
త్రాయతవీథి నొకడఁ బ్రయాణము సేయుదు నక్షయంపుఁ బా
థేయముగా గ్రహించి గురుదేవముఖ ప్రసుత గీతికాసుధల్

( గురుదేవుడు - 'పల్లకి' )

ఆరోజుల్లో ఆంధ్రసాహిత్యావనిలో సింహత్రయంగా పేరుపడ్డ వారిలో[1] ఒకరైన కూచి నరసింహంగారు రాజా చెల్లయ్యమ్మారావు హైస్కూలు హెడ్మాస్టరుగా పదవీ విరమణ చేశాక సూర్యారాయాంధ్ర నిఘంటు కార్యాలయంలో పనిచేస్తూ 1938 లో ఒకసారి తీవ్ర అస్వస్థతకు గురిఅయ్యారు. ఆ వార్త తెలిసిన ముగ్గురు శిష్యులు కాకినాడ నుండి రాత్రికిరాత్రే బయలుదేరివచ్చి నరసింహంగారిని పరామర్శించి 'శరీరమాద్యం ఖలుధర్మసాధనమ్' అని మీకు చెప్పేటంతటి వారం కాము. నిరంతర భాషావ్యాసంగమే మీ ఆరోగ్యాన్ని దెబ్బతీసింది. ఇకనైనా మీరు విశ్రాంతి తీసుకోండి'' అని ప్రార్థించి, ఆయన చేతిలో వందరూపాయలుంచి వెళ్ళిపోయారు. గురువుగారి యోగక్షేమాల్ని విచారింపవచ్చిన ఆశిష్యత్రయంలో కృష్ణశాస్త్రికూడా ఒకడన్న సంగతిని ప్రత్యేకించి పేర్కొనక్కరలేదు. నరసింహంగారిపట్ల ఆయన అంతేవాసులకున్న భక్తిశ్రద్ధ లెలాంటివో పై సంఘటన నిరూపిస్తున్నది. ఇక విద్యార్థుల చదువు సంధ్యల్ని గూర్చి నరసింహంగారు ఎంతగా పట్టించుకొనేవారో, ఎన్నిపాట్లు పడేవారో మధునాపంతుల సత్యనారాయణ శాస్త్రిగారు పేర్కొన్నసంగతులు తెలియజేస్తున్నాయి. రాత్రి పది

గంటలవేళ సాలువఁ గప్పికొని చేతికఱ్ఱపుచ్చుకొని మెల్ల మెల్లఁగ విద్యార్థులు చదువుకొను గదులకడకువచ్చి యెవరు చదువుచుండిరో, ఎవరు చదువుటలేదో బారెఁడు దూరమున నుండి పరిశీలించి, మరునాఁడు పాఠశాలకు వచ్చినపుడు విద్యార్థుల నొక్కొక్కరిని పిలిచి 'నాయనా రాత్రినీవెన్ని పొగచుట్టలు తగులబెట్టితివి' అని చమత్కారముగ నడుగుచు, మొగము వాయునట్లు చీవాట్లుపెట్టుచుండువారఁట కూచి నరసింహము పంతులుగారు."[3] కాబట్టే వారిశిష్యుల్లో ఒకరైన కురుమెళ్ళ వేఁకటరావుగారు "ఆదర్శజీవితం గడపిన మహావ్యక్తి ఆయన. నేను కవినికాను. అయితేమట్టుకు ఆయన్ని హిమవత్పర్వతంతో పోల్చి పద్యాలు వ్రాసి ఉండేవాణ్ణి"[4] అని; వేదుల శ్రీరామచంద్రకీర్తిగారు "ఆయన ఈ రోజుల్లో అయితే పదినేషనల్ అవార్డులు పొందేఅంత సమర్థుడూ మంచి క్రమశిక్షణా, విద్యాబోధనానుభవం కలవారు"[5] అని పేర్కొని ఉన్నారు. నరసింహంగారిపట్ల శిష్యులకున్న భక్తిప్రపత్తు లెలాంటివో వారిమాట లెత్తిచూపుతున్నాయి.

1907-13 సంవత్సరాలమధ్య కృష్ణశాస్త్రి పిఠాపురం హైస్కూల్లో విద్యార్థిగా ఉన్నప్పుడు కూచి నరసింహంగారు హెడ్మాస్టరుగా ఉండేవారు. ఆ రోజుల్లో మద్రాసు ప్రావిన్సులో "విద్యార్థుల్ని తీర్చి దిద్దడంలో పేరుపడ్డ రగ్బీస్కూలు హెడ్మాస్టరు ఆర్నాల్డుతో పోలుస్తూ నరసింహంగారిని 'ఆంధ్రా ఆర్నాల్డు' అని ప్రశంసించేవారు.[6] నరసింహంగారు సంస్కృతాంధ్ర భాషల్లో ఎంత గొప్పపండితులో ఆంగ్లభాషలోనూ అంతే నిష్ణాతులు.[7] నరసింహంగారే చిన్నతనంలో తనలో ఆంగ్ల సాహిత్యంపట్ల అభిరుచిని రేకెత్తించినారని కృష్ణశాస్త్రి పేర్కొని ఉన్నాడు.[8] ఆయన కృష్ణశాస్త్రిమీద మరొరకమైన ప్రభావాన్నికూడా నెరపిఉన్నారు. అదేఇక్కడ ప్రధానంగా గుర్తింపదగిఉంది. నరసింహం

గారి రామభక్తి ఎంతో ప్రగాఢమైంది.[9] తన రచనలన్నింటిని రామాంకితంచేసిన ధన్యజీవి అతడు. ఆయనలో పరాకోటి నందిన రామభక్తికి 'రామచంద్రప్రభో శతకం' ఒక చక్కటి లక్ష్యం. నరసింహంగారి ఈ రామభక్తిప్రభావమే చిన్నప్పుడు బ్రహ్మసమాజ వలయం నుండి బయటపడనప్పుడు అంతర్లీనంగాను, ఆ తర్వాత ఎన్నో ఆఘాతాలకులోనైన జీవిత చరమదశలో కొంత బాహిరంగాను కృష్ణశాస్త్రిపై ప్రభావాన్ని నెరపిందని పేర్కొనవచ్చు. 'గుహుడు' మొదలైన భావచిత్రాలు, శ్రవ్యనాటికలు, రామభక్తులకు వ్రాసిన చలనచిత్రగీతాలు మొదలైనవి ఈ అభిప్రాయానికి ఉపస్కారకంగా ఉన్నాయి.

'బ్రహ్మర్షి' రఘుపతి వెంకటరత్నంనాయుడుగారు కృష్ణశాస్త్రి మీద కనబరచిన ప్రభావాన్ని పరిశీలించడానికి ముందు హైస్కూల్లో చిన్నతరగతుల్లో ఉన్నప్పుడు అతడి లేతమనస్సుమీద చెరగని ముద్రను వేసిన మరియిద్దరు ఉపాధ్యాయుల్నిగూర్చి ఇక్కడ ప్రస్తావించడం అప్రస్తుతం కాబోదు. రాజా చెల్లయ్యమ్మారావు హైస్కూల్లో ఆదిపూడి సోమనాథరావు, జనమంచి సీతారామస్వామిగారలు ఆంధ్రాంగ్ల భాషల్ని బోధించేవారు. సోమనాథరావుగారు సంఘ సంస్కర్త. బ్రహ్మసామాజికులు. ఆయనకు విద్యార్థులంటే ఎనలేని వాత్సల్యం. ఆయన ముఖంలో చిరునవ్వు, చిన్నకళ్ళల్లో అనురాగం ఎప్పుడూ తొణికిసలాడేవి ఆయనదగ్గర చదువుకున్న కురుమెళ్ళ వేంకటరావుగారు "పోత పోసిన దయ ఆయన" అన్న చిన్నవాక్యంలో ఆయన అంతరమూర్తిని భాసింపజేసినారు. "సంఘ సంస్కర్త, ఏకేశ్వరోపాసకుడు ఐన ఆయన తెలుగుక్లాసులో సందర్భంవస్తే ఇంగ్లీషు పద్యాలూ, సూక్తులూ ఉపమానంగా చెబుతూ పిల్లల హృదయాల్లో కారుణ్యాన్ని రేకెత్తించేవారు. ఆ సూక్తులూ, నీతులూ చక్కని సులభశైలిలో పద్యాలు

వ్రాసి 'బుధభూషణం' అనే చిన్న పుస్తకాన్ని పిల్లలకు పంచిపెట్టేవారు. ఆయన పద్యాలేకాక ఎన్నో భక్తికీర్తనలు రచించారు.''[10] వాటిచేత కృష్ణశాస్త్రి చిన్ననాడే ఆకర్షితుడయ్యాడని ఊహించడానికి అవకాశం ఉంది. అప్పట్లోనే అతడి లేతమనస్సులో బ్రహ్మసమాజానికి సంబంధించిన సిద్ధాంతాలు వేళ్ళూదినాయని చెప్పడానికి వీలుంది.[11] సోమనాథరావుగారి 'దయాకరవిజయం'లోని 'ఓ దీనమందార! ఓ దయాసాగరా! నాదేమిలేదయా పరాత్పరా,' 'ఓ నాథ! నీ గుణమొకయింత తెలిసినవారి జన్మమె జన్మము' వంటి పాటల్లోని భావాలు, బాణీలు ఆ తర్వాత కృష్ణశాస్త్రి బ్రహ్మసమాజంకోసం వెలయించిన పాటల్లో ధ్వనించి ఉండడం ఈ సందర్భంలో గుర్తింపదగిఉంది.

చిన్నక్లాసుల ఇంగ్లీషుమేష్టారయిన జనమంచి సీతారామస్వామిగారు కృష్ణశాస్త్రిమీద మరోవిధమైన ప్రభావాన్ని నెరపిఉన్నారు. ఆయనది శ్రావ్యమైన కంఠస్వరం. పద్యాల్ని అనేకరాగాలతో భావపూరితంగానూ, హృదయంగమంగానూ చదివేవారు. ''ఆయన ప్రత్యేకత శతకాలలోని పద్యాలు భక్తితన్మయత్వంతో చదవడం. లెక్కలేనన్ని శతకాలలోని భక్తిభావపూరితమైన పద్యాలు వందలూ వేలూ ఆయనకి కంఠస్థం. మంచిమంచి పద్యాలు పిల్లలందరినీ కంఠస్థం చెయ్యమని ప్రేరేపించేవారు''[12] అన్న పురుమెళ్ళ వేంకటరావుగారి మాటలు దీనికి ఉపస్కారకంగానే ఉన్నాయి. సీతారామస్వామిగారి ప్రోత్సాహమూ, శ్రావ్యమైన వారి పద్యపఠన పైఖరీ ఆ తర్వాత కృష్ణశాస్త్రి తెలుగుదేశం నలుమూలలా తిరిగి సాహిత్యసభల్లో చేసిన కావ్యగానానికి ఎంతో ఇంతో దోహదం చేశాయనడానికి వీలుంది. ఇక కృష్ణశాస్త్రి జీవితానికి సంబంధించి ఒక సత్పథాన్ని, సాహిత్యానికి సంబంధించి ఒక దృక్పథాన్ని నిర్దేశించిన రఘుపతి వేంకటరత్నంనాయుడుగారి ప్రభావం అతడిమీద ఎంతవరకు ప్రసరించిందో పరిశీలించడం అవసరం.

"ఆధునిక ధర్మానికి అనుగుణంగా కిటికీలు తెరిచి, కొత్తచూపు ప్రసాదించినవారు వేంకటరత్నంనాయుడుగారు. సారస్వతప్రియత్వమే కాక లోకమంతటినీ ఆప్యాయంగా ఆలింగనం చేసుకొనే అనురాగబంధం ఆయన శిష్యత్వంవల్ల లభ్యమయింది. జీవితంలోని ప్రతి అల్పానుభవాన్ని ఒక ఉదాత్తదృష్టితో అనుభవించేశక్తి ఆయనవల్ల కలిగింది"[13] అని కృష్ణశాస్త్రి పేర్కొన్నమాటలు నాయుడుగారు అతడిని ఎంతగా ప్రభావితుణ్ణి చేశారో తెలియజేస్తున్నాయి. 1914-16 సంవత్సరాల ప్రాంతంలో కృష్ణశాస్త్రి కాకినాడ పిఠాపురం రాజావారి కాలేజీలో ఎఫ్. ఏ. తరగతిలో ఉన్నప్పుడు నాయుడుగారి గురుత్వం లభించింది. ఈ సాంగత్య ఫలితంగానే కృష్ణశాస్త్రి 'తరుణమనోమందిరం తలుపులు తెరుచుకొన్నాయి.' నాయుడుగారే వానిలో 'ప్రభాత మంగళకాంతులనూ, పరిమళ భరాలైన దివ్యపవనాలనూ' ప్రసరింపజేశారు. "శ్రీ నాయుడుగారు పూర్ణచంద్రునివంటి శీతకిరణుడు. తన చల్లని చూపులతో అమృతమును చిందించి పతితుల నెందరినో పవిత్రమొనర్చిన పావనమూర్తి. విద్యార్థులకు కల్పతరువు. దీనులకు ప్రియతమబంధువు. మానవులలో ప్రేమారాధకుడు. వక్తలలో మహావక్త. విద్యావేత్తలలో వినుతికెక్కినవాడు. బ్రహ్మమందిరములో బోధకుడు. ఋషులలో బ్రహ్మర్షి. సంస్కర్తలలో దయాసాగరుడు. అకలంకహాస్యప్రియుడు. ఆయన నిత్యజీవితవిధానమే మతం. ప్రేమకు, సేవకు ఆయన మారురూపు"[14] అన్న గొట్టిపాటి బ్రహ్మయ్యగారి మాటలు నాయుడుగారి బహుముఖమైన విశిష్ట వ్యక్తిత్వాన్ని ఆవిష్కరిస్తున్నాయి. "నేను కూడా వారి చరణసన్నిధానాన కూర్చున్నవాడనూ, వారికి అత్యంత సన్నిహితుడనూ, వారి శిష్యులలో దాదాపు తుదితరం వాడను. ఒకే ఒక దివ్యసంసారం మాది. మా ప్రేమలూ, మా భక్తిప్రపత్తులూ, మా గురుశిష్యసంబంధాలు మీలో చాలామంది ఇప్పుడు భావించు

కోనైనా లేరేమో''[15] అన్న కృష్ణశాస్త్రి మాటలు ఆ గురుశిష్య సంబంధం ఎటువంటిదో విశదీకరిస్తున్నాయి. 1939 వ సంవత్సరంలో నాయుడుగారు పరమపదించినప్పుడు కృష్ణశాస్త్రి తన గురుదేవుని స్మృతికి తెచ్చుకొని వ్రాసిన స్మృతిపద్యాలు దీనికి ఊపిరిపోస్తున్నాయి. ఈ క్రింది పంక్తులు కృష్ణశాస్త్రి ఎదలో అప్పుడు పొంగిపొరలిన భావ వాహినిలోని కొన్ని బిందువులు మాత్రమే.

ఈ జడజీవితమ్ము పలికించితి, వీ యఘపంకమందు నం
భోజము మొల్వఁజేసితి, వపూర్వము నీదయ, యీ నిశీథినీ
రాజనమెత్తినావు, విపులమ్మగు నీ యెదనిండెనే శర
ద్రాజిత చంద్రకాంతులమృతమ్ములు స్వర్గలతాంత వాసనల్[16]

ఇటువంటి ప్రత్యయంతోనే కృష్ణశాస్త్రి 'బ్రహ్మర్షి మాట' అన్న మకుటంతో నాయుడుగారి సుభాషితాలను కుదిగ్రుచ్చారు.[17] అటువంటి భక్తిప్రపత్తులతోనే 'ఏభై సంవత్సరాలపాటు ఆంధ్రయువకుల్ని సత్యసాన్నిధ్యంలో నిలబెట్టిన అభినవ సాక్రటీస్' ఐన తన గురువుగారి జీవితచరిత్రను నిబంధించడానికి పూనుకొన్నాడు.

నాయుడుగారి ప్రభావం కృష్ణశాస్త్రిమీద రెండురకాల ప్రవర్తిల్లినట్లు కల్పిస్తుంది. "కాకినాడలో వెంకటరత్నంనాయుడుగారి శిష్యుణ్ణయి మతసంఘ సంస్కరణోద్యమాల ప్రభావంలో పూర్తిగా పడ్డాను. ఆంగ్ల సాహిత్యంతోనూ, సూఫీవంగ వైష్ణవసాహిత్యాలతోను నా గురుదేవులద్వారానే నాకు కొంచెం పరిచయం. తరువాత హరిజనోద్యమం లోనూ మా ఊళ్లో కొంతతిరిగాను. కొన్నిసంవత్సరాలపాటు నన్ను బంధువులూ, బ్రాహ్మణులూ బహిష్కరించారు''[19] అన్న కృష్ణశాస్త్రి మాటలు దాని స్వరూపాన్ని ఆవిష్కరిస్తున్నాయి. కృష్ణశాస్త్రి సూఫీ వంగవైష్ణవ తత్వాన్ని ఏవిధంగా ఒంటపట్టించుకొన్నదీ అతడి పద్యకృతుల్ని సమీక్షించినప్పుడు పరిశీలించడం జరిగింది. హరిజనోద్ధ

రణ, కళావంతుల వివాహోద్యమం మొదలైన సంఘ సంస్కరణకు సంబంధించిన కార్యకలాపాల్లో మాత్రం నాయుడుగారి ప్రభావానికిలోనై కృష్ణశాస్త్రి ఏ విధంగా చురుగ్గా పాల్గొన్నదీ ఇక్కడ ప్రస్తావించడం సముచితంగా ఉంటుంది.

మహాత్ముడు హరిజనోద్ధరణకు నడుంకట్టని ఆ రోజుల్లోనే ప్రేమకు మారురూపువైన నాయుడుగారి ప్రగతిశీలక దృక్పథం, పిఠాపురం రాజాగారి వితరణశీలం దళిత జాత్యుద్ధరణకు పాదులుతీశాయి. అప్పట్లోనే పిఠాపురం పరిసరప్రాంతాల్లో హరిజన బాలబాలికలకు ప్రత్యేకంగా హాస్టళ్ళు నెలకొల్పబడ్డాయి. 1925 నాటికే కులాంతరులతో సహపంక్తి భోజనం చేసినందులకు స్వకులజులచేత, బంధువులచేత వెలివేయబడ్డ కృష్ణశాస్త్రి పిఠాపురంలోని 'హరిజనహోం'కు జీతం బత్తెంలేని 'వార్డెను' బాధ్యతల్ని నిర్వహించడం వారి ఆగ్రహావేశాలను మరింతగా గురిఅయ్యేటట్లు చేసింది. "ఒకనాడు పిఠాపురంలోనే హరిజన హాస్టలులోకి (మహారాజావారిది) నన్ను తీసుకొనివెళ్ళి వారిచేత నాకు ఇడ్డెనలు, పళ్ళు పెట్టించారు. నేను నిరభ్యంతరంగా ఆరగించగా 'కొందరికి హృదయాలు వాళ్ళతొడల్లో ఉంటాయి. మీకు యథాస్థానంలో ఉంది' అన్నారు. నా తండ్రి బారిష్టరీ చదువుకోసం ఇంగ్లాండు వెళ్ళడంచేత నా చిన్నప్పుడే బంధువులచేత వెలివేయబడ్డాను కానండి అన్నాను. నవ్వారు"[20] అని కవికోకిల ఆవంత్స వేంకటరంగారావుగారు ఆవిష్కరించిన స్మృతి అప్పటి 'బంధువుల'ను గూర్చి కృష్ణశాస్త్రి చేసిన వ్యాఖ్యానాన్ని తెలియజేస్తున్నది. సాంఘిక బహిష్కారానికి గురియైన ఆ పరిస్థితుల్లోనే కృష్ణశాస్త్రి ఊరికి, హరిజనవాడకి మధ్య మిత్రుడు రంగనాయకులు చూపిన పాకలో కొంతకాలం తలదాచుకోవలసి వచ్చింది.[21] ఈ బెదరింపుల్ని, ఆంక్షల్ని లెక్కచేయకుండా ఆ రోజుల్లో కృష్ణశాస్త్రి ఎంతోమంది హరిజన బాలురలో ఆత్మవిశ్వాసం పాదుకొనేటట్లు

చేశాడు.[22] కాబట్టే ఏభై ఏళ్ళ తర్వాత ఒకసారి కృష్ణశాస్త్రి స్వగ్రామానికి వెళ్ళినప్పుడు "పిఠాపురంలో మా చదువుకు, ఆత్మవిశ్వాసానికి, అభివృద్ధికి కారకులై యాభై ఏళ్ళ క్రిందటనే మమ్మల్ని మానవులుగా చేసి ఉద్ధరించారు. మీకు ఎదురైన బెదరింపులు, అంక్షలు లెక్కపెట్ట లేదే! మా యెడగల మీ ప్రేమ అంతటిది! మలినపంకంనుండి నలినాలను పైకితీశారు. గడ్డిపువ్వుల్ని గులాబీపువ్వులుగా మార్చారు! ఇదంతా చేసింది మీరు. మీరే! మాకు 'సుధర్మభవనం' నిర్మించింది మీరే. వైజయంతీమాలలోని ప్రసవాలను చేసినదీ మీరే"[23] అని పిఠాపురం హరిజనులు ఎంతో ఆప్యాయతతో 'పూలదోసిళ్ళు' ఎత్తారు.

ఈ సంస్కరణ దృక్పథంతోనే ఆనాడు కృష్ణశాస్త్రి మనిషికి మనిషికిమధ్య అడ్డుగోడల్ని కల్పిస్తున్న కులభేదాలను కూలదోయమని ఎలుగెత్తి చాటినాడు. కృష్ణశాస్త్రికి సన్నిహితులు, సహచరులువైన తల్లాప్రగడ ప్రకాశరాయుడుగారు నవం. 1,1974 వ తేదీన హైదరాబాద్ ఆంధ్ర మహిళాసభ ఆధ్వర్యాన ఏర్పాటుచేయబడిన కృష్ణశాస్త్రి జన్మదినాభినందన సభ కధ్యక్షతవహిస్తూ తెలియజేసిన ఒకానొక సంఘటన ఈ విషయాన్నే ఉద్ఘాటిస్తున్నది. "మనం చెప్పుకోవడం మరచిపోయిన మాట దుర్గాబాయమ్మగారు ఇప్పుడే జ్ఞాపకంచేసి వెళ్ళారు. కృష్ణశాస్త్రి మాటలోను, చేతలోను ముఖ్యంగా సంఘసంస్కార ప్రియుడుకూడానని. అవును, తెలిసిఉండికూడా నేనూ మరచాను ఆ మాట చెప్పడం. ఒకప్పుడు మేము తణుకుతాలూకాలోని నత్తారామేశ్వర గ్రామానికి వెళ్ళాము. హరిజన సమావేశానికో లేక ప్రచారానికో బాగాగుర్తు లేదు. అప్పటికప్పుడు ఒక గీతం వ్రాసి బహిరంగంగా ఆలపించాడాయన. 'తెగదెంచండయ్యా, ఏ ద్వేషపు సంకెళ్ళని! తెగనివి కావయా, యుగయుగములవైనా కాని' – అదీ పల్లవి. మరొక చరణం ఇట్లావుంది. 'మాలలమేమో, పనికిమాలిన వారమొ యేమో, (శ్రీ) లలితేశ్వర గళనవ మాలాకుసుమాలమేమొ.' అంతట్లో ఆయన హృదయం ఉప్పొంగి, తోటిహృదయాలను ఉప్పొంగ జేయ గలిగింది."[24]

'వేశ్యలలో మాతృరూపం వెల్లడించిన' బ్రహ్మర్షి నిర్దేశమూ, 1929-30 సంవత్సరాల్లో 'విశ్వభారతి' కి చేసిన యాత్రలప్పుడు హేమ చంద్రసర్కార్ వంటి వంగసంస్కర్తలతో కలిగిన సాంగత్యమూ కృష్ణ శాస్త్రిని కళావంతుల సంస్కరణోద్యమంలో కాలూనేటట్లు చేశాయి. ఆ 'ఉడుకు' లోనే అతడు పిఠాపురంలో 'వేశ్యావివాహ సంస్థ' ను స్థాపించాడు. దివాణాన్నే అంటిపెట్టుకొని జీవితాల్ని వెళ్ళదీసుకొంటున్న మందారమాల, కమలనేత్రి మొదలైన కళావంతులను ఒప్పించి, డబ్బు సాయంచేసి కృష్ణశాస్త్రి వారికూతుళ్ళకు పెళ్ళిళ్ళు చేయించాడు.[25] ఆ రోజుల్లో ఇది చాలామందికి కంటగింపైంది. తన దేశికులనుండి సంక్రమించిన గుండె నిబ్బరంతోనే కృష్ణశాస్త్రి ఇటువంటి ప్రతికూల పరిస్థితుల్ని ఎదుర్కొగలిగాడు. అటువంటి గుండెదిటవుతోనే అతడు ఒకప్పుడు 'బ్రాహ్మణేతర మహాసభ' కు అధ్యక్షత వహించిన నాయుడు గారితో "మనకు కులం లేదన్నప్పుడు[26] మీరు బ్రాహ్మణేతర సభకి అధ్యక్షతకు అంగీకరించారంటే కులవ్యవస్థను అంగీకరించినట్లేకదా" అని తగాదా పడ్డాడు.[27] ఇక చిన్నప్పుడు వీథిబడిలో కృష్ణశాస్త్రిచేత 'ఓన మాల' ను దిద్దించిన కావయ్యమేష్టారినిగూర్చి రెండు మాటల్ని చెప్పు కొని ఈ ప్రకరణాన్ని పూర్తి చేయడం సముచితంగా ఉంటుంది.

కావయ్య మేష్టారంటే లోపలభయమూ, భక్తీ గూడుకట్టుకొని ఉన్నా కృష్ణశాస్త్రి చిన్నప్పుడు తోడి బాలురతో గొంతుకలిపి 'రావిచెట్టు మీద చిలకోయ్, కావయ్యమేష్టరు పిలకోయ్' అని అల్లరి చేసినవాడే. అరవై ఏళ్ళ తర్వాత తన పల్లెమీదకు గాలిమళ్ళినప్పుడు అనేకానేక సంగతుల్ని నెమరువేసుకొన్నప్పుడు కృష్ణశాస్త్రి స్మృతిపథంలో కావయ్య మేష్టారితోబాటు 'ముక్కుకొసదాకా జారిన ఆయన కళ్ళ జోడూ, ఏడాది పొడుగునా తొడుగుకునే కోటున్నూ'[28] బొమ్మకట్టి ఉండడం గుర్తింపదగిన విశేషం. భావిపౌరుల్ని అభ్యుదయపథంలో నడి పించే దేశికుల స్థితిగతులు అప్పటికీ యిప్పటికీ ఒక్కలాగే ఉన్నాయికదా!

# ఉద్యోగం

అపుడు నాగొంతు రవ్వంత కోయిలగాన
అపుడు నా మనసు ఆవంత ఊయెలగాన
అపుడు నామనికి కరుణామ్రశాఖిక గాన
ఆలపించితిని అల్పాల్పగీతికలు కొన్ని

(చరణసన్నిధిని - పల్లకీ)

1925 ప్రాంతంలో మద్రాసు ట్రిప్లికేన్ హైరోడ్‌లో 'వెలిసి పోయిన నల్ల ఆల్పాకాకోటు' తొడుక్కొనిఉన్న కృష్ణశాస్త్రి ట్రాంబండి నుండి దిగుతుండగా, అదేబండిని ఎక్కుతున్న ఆచంట జానకిరాంకి బండారు వీరరాజేశ్వరరావు 'ఫలానా కృష్ణశాస్త్రి ఈయనే' అని పరిచయంచేశాడు. మల్లెపూవువంటి తెల్లని మల్లులాల్చీతో, కనుబొమలకు రాచుకొన్న పునుగుతో, ముఖాన తీర్చిదిద్దుకొన్న అగరుచుక్కతో మరునాడు ఠంచనుగా పదిగంటలకి చుక్క తెగిపడినట్లు మల్లంపల్లి సోమశేఖరశర్మ ఇంటికి వచ్చిన కృష్ణశాస్త్రిని జానకిరాం ఉత్కంఠ అణచుకోలేక 'నిన్న ఆ వెలిసిపోయిన కోటెందుకు తొడుక్కున్నావు?' అని అడిగాడు. "అదా... ఎవరో 'నీకు ఉద్యోగం ఇస్తాను రమ్మ'న్నారు. వెళ్ళక తప్పిందికాదు. వారు అన్నంతపనీ చేస్తారేమోనని జడిసి నేను ఆ కోటు తొడుక్కు వెళ్ళాను. ఉద్యోగంరాలేదు" అని ఆ సందర్భంలో కృష్ణశాస్త్రి చమత్కారంగా చెప్పిన మాటలు ఉద్యోగమంటే అతడి కున్న 'తగని భయాన్ని' వ్యక్తం చేస్తున్నాయి. కొన్నిసూత్రాలకి కట్టువడి, కొంతమందికి తలవంచి, వ్యక్తిత్వాన్ని చంపుకొని ఒకచోట నిలకడగా ఉద్యోగం చేయడం కృష్ణశాస్త్రి ప్రవృత్తికి సరిపడని సంగతి.

1957 వ సంవత్సరంలో హైదరాబాద్ 'ఆలిండియా రేడియో' లో 'స్పోకన్ వర్డ్ ప్రొడ్యూసర్' గా చార్జి తీసుకోవడానికి వెళ్ళేముందు అప్పుడు బ్రతికిఉన్న పెద్దక్కకు విషయం చెప్పినప్పుడు "ఎవడ్రానీకన్న పనికిమాలినవాడు నీకు ఉద్యోగం ఇచ్చినవాడు? ఇదివరకు రెండు మూడు చోట్ల మేష్టరీపని అఘోరించావు. ఒక్కచోటనైనా ఒక్కఏడాదికన్న నిన్నువాళ్ళు ఉంచలేదు. ఉద్యోగానికి పనికిరావని పొమ్మన్నారు. అంత దూరం వెళ్ళాక మళ్ళీ తన్ని తగిలేస్తేనో" అని ఆమె దెప్పిపొడిచి ఆడిన మాటల్ని కృష్ణశాస్త్రి ఒకానొక సందర్భంలో ప్రస్తావించి ఉన్నాడు.[2]

1918 వ సంవత్సరం మద్రాసు విశ్వవిద్యాలయం నుండి బి. ఏ. పట్టాన్ని అందుకొన్నతర్వాత కాకినాడ మిషన్ హైస్కూల్లో (మెక్లారిన్ హైస్కూలు) బడిపంతులుగా చేరడంతో కృష్ణశాస్త్రి ఉద్యోగ ప్రస్థానం ప్రారంభమైంది. అక్కడ అతడా ఉద్యోగాన్ని రెండేండ్లు మాత్రమే నిర్వహించాడు. తర్వాత 1921 - 22 సంవత్సరాలమధ్య పెద్దాపురం మిషన్ హైస్కూల్లోను, 1922 - 23 సంవత్సరాలమధ్య పిఠాపురం రాజా చెల్లయ్యమ్మారావు హైస్కూల్లోను మేష్టరుగా పని చేశాడు. 'ఒక యేలిక నొకవేలుపు నొకరీతిగ గొలిచియున్న' వంశానికి చెందిన కృష్ణశాస్త్రిలో మోసులెత్తిన స్వతంత్రభావాల్ని అప్పట్లో పిఠాపురం రాజావారు హర్షింపలేకపోయారు. దానికితోడు రాజకీయంగా తనకు సరిపడని వ్యక్తి[3] కూతురిని వివాహంచేసుకొన్న కృష్ణశాస్త్రికి, రాజాగారికి మధ్య తీవ్రమైన అభిప్రాయభేదాలు తలఎత్తాయి.[4] తత్ఫలితంగా అతడి ఉద్యోగం ఊడింది. కోటనుండి వచ్చే వార్షికభరణం ఆపివేయబడింది. ఇది కృష్ణశాస్త్రి జీవితంలోనేకాక నవ్యాంధ్ర కవిత్వలోకంలోనే ఒక మలుపును తీసుకొనివచ్చింది. "1923 నాకూ గొప్పసంవత్సరమే. ఆయేడు నాస్కూలు మేష్టరీ ఉద్యోగం నా అదృష్టంవల్ల పోయింది"[5] అని కృష్ణశాస్త్రి ఆ సంఘటనని వ్యాఖ్యానించి ఉండడం

గుర్తింపదగిఉంది. బరంపురంనుండి బళ్లారిదాకా వందలాది చిన్నాపెద్దా సాహిత్యసభల్లో కృష్ణశాస్త్రి నవ్యకవిత్వాన్ని వినిపించడానికి, దానికొక స్ఫూర్తిని కల్గించడానికి ఈ సంఘటనే దోహదం చేసింది. దాదాపు పదిసంవత్సరాలపాటు కృష్ణశాస్త్రి ఆంధ్రదేశమంతటా కవితాజైత్రయాత్ర చేయడానికి ఇది దారితీసింది.

1931 లో కృష్ణశాస్త్రికి సంతానం కలిగాక (శ్రీ బుజ్జాయి జననం) అతడి జీవితం మరోమలుపుకు లోనైంది. అప్పటి వరకూ ఇంటి పట్టున ఉండక నవ్యకవిత్వాన్ని గానంచేస్తూ ఊళ్ళు తిరుగుతున్న కృష్ణశాస్త్రిని రఘుపతి వెంకటరత్నంనాయుడుగారు మందలించి, బాధ్యతను గుర్తెరగజేసి పిఠాపురం రాజాగారి కాలేజిలో తెలుగు ట్యూటరుగా ఉద్యోగం వేయించారు.[6] తన ప్రవృత్తికి సరిపడని ఆ ఉద్యోగాన్ని అతడు "ట్యూటర్సు గదిలో ఎదురుగుండా కనబడేటటువంటి నల్లమామిడి చెట్టుని చూస్తూ దిగులుగా ఎక్సర్‌సైజ్ బుక్స్ దిద్దుకొంటూ"[7] పదిసంవత్సరాలపాటు చేయక తప్పలేదు. "మునుపటి గొప్పరోజులన్నీ గతించాయి; బూజుపట్టి రాయైచచ్చిపోయాను – నన్ను చెరసాలలో పెట్టినారులెండి" అని కృష్ణశాస్త్రి తర్వాత తనతిప్పల్ని తలచుకొన్నప్పుడు కాలేజి ఉద్యోగాన్ని గూర్చి నిట్టూర్చి ఉండడం[8] గమనార్హం.

'శౌరియారణము' నీ, 'మలయాప్రవణము' నీ, 'మరణమని, మసనమని,' 'వరదలని, వరపులని,' 'కరవుకాటకములని' ఎప్పుడూ ఏవో అనిష్టమైన వార్తల్ని ప్రసారంచేసే రేడియోకార్యక్రమాలను "విననిష్టపడను, వినకున్నను తోచదు, విన్నచో మనస్సు వికలమౌ"[9] అని లలితహాస్యంతో తనవైమనస్యాన్ని కనబరచిన కృష్ణశాస్త్రి 1957-62 సంవత్సరాల మధ్య 'స్పోకెన్ వర్డ్ ప్రొడ్యూసర్' గాను, 1962-64 సంవత్సరాలమధ్య 'సాహిత్య సలాహ్‌కార్' గాను ఆలిండియా రేడియో, హైదరాబాద్ కేంద్రంలో ఉద్యోగాన్ని నిర్వహించాడు. కృష్ణశాస్త్రికీ,

ఆలిండియా రేడియోకీ అంతకు మునుపు ఇరవై సంవత్సరాల నుండీ అవినాభావసంబంధం ఉంది. అప్పుడేమో ప్రోగ్రాము లివ్వడానికి కొత్త అల్లుడు అత్తవారింటికి వెళ్ళినట్లు రేడియోస్టేషనుకి వెళ్ళేవాడు. స్టేషను డైరక్టర్లని, ప్రొడ్యూసర్లని ముప్పతిప్పలు పెట్టి మూడుచెరువుల నీళ్లు తాపించేవాడు.[10] ఆ తర్వాతేమో ఆ బరువు బాధ్యతల్ని తానే మోయక తప్పలేదు ఈ వ్యాపకాలకంటె కృష్ణశాస్త్రి 1923–32 సంవత్సరాల మధ్యకాలంలో నిర్వహించిన జీతం బత్తెంలేని ఉద్యోగమే ఇక్కడ ప్రధానంగా ఎన్నిదగిఉంది. దానివల్ల నవ్యాంధ్ర సాహిత్యానికి, ముఖ్యంగా భావకవితోద్యమానికి కలిగిన ఉజ్జీవాన్ని గూర్చి ఇక్కడ ప్రస్తావించడమే సందర్భోచితంగా ఉంటుంది.

1923 వ సంవత్సరంలో ఉద్యోగాన్ని కోల్పోయి, కవిమిత్రుల్ని పలకరించే మిషతో ఊళ్ళు తిరుగుతున్నప్పుడే కృష్ణశాస్త్రికి రాజమండ్రిలో ప్రఖ్యాత కవయిత్రి శ్రీమతి సరోజినినాయుడు సోదరుడైన హరీంద్రనాథ్ చటోపాధ్యాయ కావ్యగానాన్ని వినే అవకాశం కలిగింది. చటోపాధ్యాయ తన పందొమ్మిదవ ఏటనే 'ది ఫస్ట్ ఆఫ్ యూత్' అన్న కవితాసంకలనాన్ని ప్రకటించిన ప్రతిభావంతుడు. ఆయన ఆంగ్లంలో భిన్నసాహిత్యప్రక్రియలకు సంబంధించిన రచనల్ని వెలువరించడమేగాక తన గాత్రమాధుర్యంతో సోమర్ సెట్ మామ్ వంటి రచయితల్ని కూడా మెప్పించాడు. ఆ రోజుల్లో ఆయన హార్మోని వాయిస్తూ, తన శ్రావ్యమైన కంఠంతో బ్రిటిష్ ప్రభుత్వానికి వ్యతిరేకంగా దేశభక్తి ప్రపూరితాలైన గీతాలను ఆలపిస్తూ[11] దేశమంతా పర్యటించాడు. అతడు కవితనుపాడి శ్రోతల్ని ఆనందాబ్ధిలో ఓలలాడించేవాడు. హరీంద్రనాథుని కావ్యగానం కృష్ణశాస్త్రిమీద ప్రగాఢమైన ప్రభావాన్ని కనబరచింది. ఆ విధంగా ఆకర్షితుడైన కృష్ణశాస్త్రి కూడా 'నేనెందుకు అలా తిరుగుతూ నాలుగుచోట్లా చదవకూడదు?' అన్న ఆలోచనకు లోనయ్యాడు. అప్పటికే కృష్ణశాస్త్రికి పింగళి

కాటూరుల 'తొలకరి,' విశ్వనాథ 'ఆంధ్రపౌరుషం,' నోరి 'గీతమాలిక,' కొడవటిగంటి వెంకటసుబ్బయ్య 'సంధ్యారాగం' మొదలైన నవ్యాంధ్ర కృతుల్లోని వందలకొలది పద్యాలు కంఠస్థాలు. వాటితోబాటు అప్పటికి 'శారద,' 'సాహితి' మొదలైన పత్రికల్లోపడ్డ కొత్తపద్యాలను ఏర్చి కూర్చి కృష్ణశాస్త్రి తన కావ్యగానానికి సంబంధించిన ఒక 'పథకాన్ని' ఏర్పరచుకొన్నాడు "'సంధ్యారాగం' లోని 'ఆ సుమాగుమా తెరువరీ' అన్న స్వాగతంతో ప్రారంభించి, 'తొలకరి' లోని 'కవితాసామగ్రి' తరువాత చదివి, మిగిలిన కావ్యాలు వరసగా చదివేవాణ్ణి. చదివేవాణ్ణేమిటి. పాడేవాణ్ణి!"[12] అని అతడే తన 'కావ్యపంథా'ను వివరించి ఉన్నాడు.

1923 వ సంవత్సరం రాజమండ్రిలో ప్రఖ్యాత చిత్రకారుడు దామెర్ల రామారావుఇంట ఏర్పాటుచేయబడిన చిన్నగోష్ఠిలో కృష్ణశాస్త్రి ప్రప్రథమంగా కావ్యపఠనం చేశాడు. నిత్య కవితోత్సవాన్ని అభిలషించిన అతడు అప్పటినుండి దాదాపు పదిసంవత్సరాలపాటు దేశమంతా తిరిగాడు. అప్పట్లో అతడికి తన "తోడికవుల పద్యాలు చదవడానికి ఎక్కడో దిగుతూ సరదాగా ట్రయినులోనే ఉండిపోయి తిరుగుతూండడం ఒక అలవాటు"గా[13] ఉండేది. కృష్ణశాస్త్రి సరదామాట ఎలాఉన్నా భావకవిత్వం ఒక ఉద్యమంగా జవాన్ని, జీవాన్ని అందుకోవడానికి; చదువుకొన్న యువకుల్లో నవ్యకవిత్వాన్ని గూర్చిన ఒక అవగాహన ఏర్పడడానికి ఆరోజుల్లో అతడి కవితాగానం ఎంతగానో తోడ్పడింది. "నేను ఆయనను 1925 లోనే మొదటిసారిగా చూశాను. నేను గుంటూరులో ఇంటరు చదువుతూ హాస్టల్లో ఉండేవాణ్ణి. మా వార్డెన్ తెలికిచర్ల వెంకటరత్నంగారు దేవులపల్లివారిచేత మాకు గోష్ఠి జరిపించారు. అప్పటి అధునాతన కవిత్వంలో నాకు తెలిసినవి యెంకిపాటలు మాత్రమే. కాని దేవులపల్లివారు ఆనాడు అధునిక కవిత్వం చాలా విని

పించారు"[14] అని కొడవటిగంటి కుటుంబరావుగారు పేర్కొన్న విషయం ఆ రోజుల్లో కృష్ణశాస్త్రి కావ్యగానం యువకుల హృదయాల్ని ఏ విధంగా తట్టిలేపిందో, నవ్యకవిత్వం వారికి చేరువకావడానికి ఏ విధంగా తోడ్పడిందో తెలియజేస్తున్నది.

నవ్యకవిత్వమంటే బొత్తిగా ఆసక్తి లేని ప్రాచీన సాహిత్యాభిమానులపై కూడా కృష్ణశాస్త్రి కావ్యపఠనం అంతో ఇంతో ప్రభావాన్ని కనబరచింది. నవ్యకవితపట్ల వారు కొంత మొగ్గుదల చూపడానికి అది తోడ్పడింది. 1920 వ సంవత్సర ప్రాంతంలో పెద్దాపురం మిషన్ హైస్కూల్లో కృష్ణశాస్త్రి ఉపాధ్యాయుడుగా ఉన్నప్పుడు చిన్నతరగతి విద్యార్థిగా ఉండిన చెళ్ళపిళ్ళ సీతారామమూర్తిగారు 1924-28 సంవత్సరాలలో కాకినాడ కాలేజిలో విద్యార్థిగా ఉన్నప్పుడు కృష్ణశాస్త్రి కావ్యగానంచేత ఏ విధంగా ప్రభావితులై నవ్యకవిత్వంపట్ల ఆసక్తిని పెంచుకున్నారో ఈ పంక్తులు చక్కగా నిరూపిస్తున్నాయి. Town Hall లో వారు ఆరోజున నవ్యకవుల రచనల పఠనము చేస్తున్నారు. ఇదివరలోనే ఆయన రూపముపట్ల ప్రభావితుడైన నేను ఆయన పఠనము వల్ల మరింత ముగ్ధుడనైనాను. అంతవరకు నవ్యకవితలో ఆసక్తి లేని నాకు ఆ రచనలమీదికి దృష్టి మరలుటకు కారణము వారి చిత్రమైన పఠనారీతి. కవివాడిన మాటల అర్థాన్ని మాత్రమేగాక, వాని వెనుక ఉండే భావాన్ని, అనుభూతిని స్ఫురింపజేసే పద్ధతి అది. రాయప్రోలు సుబ్బారావు, పింగళి లక్ష్మీకాంతం, కాటూరి వేంకటేశ్వరరావు, విశ్వనాథ సత్యనారాయణ, నండూరి సుబ్బారావు, వేదుల సత్యనారాయణ శాస్త్రి మున్నగువారి కావ్యాల వైశిష్ట్యాన్ని తన మధురమైన కంఠంతో గానంచేసే తీరులోనే శ్రోతలకు విశదపరచే శక్తి వారికి ఉండేడిది."[15] ఇంతగా తాదాత్మ్యాన్ని చెంది, భావావిష్కరణకు తోడ్పడేవిధంగా కృష్ణశాస్త్రి ఇతరకవుల కృతుల్ని ఆలపించి వాటికొక ప్రశస్తినీ, ప్రాచు

ర్యాన్నీ తెచ్చిపెట్టాడు.[16] "వాటి నా వేశంతో పాడుతున్నప్పుడు విని, 'యెంకిపాటల' రచన నాకుకల్పించి తగని గౌరవం నాకు ఇచ్చినవాళ్లూ ఉన్నార"ని కృష్ణశాస్త్రి ఈ విషయాన్ని చమత్కరించి ఉన్నాడు.[17]

నవ్యాంధ్ర సాహిత్యలోకంలో భావకవిత్వం ఒక ఉద్యమంగా ముమ్మరించినప్పుడు దాన్ని ఎదుర్కోవడానికి సంప్రదాయవాదులు ఒక వంక మోహరించారు. ఒక్కోసారి వారు సభల్లో భావకవిత్వాన్ని తీవ్రంగా గర్హించేవారు.[18] సాహితీసమితి సభ్యులు, కృష్ణశాస్త్రికి సన్నిహితులుఐన కవికోకిల ఆవంత్స వేంకటరంగారావుగారు తెలియజేసిన ఒకానొక ఘటన ఆ రోజుల్లో కృష్ణశాస్త్రి ఎదుర్కొన్న ప్రతిఘటననే తెలియజేస్తున్నది. విజయనగరం మహారాజావారి కాలేజిలో 'త్రివేణి' సంపాదకులైన కోలవెన్ను రామకోటేశ్వరరావుగారి అధ్యక్షతన ఒకసారి భావకవిత్వ సభ జరిగింది. కృష్ణశాస్త్రిని ప్రతిఘటించడమే సభను ఏర్పాటుచేసినవారి లక్ష్యం. కృష్ణశాస్త్రి నవ్యాంధ్రకవుల కృతుల్లోంచి కొన్నిపద్యాలు చదివినతర్వాత కళాశాలాంధ్రపండితులైన గొర్తి సూర్యనారాయణశాస్త్రిగారు[19] వేదిక మీదకువెళ్ళి కొన్ని ప్రయోగాలు ప్రాచీన లాక్షణికుల లక్షణ నిర్దేశానికి వ్యతిరేకంగా ఉన్నాయని అధిక్షేపించారు. అప్పుడు కృష్ణశాస్త్రి లేచి 'మేము భావకవులమండీ' అని ఆ ఉల్లంఘనల కేవో సమాధానం చెప్పాడట.[20]

భావకవిత్వం ఒక ఉద్యమంగా రూపుదాల్చిన ఆ కాలంలోనే అక్కిరాజు ఉమాకాన్త విద్యాశేఖరుల 'నేటికాలపు కవిత్వము' 'అశని పాతమంత తీవ్రధాటితో వచ్చింది.' 'ఊపిరాడనీయనంత కోపంతో దాడిచేసిన' ఉమాకాన్తుల విమర్శకు తగిన ప్రతివిమర్శను చేయడాన్ని గురించి కృష్ణశాస్త్రితో కొంతమంది నవకవులు సంప్రదించారు. కాని కృష్ణశాస్త్రి ఆ విమర్శకు మరోరకంగా జవాబుచెప్పాడు. "క్రొత్త పద్యాలు వ్రాయడమే జవాబనిపించింది. వ్రాయకుండా ఎలాగుండగలం"[21] అని కృష్ణశాస్త్రి పేర్కొన్న మాటలు ఇక్కడ గుర్తింపదగి ఉన్నాయి. ఆ రోజుల్లో కొత్తపద్యాల్ని వ్రాయడమేగాక వాటిని ఊరూరా సభల్లో గానంచేసి కృష్ణశాస్త్రి 'నవ్యకవిత్వం అంటే ఇది'

అని చదువుకొన్నవారికి తెలియజెప్పాడు, "మహాపండితుడైన అక్కిరాజు ఉమాకాన్తమ్ సవాలుకి సాహితీసమితి విమర్శాత్మకమైన గ్రంథ రూపంలో జవాబు చెప్పలేకపోయింది. 'కొన్ని సందేహాలు' అని కృష్ణా పత్రికలో చింతాదీక్షితులు సరళంగా, సరసంగా హేళనచెయ్యడం మిన హాయిస్తే ఎవ్వరూ ప్రతివిమర్శకి సాహసించలేదు. పండితులు తిడుతూ ఉంటే కవి ఏంచెయ్యాలో చూపించినవాడు కృష్ణశాస్త్రి! 'ఇది మా కవిత్వం ఏమంటారు మీరు?' అని ప్రజల్లోకి ఆధునిక కవిత్వాన్ని తీసుకు వెళ్ళాడు. ప్రజలు హర్షించారు.... ఔమాకాన్తులకి అదేజవాబు" అని శ్రీ శ్రీ పేర్కొన్నమాటలు[22] ఆ రోజుల్లో కృష్ణశాస్త్రి సాగించిన కవితాజైత్రయాత్ర నవ్యకవిత్వ వికాసానికి ఏవిధంగా దోహదం చేసిందో విస్పష్టం చేస్తున్నాయి. "నవ్యకవిత్వం ఒక తీవ్రోద్యమముగా నిలవడా నికి ఈ నా కృషి కొంతవరకయినా కారణమని ఇప్పుడింత దూరాన్నుంచి అనుకుంటే మన్నించండి"[23] అన్న కృష్ణశాస్త్రి మాటలు అతడి వినయ గౌరవాన్ని చాటుతున్నాయి.

తన కవితాగానంతో దాదాపు నాలుగు దశాబ్దాలపాటు రసజ్ఞ లోకాన్ని ఉఱ్ఱూతలూగించిన కృష్ణశాస్త్రిగొంతు 1964 వ సంవత్స రంలో మూగవోయింది. ఆ సందర్భంలో అతడిని పరామర్శించడానికి వెళ్ళిన యామిజాల పద్మనాభస్వామిగారు 'కంఠం... చికిత్సా ఏమిటి?' అని విచారంగా అడగ్గా కృష్ణశాస్త్రి వ్రాసిచూపిన పద్యం ఇది.[24]

ఇంచుమించుగ ఏబది యేండ్లపాటు
కూసియున్నాను సభలతో కోకిలవలె
అలసిపోయితి నిక కూయనంచు తాను
మూగవోయెను వయసుతో నా గళంబు

కృష్ణశాస్త్రి ప్రధానంగా నిర్వర్తించిన 'ఉద్యోగానికి' ఏ విధంగా అతడిగళం ఒక స్ఫూర్తిని, కీర్తిని కల్గించిందో ఈ ప్రకరణంలో ఇంత వరకు ప్రస్తావింపబడిన అంశాలు నిరూపింపజాలి ఉన్నాయి.

# సాహితీ మిత్రసమితి

"సాహితీసమితి అన్నదమ్ముల కూటం. నాకుమాత్రం సమితి వారూ, పాఠికవులూ, సాహితీపరులందరూ ఎప్పటికీ రక్తబంధువులకన్నా ప్రియులు !" (కృష్ణశాస్త్రి–'పాతిక సంవత్సరాల తెలుగు కవిత్వము')

1921 వ సంవత్సరప్రాంతంలో తెనాలిలో ఒక సాయంకాలం కొడవటిగంటి వేంకటసుబ్బయ్య, త్రిపురారిభట్ల వీరరాఘవస్వామి, పెద్దిభొట్ల పూర్ణశర్మ, కోపల్లె శివకామేశ్వరరావు మొదలైన సాహితీసమారాధకులు కొందరు అలవాటుమేరకు తల్లావఝ్ఝల శివశంకరశాస్త్రి ఇంట్లో సమావేశమైనారు.

"హృదయ వనజాతసుమ
మృదు మనోహరదళము
లదయతను ద్రుంచినారే
పెంధూళిc
జిదిమి వెదcజల్లినారే!
హృదయ శోణితధార
నెదుగు జీవితవల్లి
మొదలంటc దాల్చినారే
భయదాగ్ని
కీలలను వేల్చినారే!"

అని సాహితీమిత్రుల్లో ఒకరు 'సాహితి'లో ప్రచురణకోసం అంతకు ముందే పోష్టులోవచ్చిన కృష్ణశాస్త్రి గీతికను అందుకొని భావయుక్తంగా చదివారు. అంతవరకూ చెవులప్పగించి వింటూఉండిన శివశంకరశాస్త్రి

ఉత్సాహాన్ని అణచుకోలేక మిత్రులతో "ఈ కవివల్ల ఆంధ్రకవిత్వంలో ఇంకిలాబ్ వస్తుంది" అని ఎలుగెత్తి చెప్పాడు. ఆ తర్వాత ఏభై సంవత్సరాలకు మద్రాసులో ఏర్పాటుచేయబడిన 'తెలుగు కవిత్వంలో కృష్ణశాస్త్రి శకం' అన్న సదస్సుకు[1] వ్రాసిపంపిన వ్యాసంలో అతడు ఇదేవిషయాన్ని పదిమందికీ విస్పష్టంచేసి ఉన్నాడు.[2]

ఆ రోజుల్లో కవులు "ఒక సంఘంగా ఏర్పడడం, దానికోసం పత్రికలు ప్రచురించడం, సమావేశాలు కావడం, పర్యటనచేస్తూ ప్రచారం చేయడం – ఇన్నీకలసి నవ్యకవిత్వాన్ని, నవ్యసాహిత్యాన్ని ఒక ఉద్యమంగా ఎలాగ చేశాయో తెలియజేస్తాయి."[3] కాబట్టే ఈ ప్రకరణంలో నవ్యాంధ్ర సాహితీవికాసానికి, ముఖ్యంగా భావకవిత్వానికి ఎంతో దోహదంచేసిన 'సాహితీసమితి'ని గూర్చి, దానికి సారథ్యాన్ని వహించిన తల్లావఝ్ఝల శివశంకరశాస్త్రితో కృష్ణశాస్త్రికున్న అవినాభావ సంబంధాన్ని గూర్చి పరిశీలించడం జరిగింది.

ఇరవయ్యోశతాబ్ది ద్వితీయదశాబ్దం తెలుగు సాహిత్యక్షేత్రాన్నే కాక ఇరుగుపొరుగు సాహిత్యరంగాలను కూడా ఉద్దీపింపచేసిన కాలం. ఆ సమయంలోనే దేశమంతటా 'పాటలుపాడే విహంగకులాయాలు ఆకస్మికంగా గొంతులెత్తినవి.' 1920 లో 'రవికిరణమండల్' మహారాష్ట్ర కావ్యక్షేత్రంమీద ఆధిపత్యం వహించింది. అప్పట్లో మహారాష్ట్రమంతటా కవులు విశేషంగా కావ్యపఠనం చేయడంవల్ల వారికవిత్వం 'విస్తారంగా చలామణీ' అయింది. కావ్యగానం ఒక ఫాషన్' గా పరిణమించింది. 'రవికిరణమండల్' సభ్యుల సంచార ప్రచారాలు, కావ్యపఠనంలో వారు కనబరచిన ప్రయోగకౌశల్యం శ్రోతల్లో విపరీతమైన ఉత్సాహాన్ని ప్రేరేపించాయి.[4] 1920 వ సంవత్సర ప్రాంతంలోనే బి. యం. శ్రీకంఠయ్య, డి. వి. గుండప్పల ఆధ్వర్యంలో 'తలిరుగుంపు,'

గోవిందపాయ్ మార్గదర్శకత్వాన మంగుళూరులో 'మిత్రమండలి,' బేంద్రే నాయకత్వాన ధార్వాడలో 'గెళెయరగుంపు' ఆధునిక కన్నడ సాహిత్య ఉజ్జీవానికి దోహదం చేశాయి.[5]

ఇరుగుపొరుగు రాష్ట్రాల్లో పొడసూపిన ఇటువంటి సాహిత్య చైతన్యానికి కొంచెంముందుగానే, అంటే 1917 వ సంవత్సర ప్రాంతంలో తల్లావఝ్ఝుల శివశంకరశాస్త్రి కొందరు సాహితీసమారాధకుల్ని సమీకరించుకొని 'సాహితీసమితి' అవతరణకు ముఖ్యకారకుడై, కొన్ని దశాబ్దులు దానికి సారథ్యాన్ని వహించి నవ్యసాహితీవికాసానికి ఎనలేని సేవ చేశాడు. ''సాహితీసమితి వ్యవస్థాపకులయిన శివశంకరశాస్త్రిగారు మహారాష్ట్రములో అనంతరకాలములోని 'రవికిరణమండల్,' కర్ణాటములోని 'గెళెయరగుంపు' వలె రచయితలనుచేర్చి, చాలామందికి సాహితీసౌహార్ద్రత కలిగించినారు. సమకాలికాంగ్ల సాహిత్యాన్ని, భారతీయ సాహిత్యాలనూ, భావలనూ మూడు నాలిగింటెని కూలంకషంగా అవలోడనముచేసిన శివశంకరశాస్త్రిగారు ఆంధ్రకవులకూ, కథానికా రచయితలకూ, సారస్వత వ్యాసరచయితలకూ అగ్రసోదరుడు – 'అన్నగార'యినాడు.''[6] ''వారిస్వభావం మైనంలాటిది. కాబట్టి మిత్రసంఖ్య వందలమీదఉంటుంది. అందరకూ ఉపకారంచేయాలని ఉబలాటం. ఎవరేమిచెప్పినా, ఎవరేమితెమ్మన్నా సరె పొరుగూరినుండి గూడ్సుబండి లాగు తెచ్చేవారట! అది రెండుపక్షాలను దగ్గరకుచేర్చే లక్షణం.''[7] ''అభినవాంధ్రకవినిర్మాణమునకు శాస్త్రిగారొక యంత్రమని చెప్పకొందురు. నాలుగుగేయములు గొలుకు కవిదగ్గరనుండి, మేలిమి కావ్యములు సంతరించు కవిదాక బుజ్జగించి చేరదీసి యోపికతో వారిరచనములు సరిచేసి, అవసరమైనచో దానొక ప్రతివ్రాసి, ప్రచురణమునకుపాయములు సూచించు సహృదయత శాస్త్రిగారిలో ఘనముగ నున్నది.''[8] ఈ గుణాలవల్లనే ఆరోజుల్లో ఆయన కొత్తదనాన్ని కోరిన

రచయితల నందరినీ కూడగట్టుకొని గురజాడ తీసిన వెలుగుజాడలో నడి పించి, వారికొక గూడును కల్పించగలిగాడు.[9] కాబట్టే ''శివశంకర శాస్త్రి అద్భుతవ్యక్తి. వ్యక్తేకాదు మహాసంస్థ.[10] ఖగోళానికి సూర్యు డెట్టివాడో సమితికి శివశంకరశాస్త్రిగారట్టివారు''[11] అని విజ్ఞులు వ్యాఖ్యానించి ఉన్నారు.

1918 వ సంవత్సర ప్రాంతంలో కృష్ణశాస్త్రి పెద్దాపురం మిషన్ హైస్కూల్లో ఉద్యోగంలో చేరాక 'కథక చక్రవర్తి' చింతాదీక్షి తులుతో మొదటిసారిగా పరిచయం కలిగింది. కృష్ణశాస్త్రిలోని 'కవి'ని గుర్తించిన దీక్షితులు అప్పుడు శివశంకరశాస్త్రికి వ్రాసిన ఒకానొక లేఖలో ''దేవులపల్లి కృష్ణశాస్త్రి అనే మిత్రుడిక్కడ పనిచేస్తున్నారు. చాలామంచికవి'' అని తెలియజేశాడు. ఆవిధంగా శివశంకరశాస్త్రికి కృష్ణ శాస్త్రి మొదటిసారిగా పరిచయమయ్యాడు.[12] 1920 వ సంవత్సరం 'సాహితి' పత్రిక నెలకొల్పబడడంతో సాహితీమిత్రుల భావప్రకటనకు ఒక వాహిక ఏర్పడింది. ఆ పత్రికకు ఏవైనా రచనల్ని పంపవలసిందని శివశం కరశాస్త్రి కృష్ణశాస్త్రిని కోరాడు. అప్పుడే కృష్ణశాస్త్రి 'తేటివలపు,' 'విరిచేడె,' 'అబ్బ' అన్న ఖండకృతుల్ని 'సాహితి' లో ప్రచురణకోసం పంపడం జరిగింది. ఆ రోజుల్లోనే కృష్ణశాస్త్రి అక్కగారైన వింజమూరి వెంకటరత్నమ్మ సంపాదకత్వాన 'అనసూయ' అన్న మాసపత్రిక వెలు వడేది. అందులో కృష్ణశాస్త్రి 'నిర్వాహణం' కూడా కొంతఉండేది. కృష్ణశాస్త్రి అభ్యర్థనమేరకు శివశంకరశాస్త్రికూడా తన రచనల్ని ఆ పత్రికకు తరచుగా పంపుతుండేవాడు. అదివరకు ఒకరినొకరు కలుసు కొనే అవకాశం కలగకపోయినా ఉత్తర ప్రత్యుత్తరాలద్వారా కృష్ణ శాస్త్రికి శివశంకరశాస్త్రి మొదలైన కవిమిత్రులతో ఒక విధమైన ఆత్మీయత ఏర్పడింది. ''అంతకుముందు అప్పటికవులం చాలామందిమిం ఒకర్ని ఒకరు కలుసుకోకపోయినా, 'సాహితి' మొదలైన పత్రికల్లోపడ్డ

ఖండకావ్యాలు చదువుకుని, ఎప్పటినుంచో ఎరిగున్న దగ్గరిచుట్టాలు లాగ అనుకునేవారం. కాని ఎలాంటి మధురగాఢమైన బంధం మమ్మల్ని అందర్నీ చుట్టి పెనవేసి పట్టుకున్నది! ఒకరికొకరం మా కావ్యాల్ని గూర్చి, కష్టసుఖాల్ని గూర్చి, ఉత్తరాలు వ్రాసుకొనేవారం"[13] అన్న కృష్ణశాస్త్రిమాటలు ఈ అభిప్రాయాన్నే బలపరుస్తున్నాయి.

శివశంకరశాస్త్రి, చింతాభీమశంకరం, కొడవటిగంటి వేంకట సుబ్బయ్య, నోరి నరసింహశాస్త్రి, చింతాదీక్షితులు, త్రిపురారిభొట్ల వీరరాఘవస్వామి, పెద్దిభొట్ల పూర్ణశర్మ, వజ్ఝల బాబూరావు, కొమ్మూరి హనుమంతరావు, కోపల్లె శివకామేశ్వరరావు, చామర్తి రాజశేఖరరావు, కొత్తపల్లి సుబ్బన్నాచార్యులు మొదలైన సాహితీ ప్రియుల కలయికతో అంకురించిన 'సాహితీసమితి' 1923 వ సంవత్సర ప్రాంతానికి స్ఫుటమైన రూపురేఖల్ని దిద్దుకొన్నది. విశ్వనాథ సత్యనారాయణ, అడివి బాపిరాజు, పింగళి లక్ష్మీకాంతం, కాటూరి వెంకటేశ్వరరావు, దేవులపల్లి కృష్ణశాస్త్రి, వేదుల సత్యనారాయణశాస్త్రి, కొడాలి ఆంజనేయులు, నండూరి సుబ్బారావు, నాయని సుబ్బారావు మొదలైన కవిమిత్రుల చేరికతో సాహితీసమితికి 'నిండుదనం' కలిగింది. "బహుకాల పరిచయము, అన్యోన్య ఆదరానురాగములు, మనస్సుల కలయిక, భారతీయ సంస్కృతీ సంప్రదాయ విద్యలపై లక్ష్యము, శాంత చిత్తముతో వినయముతో పనిచేయు స్వభావము, కళ, భాష, విద్య, శాస్త్రాదులలో దేనియందైన ప్రావీణ్యము, అమంగళకరములు, జుగుప్సాకరములైన వానిని పరిహరించి, ఉదాత్తములు, ఉల్లాసప్రదములు, విజ్ఞానదాయకములైన కృషులు నెరవేర్పగలవారితో ఈ సోదర వర్గము" ఏ విధంగా 'సాహితీసమితి' గా వర్ధిల్లిందో శివశంకరశాస్త్రి మాటలు[14] చక్కగా వివరిస్తున్నాయి.

సాహితీసమితి అవతరణతో నవ్యసాహిత్యం, ముఖ్యంగా భావకవిత్వం జవాన్ని, జీవాన్ని అందుకొన్నది. భావకవిత్వం సంప్రదాయవాదుల తీవ్రనిరసనకు గురియైనప్పుడు దానిని ఎదుర్కోవడానికి చదువుకొన్నవారిలో నవ్యకవిత్వాన్నిగూర్చి సదవగాహనను కల్గించడానికి కృషిచేసినవారూ; ఆధునికాంధ్ర కవిత్వ కురుక్షేత్ర సంగ్రామంలో ఇరువైపుల వారి బలాలు మోహరిల్లినప్పుడు కృష్ణార్జునులలాగా ప్రతిపక్షులకు ఎదురొడ్డినిలిచినవారూ - శివశంకరశాస్త్రి, కృష్ణశాస్త్రి. ఆ రోజుల్లో భావకవుల తరఫున వకాల్తాపుచ్చుకొని వీరుచేసినంతగా మరెవ్వరూ సంచారప్రచారాలు చేయలేదు. ''భావకవిత్వమును నలుమూలల ప్రచారము చేసినవారిలో వీరగ్రేసరులు. భావకవుల కావ్యముల నుపాధేయముగా మూటగట్టుకొని వీరుచేసిన ప్రయాణము లెవరు చేయలేదేమో!''[15] అని కృష్ణశాస్త్రిని గురించి ఆచార్య సి. నారాయణరెడ్డిగారుచేసిన వ్యాఖ్యానం శివశంకరశాస్త్రికి కూడా అన్వయిస్తుంది. ఎటొచ్చీ ఈ విషయంలో ఇద్దరికీ ఒక్క తేడామాత్రం ఉంది. ఈ సంచారప్రచారాలకు వ్యూహరచనం శివశంకరశాస్త్రిదైతే మనోహరవచనం కృష్ణశాస్త్రిది. అందుకే ఒకరు మూలవిరాట్టు, రెండవవారు ఉత్సవవిగ్రహం అయ్యారు. "Those were the days of public meetings and public recitals. Poets of the new school formed in to a sort of brotherhood and actually accosted each other as 'brothers', Though it looks a bit too naive at this distance of time, the attachment was genuine while it lasted and was more impersonal than blood brotherhood. Poets of that age have not merely created a new school of poetry, they have also created their own platform and their own public. In Sri Krishna Sastry the movement found a powerful protagonist"[16]

అన్న పాలగుమ్మి పద్మరాజుగారిమాటలు 'మనస్ఫూర్తి'గా ఒక్కటయిన 'అన్నదమ్ములకూటాన్ని', భావకవితోద్యమానికి కృష్ణశాస్త్రి కల్గించిన స్ఫూర్తినీ చక్కగా వ్యక్తం చేస్తున్నాయి.

ఆరోజుల్లో 'సాహితీసమితి' కవిత్వవ్యవసాయానికి ఉపక్రమించిన కవికుమారుల పాలిటి తొలకరిజల్లు. "నేను కలంపట్టిన కొత్తరోజుల్లో సాహితీసమితి అంటే నాకు ప్రాణంలేచివచ్చినట్టుండేది. అందులో సభ్యుణ్ణికావడం ఎలాగో, ఎవరికి ఉత్తరం రాయడమో తెలియక పోబట్టిగాని లేకపోతే ఒక అర్జీ పెట్టుకొనేవాణ్ణే! శ్రీరంగం శ్రీనివాస రావు (సాహితీసమితి) అని అచ్చులో చూచుకోవాలని నాకు చాలా ఉబలాటంగా ఉండేది. నాలోనూ, పురిపండాలోనూ ఉండిన ఈ ఉబలాటమే 'కవితాసమితి' స్థాపనకి కారణమని యిప్పుడు వెనక్కిచూసు కొని ఆలోచిస్తే అనిపించుతోంది"[17] అన్న శ్రీశ్రీ మాటలు ఆ కాలంలో సాహితీసమితి యువకవుల నెంతగా ఉత్తేజితుల్ని చేసిందో తెలియజేస్తున్నాయి.

భావకవిత్వం ఒక ఉద్యమంగా ముమ్మరించిన కాలంలో భావ కవులు కవిత్వముఖ్యాంగాలైన వస్తుభావ రచనల్లోనేకాక 'కట్టులో జుట్టులో నడకలో నాణెములో తమ ప్రత్యేకత'ను నిలబెట్టుకొన్నారు. 'కవుల Zoo లో జనపాలలో సింహం'లాగా సంచారప్రచారాలు చేసిన కృష్ణశాస్త్రి ఆకాలంలో కలంపట్టిన కవికుమారుల్ని ఎంతగా సమ్మోహి తుల్ని చేశాడో శ్రీశ్రీ పేర్కొన్న మాటలు చక్కగా సూచిస్తున్నాయి. "ఆ రోజుల్లో కలంపట్టిన కుర్రకవులంతా కృష్ణశాస్త్రి ఆకర్షణకు లోనయినవారే![18] అణుబాంబు రేంజి ఐదువందలమైళ్ళు కైవారం అంటారు. కృష్ణశాస్త్రి అణుధార్మికశక్తి ఆంధ్రదేశం అంతటా వ్యాపిం చింది."[19] "భావకవి యనుపదము ఉచ్చరించగానే కృష్ణశాస్త్రిగారు స్ఫురించెడి పరిస్థితి యేర్పడిన"[20] ఆకాలంలోనే యువకవులు చాలా

మంది గిరజాల జుట్టుతో, మెరుగుకళ్ళజోడుతో కృష్ణశాస్త్రి వేషాన్నే కాక అతడి పద్యరచనాఫణితిని, కావ్యపఠన వైఖరిని అనుకరించడానికి తంటాలుపడ్డారు.[21] నిజానికి 'కేశసంపదకీ కవిత్వశ్రీకీ' సంబంధం లేక పోయినా 'కుటిల శిరోజపాశాలతో సాహిత్యలోకాన్ని బంధించి జయించా లనుకొన్న' కవిచూడామణులను ఉద్దేశించే ఆ తర్వాత కృష్ణశాస్త్రి 'మెరుగు కళ్ళజోళ్ళు గిరజాలు సరదాలు, భావకవికి లేనివేవిలేవు?, కవితయందు దప్ప గట్టివాడన్నింట, విశ్వదాభిరామ వినురవేమ'' అని పరిహసించడం జరిగింది.[22]

ఆంధ్రదేశంలో మొట్టమొదటిదిగా చెప్పకోదగ్గ సాహిత్య సంస్థ 'ఆంధ్ర సాహిత్యపరిషత్తు' 'క్రొత్తభావాల ప్రవేశానికి తలుపులు తెరవడం నిరాకరించడం'తో దానిమీద 'తిరుగుబాటుగా' ఆవిర్భవించిన 'నవ్యసాహిత్యపరిషత్తు' గొడుక్కిందికి శివశంకరశాస్త్రితో బాటు మిగిలిన సామితేయులంతా తలదాచుకోవడానికి 'మూక ఉమ్మడి'గా పరుగులుతీశారు. 1943 వ సంవత్సర ప్రాంతంలో ''సాహిత్యము రచయితల వైయక్తిక క్రీడాకందుకము కాదని, సమష్టి చైతన్యమునకు ప్రతిబింబమని, పీడిత ప్రజాసముద్ధరణమే రచయితల చరమలక్ష్యమ''ని[23] అభ్యుదయదృష్టి గలిగిన కొందరు కవులు ఉద్ఘోషించడంతో నవ్యాంధ్ర సాహిత్యలోకంలో 'అభ్యుదయ రచయితలసంఘం' అవతరించింది. మొదట్లో 'నవ్యసాహిత్య పరిషత్తు'కి చెందిన ''ఎందరో పండితులు, కవులు, ప్రముఖులు ప్రత్యక్షంగానో పరోక్షంగానో తెలిసో తెలియకో ఈ సంఘానికి బలం చేకూర్చినవారే. మళ్ళీ కమ్యూనిష్టుపార్టీకి ఇది అనుబంధమైనదంటే నాలిక కొరుక్కున్నవారే.''[24] కాని కాల్పనికోద్యమపు ఆద్యులలో ముఖ్యుడైన కృష్ణశాస్త్రి కవిత్వం 'ఆకాశంలో విహరించినా' వ్యక్తిగత జీవితంలోమాత్రం అన్ని అభ్యుదయోద్యమాలనూ సమర్థించినవాడే, కొన్నిటిలో స్వయంగా పాల్గొన్నవాడే.[25] తృతీయాభ్యుదయా

రచయితల మహాసభ కధ్యక్షత వహిస్తూ "పీడింపబడేవాళ్ళూ పీడించే వాళ్ళూవున్న యీ వర్గసమాజం ఉండాలని ఎవరూ కోరరు. రానున్న విధానంలో సాధారణమానవుడే మకుటధారి. పురోగమిస్తున్న లోకాన్ని ప్రతిఘటింపజూచేవారు ఎప్పుడూ అభ్యుదయవాదులు కాజాలరు. ఈ ధనిక సమాజం పోవాలనుకోవటమే అభ్యుదయం. ఇది మనసులో పెట్టుకొని వ్రాసేది అభ్యుదయరచన"[26] అని 'మార్క్సిజము'ను దృష్టిలో పెట్టుకొని కృష్ణశాస్త్రి చేసిన నిర్వచనం అభ్యుదయ కవిత్వతత్వాన్ని సర్వసమగ్రంగా ఆవిష్కరిస్తున్నది. "కాల్పనికోద్యమములో మానవుని మస్తకముపై మకుటముంచిన శాస్త్రిగారు అభ్యుదయకవిత్వ నిర్వచన సందర్భమున 'సాధారణ' మానవుని మకుటధారి చేయుట గమనింపదగినది."[27] పాలగుమ్మి పద్మరాజుగారన్నట్లు చుట్టూ ఉన్న లోకాన్ని చాలాలోతుగా చూడగలిగిన లోకజ్ఞుడాయన." కాబట్టే ఎప్పుడు పుట్టాడో తనకే తెలియని పాతచెప్పులాంటి నారయ్యతాత అతుకుల బతుకును "లోకమందిరానికి పునాది కోట్లమంది సామాన్యజనం. సౌధ భారం మోసేపునాది మనకు కనబడదు; కాని ప్రాసాదసౌందర్యం చూచి బలే అని కనుబొమలెగరేస్తాం. అంతే అది; లోకపద్ధతి"[28] అని కృష్ణశాస్త్రి వ్యాఖ్యానించగలిగాడు.

ఇక అన్నివర్గాల, అన్నివాదాల సాహితీపరులకూ ఆత్మీయుడు కాగలిగిన కృష్ణశాస్త్రి ప్రవృత్తిలోని ఒక ముఖ్యవిశేషాన్ని ప్రస్తావించి ఈ ప్రకరణాన్ని పూర్తిచేయడం సముచితంగా ఉంటుంది. నవ్యాంధ్ర సాహిత్య లోకంలో ఎన్నిసాహిత్యసంస్థలు రూపురేఖల్ని దిద్దుకొన్నా వాటికొక కేంద్రకార్యాలయ భవనమంటూ లేకపోవడం ఆరోజుల్లోనూ, ఈ రోజుల్లోనూ ఒక కొరతగానే మిగిలిపోయింది. అవి నలుగురు కలుసుకొన్నప్పుడుమాత్రం మేమున్నామంటూ తలెత్తుతుంటాయి; పలకరిస్తుంటాయి. కాని ఐదారు దశాబ్దుల పర్యంతమూ కృష్ణశాస్త్రి ఎక్కడుంటే అక్కడ సాహితీమిత్రసమితికి ఒకగూడు ఏర్పడిఉండేది. అన్ని రకాల కవులకూ ఆయన ఉన్నచోటు ఒక యాత్రాస్థలంగా ఉండేది.[92]

'అన్నపూర్ణ కుద్ది'మైన కృష్ణశాస్త్రి యిల్లాలు శ్రీమతి రాజహంసగారు చెప్పిన ఒకానొక సంఘటన ఈ సందర్భంలో ప్రస్తావింపదగి ఉంది.

కృష్ణశాస్త్రి మద్రాసుకు వచ్చిన కొత్తలో త్యాగరాజనగరు లోని లక్ష్మణచెట్టి వీథిలో ఒక యిరుకైనయింట్లో కాపురముండేవాడు. వండుకోవడానికీ, పండుకోవడానికీ చాలీచాలని రెండేరెండు ఇరుకైన గదులతో కూడిన వాటాఅది. అప్పుడు మద్రాసులో జరిగిన ఏవో సభల్ని పురస్కరించుకొని ఒకసారి కవిమిత్రులందరూ కట్టకట్టు కొని కృష్ణశాస్త్రి యింటిమీద పడ్డారు. అతిథులైన కవులకోసం అప్పటి కప్పుడే గృహప్రాంగణంలో ఒక శిబిరం (డేరా) ఏర్పాటయింది. మామిడిచెట్టుకింద కొలువుదీరిన కవిశిఖామణులు తమతమ దస్త్రాల్ని విప్పి కావ్యగానానికి ఉపక్రమించారు. చెట్టుపై కొమ్మల్లోనుండి ఉడుతలు మునిపళ్ళతో కొరకడంవల్లనో, చిలుకలు ముక్కుకొసలతో పొడవడం వల్లనో చెట్టుకింద కవుల తలకాయలమీద కాయలు రాలిపడ్డం మొద లైంది. ఆమ్రఫలాలు తమనెత్తిమీద పడుతున్నా పట్టించుకోనంతటి తన్మయతతో ఆ కవిచూడామణులు క్రమకవితాస్వాదనలో మునిగి పోయారు. రాయప్రోలువారు పేర్కొన్నట్టు ఊళ్లో సాహిత్యసభలు జరిగితే కృష్ణశాస్త్రి యిల్లు 'పెండ్లివిడిది'లాగా 'బువ్వము బంతి'తో కళకళలాడిపోయేది.[30] గోరాశాస్త్రిగారు వ్యాఖ్యానించినట్టు "కృష్ణ శాస్త్రి ఒక వ్యక్తి కాదు. ఒక సాహితీసంస్థ. కృష్ణశాస్త్రి గొప్ప గృహ మేధి. కృష్ణశాస్త్రితో స్నేహం ఒకవ్యసనం."[31] కాబట్టే అన్నితరాల కవులకూ, అన్నివర్గాల కవులకూ కృష్ణశాస్త్రి ఆత్మీయుడు కాగలిగాడు.

"అన్నితరాల కవులకీ నా మీద ఉన్నంత అనురాగము మరెవ్వరి మీదా లేదు. నన్ను సాటివాడుగా వారందరూ ఆదరించడమే నా జీవి తాని కంతకీవరం"[32] అన్న కృష్ణశాస్త్రి మాటలు అక్షరాలా నిజం. జీవితానికి అంతకంటే సార్థక్యం ఏముంది?

# సత్కృతులు

'నరత్న మన్విష్యతి మృగ్యతేహి తత్'
(కుమారసంభవము - పంచమసర్గ - శ్లో. 45)

1909 వ సంవత్సర ప్రారంభంలో సుబ్బరాయశాస్త్రి తమ్మన శాస్త్రిగార్లు కంటిజబ్బుకు వైద్యం చేయించుకోవడానికి చెన్నపట్నం బయలుదేరారు. పిఠాపురం రాజాగారే వారి ప్రయాణానికి, పట్నంలో బసకు తగిన ఏర్పాట్లను చేశారు.[1] అప్పట్లో హైస్కూలు విద్యార్థియైన కృష్ణశాస్త్రికి తండ్రి పెదతండ్రులతో కలిసి మొదటిసారిగా చెన్నపట్నం వెళ్ళేఅవకాశం లభించింది. ఆ సందర్భంలోనే కృష్ణశాస్త్రి తండ్రులతో కలిసి భిషజ్మణి పండిత గోపాలాచార్యుల దగ్గరకు వెళ్ళాడు. అప్పటికే దేవులపల్లి సోదరకవుల ప్రశస్తిని వినిఉన్న ఆచార్యులు వారి చాలు బాలుడైన కృష్ణశాస్త్రిలో ఎంతవరకు వచ్చిందో తెలుసుకోవడానికి ఒక చిన్న పరీక్ష పెట్టాడు. అందులో నెగ్గిన కృష్ణశాస్త్రి ఆశువుగా కొన్ని పద్యాల్ని చెప్పాడు. అప్పటి కా బాలుని భుజంతట్టి అభినందించిన గోపాలాచార్యులు కొన్నిరోజుల తర్వాత ఆంధ్రభాగవతాన్ని బాహుమతిగా ప్రధానోపాధ్యాయులపేర పంపారు. వారు విద్యార్థులందరి ఎదుటా బాలుడైన కృష్ణశాస్త్రిని గౌరవించి ఆగ్రంథాన్ని అందజేశారు.[2] అదే కృష్ణశాస్త్రికి లభించిన ప్రథమ పురస్కృతి. ఆ తర్వాత కవిగా లబ్ధప్రతిష్ఠుడయ్యాక కృష్ణశాస్త్రికి తెలుగునేల నాలుగుచెరగులా ఎన్నో సన్మానాలు జరిగాయి. వాటిల్లో అతడికి మిక్కిలి ఇష్టమైన రెండు 'సన్మానాల్ని' మొదట ప్రస్తావించడం సముచితంగా ఉంటుంది.

ఒకసారి నవ్యసాహిత్యపరిషన్మహాసభ లయ్యాక[3] ముక్త్యాలనుండి కాటూరి వెంకటేశ్వరరావు, కృష్ణశాస్త్రి, అయ్యంకి వెంకటరమణ య్యాలు బస్సులో బెజవాడవస్తున్నారు. ''ఏంవర్రా మీా యిద్దరికీ సన్మా నంచేస్తా ఏమికావాలి?'' అని అయ్యంకి వారడిగారు.

> నిరుపహతిస్థలంబు రమణీప్రియ దూతిక తెచ్చియిచ్చు క
> ప్పూరవిడె మాత్మకింపయిన భోజనముండిన యంత నిండునే
> సరస సుగంధ బంధురము, శ్యామల ధూమలతా వితాన భా
> సుర మొకపాటిసాటి పొగచుట్ట లభింపక మిత్రసత్తమా

ఆ సందర్భంలో 'సగం పెద్దనగారిది కొట్టేసి' కృష్ణశాస్త్రి చెప్పి నదే ఈ పద్యం. అయ్యంకివారు చేస్తానన్న సన్మానం మాటల్లోనే మిగిలిపోయింది. కాని రెండవది మాత్రం ఖచ్చితంగా జరిగింది. అన్న మాటప్రకారం ఆంధ్ర నిరుద్యోగ సంఘంవారు రేపల్లెలో విశ్వనాథ, శివశంకరుల సమక్షంలో కృష్ణశాస్త్రిని యథోచితంగా సత్కరించారు. ఈ రెండూ తనకెంతో ఇష్టమైన సన్మానాలని కృష్ణశాస్త్రి చమత్కా రంగా పేర్కొని ఉన్నాడు.[4]

కృష్ణశాస్త్రి అరవయ్యేళ్ళ సాహిత్యసేవను గుర్తించి అటు ప్రభు త్వమూ, ఇటు ప్రజలూ ఆయనకి ఎన్నో పురస్కృతుల్ని అందజేయడం జరిగింది. 31—5—1975 వ తేదీన ఆంధ్ర విశ్వవిద్యాలయ స్నాతకో త్సవ సందర్భంగా గ్రహించిన 'కళాప్రపూర్ణ,' 3—4—1976 వ తేదీన రాష్ట్రపతినుండి అందుకొన్న 'పద్మభూషణ్', 1978 లో కేంద్రసాహిత్య అకాడెమి నుండి స్వీకరించిన ఐదువేల రూపాయల బహుమతీ కృష్ణ శాస్త్రికి ప్రభుత్వంనుండి లభ్యమైన కొన్ని పురస్కృతులు. కృష్ణశాస్త్రి కవనాన్ని అభిమానించి, అతడి సాహిత్యసేవను గుర్తించి ప్రజలుచేసిన

గ్మానాలకు కొదువలేదు. వాటిని క్రోడీకరించి ఇక్కడ ఒక పట్టికగా
ందుపరచడం అనవసరం. కాని అరతావు కాగితంనుండి ఆరుటన్నుల
గితం వరకు కృష్ణశాస్త్రికి లభ్యమైన రెండు అసాధారణమైన సన్మా
ల్ని మాత్రం ఇక్కడ ప్రస్తావించడం సముచితంగా ఉంటుంది.

20—4—1975 వ తేదీన హైదరాబాద్ హిమయత్ నగర్
సి, కృష్ణశాస్త్రికి ఏకలవ్య శిష్యుడు ఐన శ్రీ సి. మురళీధర్ ఇంటికి
ష్ణశాస్త్రి వెళ్ళినప్పుడు "ఈ రోజు మా యింటిల్లిపాదికీ పర్వదినం.
)రామనవమి సందర్భంగా కాదు. ఆనాటి శ్రీరామునివలెనే ఈనాడు
హిత్యప్రపంచాన్ని రసికజన హృదయరంజకంగా పరిపాలిస్తున్న మీరు
గృహాన్ని పావనంచేసి మాకోసం కొంత సమయాన్ని వినియో
చడానికి అంగీకరించడం ఈ రోజును పర్వదినంగా మార్చింది. 'మల్లీ
రి' మనసున మాత్రమేగాక వాగేశ్వరి హృదయంలో సహితం కవితా
ల్లెల మాలలు విరియింపజేసిన మిమ్మల్ని అదేపనిగా పొగడి, విసిగింప
యడం నా అభిమతంగాదు. చంద్రునికో నూలుపోగులాం ఈ చిన్న
నుకను మా అందరి జ్ఞాపకార్థంగా గౌరవ పురస్సరంగా మీకు సమ
స్తున్నాము." అని అరతావు తెల్లకాగితంమీద ఆత్మీయతను చిలక
చి, అక్షరాలను కూర్చి అందజేసిన దానివెనుక అటువంటి ఎం తో
ంది ఏకలవ్య శిష్యులు కురిపించిన అభిమానధనం దాగిఉంది.

1975 కృష్ణశాస్త్రి కవితకేగాక ఆధునిక కవితావిర్భావానికీ
ర్ణోత్సవ సంవత్సరం. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం 'తెలుగు సంస్కృతి
కాస సంవత్సరం'గా ప్రకటించిన ఆ సంవత్సరంలోనే కృష్ణశాస్త్రిని
ఘువిధంగా సత్కరించాలని 'కొందరు మిత్రులు, ఆరాధకులు కలిసి
క సన్మానసంఘంగా ఏర్పడ్డారు. ఆ సన్మానసంఘం పూలమాలలు,

శాలువలూ, ప్రశంసలు, మొదలైన వాటితోనే సరిపెట్టుకోక కృష్ణశాస్త్రి రచనల్ని ఆరుసంపుటాలుగా వెలువరించింది. అటు కృష్ణశాస్త్రి పట్లగల భక్తిగౌరవాల్ని వ్యక్తపరచడమేగాక ఇటు తెలుగు సాహిత్యానికీ 'ఓపినంతవరకు' సేవచేసింది. అప్పటి పార్లమెంటు సభ్యులు శ్రీ మామిడిపూడి ఆనందం, శ్రీ పి. వి. రమణయ్యల ఆధ్వర్యంలో 11—5—1975 వ తేదీన మద్రాసులో ఏర్పాటుచేయబడిన కృష్ణశాస్త్రి కవితా స్వర్ణోత్సవ సభ కవిసన్మానానికి సంబంధించి ఒక కొత్తసంప్రదాయానికి నాంది పలికింది.

"సన్మానాలంటే నాకు అంతగా గిట్టవు. బిరుదాలూ, సన్మానాలు, మోయలేని బలహీనుణ్ణి"[5] అని కృష్ణశాస్త్రి ఒకానొక సందర్భంలో చెప్పిఉన్నా, చిన్నా పెద్దా తారతమ్యం లేక ఇతరకవుల్ని వేదిక లెక్కించి సన్మానాలు చేయించడం అతడికొక సరదా. ఒక సుగుణం. ఆ 'సత్కృతులు' అతడి ప్రకృతికి అద్దం పట్టుతున్నాయి. ఆ సత్కృతుల్ని పరామర్శించడమే ఈ ప్రకరణంలోని ముఖ్యోద్దేశం. 1927, 28 సంవత్సరాల నుండి కృష్ణశాస్త్రితో సన్నిహిత పరిచయంఉన్న 'కవికోకిల' ఆవంత్స వేంకట రంగారావుగారు ఆవిష్కరించిన ఒకానొక స్మృతి కృష్ణశాస్త్రి సత్కృతికి ఒక చక్కని నిదర్శనంగా ఉంది. "కీ॥ శే॥ చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిగారు ప్రధానాస్థానకవిగా నియమితులైనప్పుడు విజయవాడ సాహిత్యసభకి ఆహ్వానితులమై విజయనగరంనుండి నేనూ, పంతుల లక్ష్మీనారాయణశాస్త్రిగారూ, ద్వారం భావనారాయణ మొదలయిన వారం వెళ్ళేం. శ్రీరంగం నారాయణబాబు అప్పటికే అక్కడ ఉన్నాడు. కృష్ణశాస్త్రిగారు నా గదిలోకివచ్చి పక్కహాలులో తెలంగాణాకవులు, ప్రముఖులు ఆంధ్రరచయితలకి సన్మానం చెయ్యబోతున్నారని చెప్పి తీసుకొనివెళ్ళి నావంతు వచ్చినప్పుడు నేను మంచి

కవి అని పరిచయం చేసేరు.''[6]

యువరచయితల వెన్నుదట్టి, వారిని ఉచితరీతిగా ప్రోత్సహించి, తగిన సహాయ సహకారాల్ని అందజేయడంలో కృష్ణశాస్త్రి ఎప్పుడూ ఉత్సాహం కనబరచేవాడు. ఆరుద్రగారు తెలియజేసిన ఒకానొక సంఘటన ఈ అభిప్రాయానికి ఉపస్కారకంగా ఉంది. 1947 వ సంవత్సరం మద్రాసులో అభ్యుదయ రచయితల సభ జరిగింది. చిత్తూరు నాగయ్యగారి రేణుకా ఫిలిమ్స్ ఆఫీసులో అందరికీ విడిది ఏర్పాటు చేయబడింది. సోమసుందర్, రాంషా, దాశరథి, అనిసెట్టి వంటి యువరచయితలా సభలో పాల్గొన్నారు. ఆ సభలోనే ఆరుద్ర చివరి వరుసలో కూర్చొని సమావేశంలో చేసేచర్చల్ని, తీర్మానాల్ని ఉత్సాహంతో ఆలకిస్తున్నాడు. ఆరుద్రలోని రచయితను అంతకుమునుపే పత్రికల్లోపడ్డ రచనల ద్వారా పసిగట్టిఉన్న కృష్ణశాస్త్రి అల్లంతదూరం నుండే అతడిని గుర్తించి (ఆరుద్రగారికి అప్పట్లో గడ్డం ఉండేదికాదు) వేదికమీదికి రమ్మని అనిసెట్టి సుబ్బారావుద్వారా కబురుపెట్టాడు. బెరుగ్గా వేదిక దగ్గరకు వచ్చిన ఆరుద్రతో కృష్ణశాస్త్రి 'నీవు కూర్చోవలసింది ఇక్కడ-అక్కడకాదు' అని అతడిభుజం తట్టాడు. ''అభ్యుదయ రచయితల సంఘం వేదికమీద నన్ను మొట్టమొదట కూర్చోబెట్టింది కృష్ణశాస్త్రి గారే'' అని కృతజ్ఞతాపూర్వకంగా ఆరుద్రగారు పేర్కొన్న సంఘటన[7] యువరచయితల్ని ప్రోత్సహించడంలో కృష్ణశాస్త్రి కనబరచిన ఉత్సాహాన్ని నిరూపిస్తున్నది. 1947 వ సంవత్సర ప్రాంతంలో తనమీద ప్రభుత్వం జారీచేసిన అరెస్టు వారెంటు ఉండేదనీ, అప్పట్లో కృష్ణశాస్త్రి త్యాగరాయనగరులోని చిత్తూరు నాగయ్యగారి ఆఫీసులో కొంతకాలం తనకు 'ఆశ్రయాన్ని' కల్పించాడనీ డా॥ దాశరథిగారు పేర్కొన్న విషయం[8] ఆరోజుల్లో యువరచయితల్ని ఆదుకోవడంలో కృష్ణశాస్త్రి పడిన తాపత్రయాన్ని కూడా తెలియజేస్తున్నది.

సిద్ధాంతాలతో ప్రమేయంలేక, కులమతాల పట్టింపులేక ప్రతిభ ఉన్న యువచరయితలకు చక్కటి అవకాశాల్ని కల్పించడమే కాక,

పనిగట్టుకొని వెళ్ళి వారికవిత్వ వైశిష్ట్యాన్ని పదిమందికి తెలియజెప్పడానికి కృష్ణశాస్త్రి పాటుపడేవాడని శ్రీ ఏ. ఎస్. రామన్ గారు ఆవిష్కరించిన ఒకానొక అనుభవం చక్కగా నిరూపిస్తున్నది. "I have a confession to make. I had never heard of Bairagi till Sri Devulapalle Venkatakrishna Sastry spoke to me recently about him with unusual warmth and affection. Not the sort of warmth and affection he generously shows to people he loves but doesn't admire. The feeling with which he referred to Bairagi he reserves for creative minds of the highest calibre He praised Bairagi as though the tragic young poet were another Keats or Shelley. One day Sastry garu came to my house in my absence and left two slim volumes of Bairagi's poems with a crisp note suggesting that they were compulsory reading for those who loved good poetry."[9]

"భారతదేశం స్వతంత్రం కాగానే సంయుక్త మద్రాసు రాష్ట్రానికి తెలుగు, సంస్కృత, తమిళ, మళయాల భాషలలో సుప్రసిద్ధులైన కవులను ఆస్థానకవులుగా నియమించడములో శాస్త్రిగారు మాన్య శ్రీయుతులు బెజవాడ గోపాలరెడ్డిగారిని ప్రోత్సహించి కృతార్థులైనారు. వారి ప్రయత్నంవల్లనే మా కవితాగురువులు (చెళ్లపిళ్ల వేంకట శాస్త్రి) తెలుగు ఆస్థానకవులైనారు" అని యామిజాల పద్మనాభ స్వామిగారు తెలియజేసిన విశేషం "సమర్థులకు సన్మానం జరగడానికి కృష్ణశాస్త్రిగారు ప్రయత్నించేవారు"[10] అన్న విషయాన్నే నిరూపిస్తున్నది. నవయుగ కవితాచార్యులైన ఆచార్య రాయప్రోలు సుబ్బారావుగారి "మెడలో పూలదండలు పడ్డ ప్రథమముహూర్తానికి" (1939 లో పిఠాపురం రాజావారి కళాశాలలో జరిగిన సన్మానం) కూడ లగ్నం పెట్టినవాడు కృష్ణశాస్త్రే. ఆ తర్వాత తనకు జరిగిన ఎన్నో సన్మానాలతో కృష్ణశాస్త్రికి ఉన్న ప్రమేయాన్ని పురస్కరించుకొనే రాయ

ప్రోలువారు "నా కోసము ఇన్ని క్రతువులవంటి కార్యాలు చేయించాడు 'శ్రీ దేవులపల్లి వేంకట కృష్ణశాస్త్రి'' అని పేర్కొన్నడం జరిగింది. "పరులకు పట్టంగట్టి ప్రక్క ప్రక్కన ప్రమోద పరితృప్తుడయ్యే మహానుభావుడు మా కృష్ణశాస్త్రి'' అని వారన్నమాటలు[11] అక్షరాలా నిజం. ఈ ప్రకరణంలో ఇంతవరకు పేర్కొన్న అంశాలు ఆ సంగతినే నిరూపిస్తున్నాయి. వాటికంటే ఉత్కృష్టమైన సత్కృతులు వేరే ఏమున్నాయి?

కృష్ణశాస్త్రి పితామహ, ప్రపితామహులు పీఠికాపుర ప్రభువుల చేత ఎన్నో సత్కృతుల్ని అందినవారు. కృష్ణశాస్త్రి పెదతండ్రి సుబ్బారాయశాస్త్రిగారు 'రావువంశ ముక్తావళి'ని రచించి గంగాధర రామరాయావనీంద్రులతో బాటు సమాన ఫాయిదాతో సింహపీఠిక నధిష్ఠించినవారు. రాజ్యాలు అంతరించాయి. కాని కవితారాజ్యాలు మిగిలాయి. కృష్ణశాస్త్రి మాత్రం పీఠికాపురాధీశుల సంతతి హృదయపీఠికలో పదిలమైన స్థానాన్ని సంపాదించుకొన్నాడు.

"నా తాత వారి తండ్రులకు చేయూతనిచ్చి
సింహాసనం ఎక్కించారు
సింహాసనం ఈ నాడు చితికిపోయిందిగా
చింతేల, నా శిరస్థలాన్ని వీరిని స్వీకరించా!
కన్నీళ్ళ వెన్నలలు -
వెన్నెల్లో కృష్ణపక్షం కూలిపోతూన్న గుండెల్లో
వేంకటేశ్వరుని కుంభవృష్టి!
ఇది హృద్యంకాదు - గద్యంకాదు
ఇది హృద్యం! దృశ్యం! సత్యం!"[12]



# సూచికలు

## తెలుగుపల్లె – చంద్రంపాలెం

1. రమ్యం జుగుప్సిత ముదార మథాఽపి నీచ
ముగ్రం ప్రసాది గహనం వికృతంచ వస్తు
యద్వాఽప్యవస్తుకవి భావక భావ్యమానం
తన్నాస్తి యన్న రసభావ ముపైతి లోకే - (ధనంజయుడు - దశరూపకమ్)

2. "సామాన్యులకే గాక కళాప్రియులకు కూడా ప్రశంసనీయమైనది పొన్నవాహనం. అదొక కళాఖండం. కర్రతో చేసినదే. మ్రానూ, కొమ్మలేగాక ఆకులుకూడా కర్రవే. చక్కని రంగులుపూసి నిజంగా పొన్నవృక్షమే కదలివస్తున్నదా అన్నంత నైపుణ్యంగా తయారుచేశారు. చెట్టుపై కొమ్మమీద శ్రీ కృష్ణమూర్తి మురళి మ్రోయిస్తూ కూర్చుంటే, తమ వస్త్రాలకోసం గోపికలు అనేక భంగిమలలో కృష్ణుణ్ణి ప్రార్థించే విగ్రహాలు చెట్టుచుట్టూ ఎంతో ఆకర్షణీయంగా ఉంటాయి" - 'మా పిఠాపురం' - పు. 48

3. 1922 వ సంవత్సరం పిఠాపురంలో జరిగిన ఆంధ్రసాహిత్య పరిషత్తు ఏకాదశ వార్షికోత్సవ సభ కధ్యక్షత వహించిన శ్రీ పానుగంటి లక్ష్మీనరసింహారావు మాటలు.

4. 'మా ఊళ్లో వీధి అరుగు'.

5. 'పాతిక సంవత్సరాల తెలుగు కవిత్వము' - భారతి రజతోత్సవ సంచిక.

6. "రామశాస్త్రి భారతం పురాణం చెపుతుంటే, రావిచెట్టు ఊకొట్టు రంగయ గురుపెట్టు" - 'ఏడాది పొడుగునా'.

7. 19-2-1978 వ తేదీన హైదరాబాద్ 'వంశీఆర్ట్సు'వారుచేసిన సన్మానమప్పుడు చదువబడిన కృష్ణశాస్త్రి ప్రసంగ వ్యాసంలోని మాటలు.

8. 'మరపురాని మాటలు సృష్టించిన కృష్ణశాస్త్రి' - శ్రీ పాలగుమ్మి విశ్వనాథం - విజయదుర్గ - సంచి. నవం - 1974

9. 'బూట్ పాలిష్'

10. 'రిక్షావాలా'

11. 'మనిషి మనీషి అయిన కృష్ణశాస్త్రి' - శ్రీ పాలగుమ్మి పద్మరాజు - కృష్ణశాస్త్రి కవితా స్వర్ణోత్సవ సంచిక.

12. "The writer must have a close contact withe the common people. From them he should pick up the language of life. They are the inexhaustible reservoir, from which he should fill his life with experience. They are the dynamo from which he should charge his batteries. He needs raw material from the living world. He needs the compassion that makes for creativity. He should immerse himself in the ocean of human life. Only then does he get the needed warmth. Otherwise, his word will be devoid of life, though pretty in form" - Presidential address of D. V. Krishna Sastry at the Progressive writers conference held at Madras. 'A Poet's Credo'- rendered from the Telugu original by Smt. Hemalata- 'Triveni' – April – June, 1980.

## తండ్రి – పెదతండ్రి

1. ఇది దేవులపల్లి వేంకట కృష్ణశాస్త్రి తండ్రిగారి వ్యవహారనామం. తండ్రీ కొడుకుల పేర్లొకటే.

2. 'Devulapalle - Symbol of pristinc Telugu'- Sri G. Krishna Indian Express - March 7, 1980.

3. "సౌభ్రాత్రమున రామలక్ష్మణులు, సాహిత్యగానములోఁ గుశలవులు-ఇందులోఁ బాండిత్యమునకుఁ బ్రథమ పీఠము మొదటివారిది కాఁగాఁ గవిత్వమునకు నగ్ర తాంబూలము రెండవవారిది అని యీనాఁటి వీరి యాశుకవితావిధాన విశేషములు గనులారకని వీనులారవిన్న రసికప్రకాండుల యేకగ్రీవాభిప్రాయము" 'శతక వాఙ్మయ సర్వస్వము' - ప్ర. సంపు. పు. 411

4. ఆంధ్ర రచయితలు - పు. 117

2. దేవులపల్లి వేంకటరామయ్యగారి 'మాతృస్తవ తారావళి' (ద్వి. సం.)కి(1929) కృష్ణశాస్త్రి వ్రాసిన పీఠికలోని మాటలు.

3. ''ఒక్కొక్కప్పుడు నేను రంగయ్య కాపు మూపుమీద కూర్చుండేవాణ్ణి .... అలా నడిచి వెడుతుంటే మా నాన్నగారో బాబయ్యో నాకు అమరం చెప్పేవారు. రఘువంశ మున్నూ'' - 'మా ఊరుపోయింది' - పుష్పలావికలు - పు. 50

4. ''తండ్రిగారు, పెత్తండ్రిగారు చిన్నప్పుడు పద్యాలు వ్రాసి వినిపించి 'ఏది బాగుంది?' అని అడిగేవారట. వ్యస్తాక్షరి చేయించేవారట. అప్పటినుంచే దేవులపల్లివారికి పదాలసంగీతం తెలిసింది. ఏది మధురమో తెలిసికొనే జ్ఞానమూ కలిగింది. ఈ సంగీత సంగతితోనే వారు ఏడవ ఏటే సామర్లకోటలో 'నంద నందన ఇందిరానాథ వరద' అని తొలిసారిగా పద్యం చెప్పారు'' - శ్రీ తిరుమల రామచంద్ర – 'మరపురాని మనీషి' - పు. 88

5. ''9 సంవత్సరాల వయస్సులోనే వారు ఆశుకవిత్వం చెప్పేవారు''-శ్రీ వేమూరి రాధాకృష్ణమూర్తి - 'ఆణిముత్యాలు' - పు. 110

6. కృష్ణశాస్త్రి 12-వ ఏట పెదతండ్రి, 15వ ఏట తండ్రి పరమపదించారు.

7. ''పేరి పేరయ్యశాస్త్రిగారు మా యింట్లోనే ఉండేవారు, నా తండ్రిగారు పోయాక వారివద్దనే సంస్కృతకావ్యాలు చదివాను. సంస్కృతచదువులో నాకు Seniors వారణాసి సుబ్రహ్మణ్యశాస్త్రి, పన్నాల మల్లికార్జునశాస్త్రి'' - కృష్ణశాస్త్రి వ్రాసిన ఒకానొక Scribbling pad లోని పంక్తులు.

8. ''నా కవితలో నాన్నగారి లిరికల్ ఫెర్వర్, పెదనాన్నగారి జిగీవచ్చాయి అంటారు వారు'' - 'మరపురాని మనీషి' - పు. 88. తమ్మనశాస్త్రి కవితలోని ధారాశుద్ధిని కృష్ణశాస్త్రి పుణికి పుచ్చుకొన్నాడు. తమ్మనశాస్త్రిగారి 'కుక్కుటేశ్వరాష్టకము'లోని ఈ పంక్తులు పరిశీలనార్హాలు.

ఫణీదరీ తారకాశశిమణీ ఘృణి ధోరణీ
తృణీకరణ నైపుణీ విలసితాప సవ్యాంగకమ్
గణాధిప సమర్చితం గణసుధీగణ గ్రామణీ
పణాయిత గుణాన్వితం మనసి కుక్కుటేశంభజే

9. 'శ్రీ కృష్ణశాస్త్రిగారి రచనాభోగం' – శ్రీ ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి – కృష్ణశాస్త్రి కవితా స్వర్ణోత్సవ సంచిక.

10. 19-4-1980వ తేదీన మద్రాసులో ఆరుద్రగారిని కలుసుకొన్నప్పుడు ఈ విషయాన్ని నాకు తెలియజేశారు.

11. "తెలుగు భారతములో ఆ స్తీకుడు జనమేజయుని సర్పయాగం మాన్పించే సందర్భములో నన్నయవ్రాసిన పద్యాలు ఆయనే చదవాలి, ఆయనే వివరించాలి - అని విన్నవారందరూ అనేవారు. పాండురంగమాహాత్మ్యములో రామకృష్ణుని గడుసరితనమును నిగమశర్మోపాఖ్యానములో వివరిస్తూంటే ఈయన రామకృష్ణుడే కాబోలు అని అనిపించేది" - శ్రీ యామిజాల పద్మనాభస్వామి- 'దేవులపల్లి దీప్తి' - భారతి - ఏప్రిల్, 1980.

12. ఫిడేలురాగాలు - ఆంధ్రజ్యోతి వారపత్రిక - సంచిక 14-3-1980

13. "రామనామ సంస్మరణము, రామరాయ సందర్శనము ననుదిన కృత్యములుగా నెంచి పవిత్ర జీవయాత్ర నెఱపిన పండితుఁడు" - అని సుబ్బరాయశాస్త్రిగారిని గూర్చి మధునాపంతుల సత్యనారాయణశాస్త్రిగారు వ్యాఖ్యానించి ఉండడం ఈ సందర్భంలో గుర్తింపదగి ఉంది. ఆంధ్రరచయితలు - పు 117

14. ఇది శ్రీ మద్రామానుజాచార్యుల ధన్యజీవితాన్ని కీర్తించే పద్యకావ్యం. 8 ఆశ్వాసాల్ని రచించి తమ్మనశాస్త్రిగారు దివంగతులుకాగా పిఠాపురాస్థానాన్ని అలంకరించి ఉండిన వేంకట రామకృష్ణకవులు చివరి ఆశ్వాసాన్ని పూర్తి చేశారు.

15. పీఠిక ('దేవులపల్లి వంశం') - మాతృస్తవ తారావళి (ద్వి. సం.)

16. పైదానివలె.

17. ఈ విషయాన్ని కృష్ణశాస్త్రి కోడలు శ్రీమతి లక్ష్మిగారు నాకు తెలియజేశారు.

18. 'ఉద్యోగం'అన్న ప్రకరణంలో ఈ అభిప్రాయభేదానికి సంబంధించిన అంశాలు వివరంగా పరిశీలింపబడినాయి.

19. ఈ విశేషాన్ని కృష్ణశాస్త్రి మేనల్లుడు శ్రీ వి. వి. ఎల్. ప్రభాకర్ గారు నాకు తెలిపారు. "ఇప్పటి మహారాజాగారు శ్రీ రావు వేంకట కుమార మహీపతి సూర్యారావు బహద్దరుగారికి సుబ్బరాయశాస్త్రి సంస్కృత సాహిత్యగురువు. ఈ రాజాగారు మైనరుగా నున్నప్పుడు ఇతని రాజ్యార్హతను గూర్చిన వ్యవహారములో నితనికి గెలుపు కలిగినపుడు సుబ్బరాయశాస్త్రికి కలిగిన యానందమునకు మేరలేదు. ఆ వార్త తొలుదొల్త తనకుఁదెలిపిన రాజభృత్యుని కీకవి తన చేతితోడా తీపి బహుమతిగ నిచ్చెనఁట" అని విద్వాన్ వేదము వేంకట కృష్ణ

శర్మగారి సంఘటననే 'శతకవాఙ్మయ సర్వస్వము' (ప్ర. సంపు పు. 413)న ప్రస్తావించి ఉన్నారు.

20. "నవ్యకవులకు స్వేచ్ఛప్రాణము - వీరు ప్రాణమైనఁ గోల్పోవుదురుగాని శృంఖలముల ధరింపరు. వీరికిఁ బ్రాణముకన్న గానముఁ తీపు. సంకెలలో సంగీతమా? కట్టుఁబాటులోఁ గవిత్వమా?" అని 'ఏకాంతసేవకు'కు పీఠిక వ్రాస్తూ కృష్ణశాస్త్రి పేర్కొన్నమాటలు అతడి విషయంలో కూడా అన్వర్థాలయ్యాయి.

దేశికులు

1. మిగిలిన ఇద్దరు - చిలకమర్తి లక్ష్మీనరసింహం, పానుగంటి లక్ష్మీనరసింహారావు.
2, 3. ఆంధ్ర రచయితలు - పు. 223.
4. మా పిఠాపురం — పు. 84
5. ఈ పంక్తులు కీర్తిగాను నాకు వ్రాసిన జాబులోనివి.
6. మా పిఠాపురం — పు. 86
7. ఆయన వివేకానందుని East and West ఉపన్యాసాలను తెలుగులోనికి అనువదించారు. గాంధీజీ Self restraint ను 'ఆత్మ సంయమనమ'న్న పేరుతోను, ఋషిరాం Ideal life ను 'ఆదర్శజీవితమ'న్న పేరుతోను ఆంధ్రీకరించారు.
8. "చిన్నతనంలో కూచి నరసింహంగారు, తరువాత నాయుడుగారు నాకు ఆంగ్ల సాహిత్యంలో అభిరుచి కల్గించారు అని వారు తరచు భక్తితో అంటారు" — మరపురాని మనీషి — పు. 89
9. "నరసింహము పంతులుగారి వంటి శ్రీ రామభక్తుని మఱియొకరిని మనము చూడము. ఆయన గ్రంథము లన్నియు రామాంకితములే చేసెను" - ఆంధ్ర రచయితలు - పు. 226. నరసింహంగారి 'గౌరాంగచరిత్రము'లోని ఈ పద్యం వారి రామభక్తి కొక మచ్చుతునక "జానకీనాథ! శ్రీ రామచంద్ర! త్వత్ప, దాంబుజములను దెలిపియైనపుడెల్ల నామమునందునిల్పి నీ నామమును వచించుట యెతక్క వేఱొండు చేతఁగాదు" (ప్ర. ఆ. పు. 9)
10. మా పిఠాపురం — పు. 38

11. సోమనాథరావుగారి అంతేవాసులు, కృష్ణశాస్త్రి మిత్రులు ఐన వేదుల శ్రీరామ చంద్ర కీర్తిగారు కూడా ఈ అభిప్రాయాన్నే వ్యక్తంచేశారు.

12. మాపిఠాపురం - పు. 89

13. మరపురాని మనీషి - పు. 89

14. జాతి వెలుగులు - పు. 58

15. ముందుమాట - జాతివెలుగులు

16. ఈ పద్యాలే 'గురుదేవుడు' అన్న శీర్షికతో 'పల్లకి'లో సంపుటీకరింపబడినాయి.

17. 'ఋగ్వీథి'లోని కొన్ని పద్యాలే ఆ తర్వాత 'బ్రహ్మర్షి మాట' అన్న శీర్షికతో 'పల్లకి'లో చేర్చబడినాయి.

18. "ప్రస్తుతం వారు వేంకటరత్నంనాయుడుగారి చరిత్ర వ్రాస్తున్నారు" అని కృష్ణశాస్త్రిని 1963 లో ఆంధ్రప్రభ వారపత్రికలో 'మరపురాని మనీషి'గా పరిచయంచేస్తూ తిరుమల రామచంద్రగారు పేర్కొన్నారు. "ఆయన జీవిత చరిత్ర వ్రాస్తున్నాను. అది చాలా దుర్ఘటంగా ఉంది" అని కృష్ణశాస్త్రి జన, 26, 1970 లో జరిగిన ఆంధ్రబ్రహ్మసమాజసమ్మేళన సందర్భంగా వ్రాసి పంపిన సందేశంలో పేర్కొని ఉండడం గమనార్హం.

19. పాతిక సంవత్సరాల తెలుగు కవిత్వము.

20. 'కృష్ణశాస్త్రిగారి కోసం' - ఆంధ్రపత్రిక - సంచి. మార్చి 17, 1980

21. కృష్ణశాస్త్రి అర్ధాంగి శ్రీమతి రాజహంసగారు ఈ విషయాన్ని నాతో చెప్పారు.

22. ప్రముఖ హరిజన నాయకులు, మాజీ కేంద్రమంత్రి బి. యస్. మూర్తిగారు పిఠాపురం హరిజన వసతిగృహంలోని విద్యార్థి. కృష్ణశాస్త్రిశిష్యులే. కృష్ణశాస్త్రి చేసిన హరిజనసేవ డా॥ బోయిభీమన్నగారి 'పాలేరునుంచి పద్మశ్రీ వరకు'లో విపులంగా పేర్కొనబడింది.

23. 15-3-1978 వ తేదీన పిఠాపురం ఆదిఆంధ్రులు సమర్పించిన సన్మాన పత్రంలోని పంక్తులు.

24. విజయదుర్గ - సంచి. నవం. 1974

25. శ్రీమతి రాజహంసగారు ఈ విషయాన్ని నాకు తెలియజేశారు.

16

26. ఆరోజుల్లో బ్రహ్మసామాజికులు జనాభాలెక్కల సేకరణ సందర్భంలో కులం అనే పదానికెదురుగా 'ఏకులమూకాదు. బ్రహ్మసామాజికులం' అని వ్రాసేవారట.

27. ఈ సంఘటనను వేదుల శ్రీరామచంద్రకీర్తిగారు నాకు వ్రాసిన జాబులో పేర్కొన్నారు.

28. మావూరు పోయింది.

ఉద్యోగం

1. 'నాస్మృతి పథంలో కృష్ణశాస్త్రి' - ఆచంట జానకిరాం - విజయదుర్గ - కృష్ణశాస్త్రి ప్రత్యేకసంచిక - నవం. 1974

2. 19-2-1978 వ తేదీన కృష్ణశాస్త్రికి హైదరాబాద్ వంశీ ఆర్ట్సువారు ఏర్పాటు చేసిన సన్మానసభలో చదువబడిన ప్రసంగవ్యాసం.

3. కృష్ణశాస్త్రి రెండవభార్య తండ్రి శ్రీ గాడేపల్లి సూర్యనారాయణశర్మ ప్రముఖ జాతీయ కాంగ్రెసువాది. వారు జాతీయోద్యమంలో పాల్గొని జైలుశిక్షను కూడా అనుభవించారు. ఈ విషయాన్ని నాకు శ్రీ వేదుల శ్రీ రామచంద్రకీర్తి, కృష్ణ శాస్త్రి మేనల్లుడు శ్రీ వింజమూరి ప్రభాకర్ తెలియజేశారు.

4. "మహారాజు కృష్ణశాస్త్రిగారి జాతీయభావములు సహింపలేక యుద్యోగము నుండి తొలగించివైచెను" అని శ్రీమధునాపంతుల సత్యనారాయణశాస్త్రి (ఆంధ్రరచయితలు - పు. 496); "కాకినాడ పెద్దాపురం మిషన్ హైస్కూలులో ఉపాధ్యాయులుగా పనిచేస్తూ 'ధర్మసాధని' అన్న పత్రికలో పిఠాపురం రాజా వారికి వ్యతిరేకంగా వ్యాసాలు వ్రాశారు వారి భావాలు రాజాగారికి నచ్చనందున పనిమాని"నట్లు శ్రీ తిరుమల రామచంద్ర (మరపురాని మనీషి - పు. 89); "మహారాజుతో తీవ్రమైన అభిప్రాయభేదం వచ్చి తన ఉద్యోగానికి రాజీనామా ఇచ్చారు" అని శ్రీ గోరాశాస్త్రి (సాహితీయుగకర్త అస్తమయం - తెలుగు విద్యార్థి - మార్చి, 1980) పేర్కొన్నారు. ప్రసిద్ధకవి, పిఠాపురం వాస్తవ్యులు ఐన శ్రీ ఆవంత్స సోమసుందర్ మాత్రం అప్పట్లో రాజాగారి దివానుతో అభి ప్రాయభేదం వచ్చి కృష్ణశాస్త్రి ఉద్యోగానికి రాజీనామా చేశాడని నాకు తెలియ జేశారు.

5. పాతిక సంవత్సరాల తెలుగు కవిత్వము - భారతి రజతోత్సవ సంచిక,

6. శ్రీమతి రాజహంసగారి విషయాన్ని నాకు తెలిపారు.

7. ట్యూటర్సు గదిలో కూర్చొని పుస్తకాల్ని దిద్దుకొంటున్న కృష్ణశాస్త్రిని స్మృతికి తెచ్చుకొన్న నాటి జగన్నాథరావుగారి మాటలు.

8. భావకవి - పల్లకీ - స్వర్ణోత్సవ కవితాసంపుటి.

9. సంక్రాంతి - పైదానివలె.

10. "కృష్ణశాస్త్రిచేత నాటకము వ్రాయించి ప్రసారము చేయడము ఒక మహా యజ్ఞము చేసినంతపని" - అచంట జానకిరాం - సాగుతున్న యాత్ర - రెం. సం. పు. 217.

11. "గాంధీకాలంలో కంఠమెత్తిపాడిన ఆ హరీంద్రనాథుని చూడండి। ఆ మహోద్యమం కోసమే పుట్టినాడా అన్నట్లు మా గుండెల్ని కదిపిన కవి అతడు. 'ఘరూహువా హైజంగ్ - ఆవో ఆవో। వీరోఁ ఆవో దేశధర్మపర్ బలి బలి జావో। లేంగే, లేంగే, స్వరాజ్యలేంగే' అంటూ భారతయోధుల్ని ఉత్పాత లూగిఁచాడు కదా। సైనికుల్ని హత్యాపాతకానికి పురికొల్పడంకాక, అహింసాయుతమైన అమాయకమగు ఆత్మబలికి సంసిద్ధుల్ని చేయడం గాంధీయుగధర్మం. ఆ సత్యాగ్రహానికి తయారు చేసింది హరీంద్రుని గర్జన" - ఆంధ్రమహిళాసభ (హైదరాబాద్) వారు నవం. 1, 74 నాడు ఏర్పాటుచేసిన కృష్ణశాస్త్రి జన్మదినాభినందన సభ కధ్యక్షత వహిస్తూ శ్రీ తల్లాప్రగడ ప్రకాశరాయుడు పలికిన మాటలు.

12. పాతిక సంవత్సరాల తెలుగు కవిత్వము.

13. హైదరాబాద్ వంశీ ఆర్ట్సువారు కృష్ణశాస్త్రికి సన్మానం చేసినప్పుడు చదువబడిన ప్రసంగవ్యాసంలోని మాటలు.

14 మాచిన్నన్నగారు - ఆంధ్రజ్యోతి వారపత్రిక - సంచి. 28-3-1980

15. 'భక్త్యంజలి' - కృష్ణశాస్త్రి కవితాస్వర్ణోత్సవ సంచిక.

16. "సోదరుడు కృష్ణశాస్త్రి వీనిని గురించి పలుతావుల నభిమానముతో పలికియు, వీనిని పెక్కుసభల పాడియు" ఎంకిపాటల ప్రచారానికి తోడ్పడిన సంగతిని గూర్చి నండూరి సుబ్బారావే పేర్కొని ఉండడం గుర్తింపదగి ఉంది (క్రొత్త పాటలకు పీఠిక - ఎంకిపాటలు)

17. పాతిక సంవత్సరాల తెలుగు కవిత్వము.

18. "కొంతకాలం నామీద ప్రసరించిన దూషణ భూషణలు నవ్యకవుల్లో మరెవ్వరి మీదా పడలేదు" - పైదానివలె.
19. "ఆయన కఠోర గ్రాంథికుడు. ఇంటిలో ప్రేయసీ! పాదప్రక్షాళనంబునకు జలంబు నిటు తెమ్ము' అని అంటాడని విద్యార్థులు చెప్పుకొని నవ్వుకొనేవారు"- శ్రీ ఏకుమళ్ళ కామేశ్వరరావు - నావాఙ్మయ మిత్రులు - పు. 184
20. 'కవికోకిల' ఆవంత్స వేంకటరంగారావుగారు ఈ సంఘటనని నాకు తెలియజేశారు.
21. పాతిక సంవత్సరాల తెలుగు కవిత్వము.
22. 'ఆంధ్రదేశంలో సాహిత్య సంఘాలు' - వ్యాసక్రీడలు - పు. 192
23. పాతిక సంవత్సరాల తెలుగు కవిత్వము.
24. 'దేవులపల్లి దీప్తి' - భారతి - సంచి. ఏప్రిల్, 1980

సాహితీమిత్రసమితి

1. 1970 లో 'రచన' (సాహితీవేదిక) ఆధ్వర్యాన మద్రాసులో ఈ సదస్సు జరిగింది.
2. 'నా అభిమానకవి' - స్వామి శివశంకరస్వామి - ఈనాడు-సంచి. 9-3-1980
3. పాతిక సంవత్సరాల తెలుగు కవిత్వము.
4. సమకాలిక భారతీయ సాహిత్యము - పు. 249
5. పైదానివలె - పు. 87,88
6. కోలవెన్ను రామకోటీశ్వరరావు-సమకాలిక భారతీయ సాహిత్యము - పు. 176

"If modern Telugu writers can pride themselves on their very good sense of form in all fields of literature - drama; poetry or story - the credit should largely go to Sastry. It can be said without fear of exaggeration that there is no modern writer in the Telugu land who has not been influenced by Sastry to some extent. It was he that was mainly responsible for the establishment of the "Navya Sahitya Parishat" - Triveni - March, 1938.

7. శ్రీ కేతుమర్ల కామేశ్వరరావు - నా వాఙ్మయమిత్రులు - పు. 311.

8. ఆంధ్రరచయితలు - పు. 337

9. "సాహితీ సమితి స్థాపనతో భావకవులకొక గూడేర్పడినది. నవ్యసాహిత్య పరిషత్తు స్థాపనతో అది తాజమహాలుగా రూపొందినది" - ఆధునికాంధ్ర కవిత్వము - పు 330

10. నవ్యాంధ్ర సాహిత్య వీథులు - ద్వి. భా. పు. 299.

11. పైదానివలె - పు. 302

12. ఈ పరిచయాన్నిగూర్చి శివశంకరశాస్త్రి 'నా అభిమానకవి' అన్నవ్యాసంలో ప్రస్తావించి ఉన్నారు.

13. పాతిక సంవత్సరాల తెలుగు కవిత్వము.

14. ఆంధ్రపత్రిక - మే 7, 1947. ఉదాహృతము - నవ్యాంధ్ర సాహిత్య వీథులు - ద్వి. భా పు. 296, 297.

15. ఆధునికాంధ్ర కవిత్వము - పు. 330

16. Krishna Sastry: Man and poet - Triveni - Jan. 1955

17 ఆంధ్రదేశంలో సాహిత్యసంఘాలు - వ్యాసక్రీడలు - పు. 191

18. పెళ్ళయిన కొత్తలో శ్రీ శ్రీ ఇల్లాలినీ వాకిలినీ వదలి విశాఖపట్టణం నుండి విజయనగరం దాకా కృష్ణశాస్త్రి చుట్టూ ఉపగ్రహంలాగా తిరిగి తండ్రిచేత మెత్తగా చీవాట్లుకూడా తినడం జరిగింది. 'కృష్ణశాస్త్రి జ్ఞాపకాలు' - అనంతం - స్వాతి - మే, 1980.

19. పైదానివలె.

20. ఆధునికాంధ్ర కవిత్వము - పు. 320.

21. "For atleast a generation and more from the 'Twenties in to the 'Forties he was the Andhra young man's dream of poetry come true. He not only wrote more poetry but lived it. There used to be in Andhra any number of budding poets and others who affected his manners and mannerisms with varying degrees of suc-

cess, but none at all who could rise to the same heights as he did on the parnassus" - Sri D. Anjaneyulu-'D. V. Krishna Sastry - His Muse and Message - Triveni- April-June, 1980.

22 ఈ పద్యాన్ని శ్రీ పాలగుమ్మి పద్మరాజుగారు నాకు అందజేశారు.

23 ఆధునికాంధ్ర కవిత్వము - పు 586

24. నవ్యాంధ్రసాహిత్యవీథులు - చ. భా. పు. 761. "నోరి, తల్లావజ్ఝల, విశ్వనాథలు ఈ ఉద్యమాన్ని ఆదరించలేదు. మీదు మిక్కిలి ఖండిస్తూ వచ్చినారు" - అదే - పు. 766.

25. కృష్ణశాస్త్రిజ్ఞాపకాలు - శ్రీ శ్రీ - స్వాతి - మే, 1980.

26. రాజమండ్రి సభ - తెలుగుతల్లి - మార్చి, 1946.

27. ఆచార్య పి. నారాయణరెడ్డి - ఆధునికాంధ్ర కవిత్వము - పు. 591.

28 బూట్‌పాలిష్.

29. "మేష్టారు (కృష్ణశాస్త్రి) పిఠాపురంలో ఉన్నంతకాలమూ నవకవులకు పిఠాపురం ఒక యాత్రాస్థలం అయిపోయింది" - మా పిఠాపురం - పు. 136. "నాకోసం విశ్వభారతికి వెడుతూ కాకినాడలో దిగి అక్కడలేకపోతే 12 మైళ్ళు ఎండలో పిఠాపురం నడచి వచ్చాడు గోపాలరెడ్డి about 1925 or 26" - కృష్ణశాస్త్రి ఒక Scribbling pad లో వ్రాసినమాటలు.

30. 'మాకృష్ణశాస్త్రి' - కృష్ణశాస్త్రి కవితా స్వర్ణోత్సవ సంచిక.

31 'సాహితీ యుగకర్త అస్తమయం' – తెలుగు విద్యార్థి – మార్చి, 1980.

32. పాతికసంవత్సరాల తెలుగు కవిత్వము.

సత్కృతులు

1. ఈ విషయాన్ని నాకు కృష్ణశాస్త్రి మేనల్లుడు శ్రీ వింజమూరి ప్రభాకర్ తెలిపారు.

2. ఆణిముత్యాలు – 110, 111 పుటల్లో శ్రీ వేమూరి రాధాకృష్ణమూర్తి ఈ సంఘటనని ప్రస్తావించిఉన్నారు.

3. నవ్యసాహిత్య పరిషత్తు పదకొండవ సమావేశం ముక్త్యాలలో 1946 జన. 5, 6 తేదీల్లో జరిగింది.

4. 19-2-1978 వ తేదీన కృష్ణశాస్త్రికి వంశీఆర్ట్స్, హైదరాబాద్ చేసిన సన్మాన మప్పుడు చదువబడిన ప్రసంగవ్యాసం నుండి.

5. పైదానివలె,

6. 'కృష్ణశాస్త్రిగారికోసం' - ఆంధ్రపత్రిక - దినపత్రిక - సంచి. 17-3-1980

7. 19-4-1980 వ తేదీన మద్రాసులో ఆరుద్రగారిని కలుసుకొన్నప్పుడీవిష యాన్ని నాకు తెలియజేశారు.

8. 29-4-1980 వ తేదీన తిరుపతిలో డా॥ దాశరథిగారిని కలుసుకొన్నప్పుడీ సంగతిని నాకు తెలిపారు. కృష్ణశాస్త్రి ఏలూరులో జరిగిన నవ్యాంధ్ర సాహిత్య పరిషన్మహాసభలప్పుడు కుందుర్తి, ఏల్చూరి, అనిశెట్టి, తిలక్, పన్యాలవంటి నవయువకవులకు వేదికను కల్పించి, వారి కవితలను ఏవిధంగా 'ప్రతిభ' ప్రత్యేకసంచికలో వెలువరించినదీ శ్రీ ఏల్చూరి సుబ్రహ్మణ్యంగారు నాకు తెలియ జేశారు (29-6-1980).

9. 'Bairagi' - ఆలూరి బైరాగి సంస్మరణ సంచిక. ఆదేసంచికలో 'అక్షరాలా యథార్థమయింది శ్రీ కృష్ణశాస్త్రిగారి వాక్కు' అన్నస్మృతివ్యాసంలో సన్నపనేని సుబ్బారావుగారు కూడా ఇటువంటి ఒక సంఘటనను తెలియజేసి ఉండడం గమనార్హం.

10. 'దేవులపల్లి దీప్తి' - భారతి - ఏప్రిల్, 1980.

11. 'మా కృష్ణశాస్త్రి' - కృష్ణశాస్త్రి కవితా స్వర్ణోత్సవ సంచిక.

12. 'కృతజ్ఞత' - శ్రీరావు వేంకటమహీపతి గంగాధరరామారావు - పైదానివలె.

# కృష్ణశాస్త్రి సాహిత్యం

"కరుణకలదు ప్రేమకల దీవికలదాత్మ
కలదు కృష్ణశాస్త్రి కవితయందు"

— తుమ్మల

జి. చెన్నయ్య

# నవ్యసాహిత్యం - కృష్ణశాస్త్రి

"పురాణ మిత్యేవ నసాధు సర్వం
నచాపి కావ్యం నవమిత్యవద్యం
సంతః పరీక్ష్యాన్యతరద్భజంతే
మూఢః పరప్రత్యయనేయ బుద్ధిః"

జాతీయ జీవనస్రవంతిలో కాలానుగుణంగా సంభవించే ప్రముఖమైన పరిణామాలను తనలో ప్రతిబింబింపజేస్తూ, జాతి పురోగమనానికి చేయూతనిచ్చే సాహిత్య ప్రస్థానంలో ఎన్నో మార్పులు, చేర్పులు జరుగుతూ ఉండడం సహజం. ఇరవయ్యవ శతాబ్ది ప్రారంభంనుండి దేశవ్యాప్తంగా సామాజికంగా తలఎత్తిన వినూత్న దృక్పథంవల్ల తెలుగులోనే కాక, ఇంచుమించు భారతీయసాహిత్యాలన్నింటిలోను మును పెన్నడూ లేనంత నవ్యత్వం చోటుచేసుకొన్నది. నవ్యాంధ్ర సాహిత్య క్షేత్రంలో అంకురించి వికసించిన కవితా రీతులలో భావకవిత్వం, అభ్యుదయ కవిత్వం ప్రధానమైనవి. దేవులపల్లి వేంకట కృష్ణశాస్త్రి భావకవిత్వానికి 'పర్యాయపదం' గా ప్రసిద్ధిపొందాడు.

"ఆధునిక కవిత్వాకాశంలో హరివిల్లులా దూసుకు వచ్చిన ఈ భావకవిత్వానికి కృష్ణశాస్త్రిగారు లాలిత్యాన్ని, విశిష్టతనేకాక, శాశ్వతత్వాన్ని కూడ సంతరింప చేశారు."[1] కృష్ణశాస్త్రి భావకవితాశాఖ నారోహించి 'విహంగమపతి' యై 'స్వేచ్ఛాగాన ఝరుల' కురిపిస్తూ, నిరంతరమైన తపనతో విశ్వసౌందర్య దేవత సాక్షాత్కారం సాధించి, 'గంధర్వగానం' తో పరమేశ్వరు నారాధించి, మనిషికోసం-మానవత కోసం 'దివినుండి భువికి' దిగివచ్చి 'గళం' ఆగిపోయినా 'కలం' ఆపక జీవితాంతం సాహితీ తపస్సు చేసిన మహనీయుడు.

'భావకవితా కళాప్రపూర్ణు' డైన కృష్ణశాస్త్రి 'ప్రాచీన నవీన ప్రగతివాదాల త్రివేణీ సంగమం'[2] అంతేకాక ప్రాక్పాశ్చాత్య సంస్కృ

తులకు సమన్వయ స్వరూపం. అతని బహుముఖ ప్రజ్ఞ లోకాన్ని 'దిగ్భ్రాంతం' చేసింది. అతడు చేపట్టిన పద్యం, గేయం, వచనం, రూపకం- ఈ ప్రక్రియ లన్నింటిలోను కృతకృత్యుడయ్యాడు. అందుకే 'స్పర్శవేది వంటి ఆయనచేయి ఏ సారస్వత శాఖపై పడినా అది సువర్ణ మయ మయింది'[3] - అనే అభిప్రాయం అక్షరాల సత్యం. నవ్యకవి వతంసమైన కృష్ణశాస్త్రి సాహిత్యాన్ని పరిశీలించడానికి ముందు నవ్య సాహిత్యోద్యమానికి దోహదంచేసిన అంశాలను, నవ్య సాహిత్య స్వరూప స్వభావాలను సంగ్రహంగా సమీక్షించడం ఆవశ్యకం.

## నవ్యసాహిత్య హేతువులు

భారతీయ సాహిత్యాలలో నవయుగోదయానికి పాశ్చాత్య విద్యావ్యాప్తి, దేశంలో ప్రవర్తిల్లిన వివిధోద్యమాలూ మూలకారణా లుగా గుర్తింపబడ్డాయి.

పందొమ్మిదవ శతాబ్దం ఉత్తరార్థంలో భారతదేశంలో అడుగు పెట్టిన పాశ్చాత్య విద్యావిధానం, శాస్త్ర సాంకేతిక రంగాలలో వచ్చిన ప్రగతి - ఇవి భారతీయ సాంఘిక స్థితిగతులలో అపూర్వమైన చైతన్యాన్ని రేకెత్తించాయి. 1857 లో స్థాపింపబడిన మద్రాసు, బొంబాయి, కలకత్తా, విశ్వవిద్యాలయాల మూలంగా పాశ్చాత్యుల సాహిత్యం, చరిత్ర, రాజనీతి, తత్త్వశాస్త్రం, శాస్త్రవిజ్ఞానం మొదలైనవి విద్యావంతులకు పరిచయమయ్యాయి.

అందులో ముఖ్యంగా జీవితంపట్ల సరిక్రొత్త విలువలను ప్రతిపాదించే పాశ్చాత్య సాహిత్యాన్ని భారతీయులు సంభ్రమాశ్చర్యాలతో అధ్యయనం చేశారు. దాని ఫలితంగా యావద్భారత దేశంలోను విద్యాగంధం కలవారిలో లౌకిక జీవితంపట్ల సినూత్నమైన దృక్పథం విప్పారింది. ఆ దృక్పథం ఆధునిక భారతీయ సాహిత్యాలలో ప్రతిఫలించి వికసించింది. భారతీయుల జీవిత సాహిత్యాలపై ప్రబలమైన ప్రభా

వాన్ని ప్రసరించిన పాశ్చాత్య సాహిత్యంలోని ఈ క్రింది ముఖ్య స్వభావాలు గమనింపదగి ఉన్నాయి.

పాశ్చాత్య సాహిత్యం సౌందర్యమయం. దానికి కేంద్ర బిందువు మనిషి. అది ఐహిక జీవితాన్ని విలువైనదిగా, అనుభవయోగ్యంగా పరిగణించింది. మనిషికి మనిషిగా విలువనూ, ఆవశ్యకమైన గౌరవాన్నీ గుర్తించింది. దాని దృష్టిలో జీవితం శాపంకాదు; మాయకాదు. వైయక్తికమైన మనోవికారాలూ, అనుభూతులూ, ఆశలూ, ఆకాంక్షలూ దానిలక్ష్యాలు. మానవ స్వభావంలోని తారతమ్యాలను అది మన్నించింది. ఔదాసీన్యమూ, అలసత్వమూ దానికినచ్చవు. సర్వసాధారణంగా అది భగవంతుని సర్వాంతర్యామిత్వాన్ని దర్శించింది. ఈ విషయంలో భారతీయ తత్వానికి ఆ సాహిత్యం సన్నిహితం[4].

వాస్తవికతావాదం ప్రాధాన్యం వహించిన పాశ్చాత్య సాహిత్యంలోని షేక్స్పియర్, వర్డ్స్వర్త్, షెల్లీ, కీట్సు, టెన్నిసన్, బ్రౌనింగు మొదలైన కవుల కృతులు భారతీయ కవులను విశేషంగా ఆకర్షించాయి. ఆంగ్లసాహిత్య ప్రభావం పారలౌకిక జీవితమే ప్రధానగమ్యంగా ఉండిన భారతీయ సాహిత్య సంప్రదాయంలో విప్లవాత్మకమైన దృక్పథానికి దారి చూపింది.

ఇక నవ్యసాహిత్య వికాసానికి తోడ్పడిన ముఖ్యమైన ఉద్యమాలను పేర్కొనడం అవసరం.

రాజారామమోహనరాయలు 1828లో వంగదేశంలో ప్రారంభించిన మానవోద్యమం (Humanism) బ్రహ్మసమాజం 'వాహిక'గా క్రమంగా దేశవ్యాప్తంగా సంఘసంస్కరణ కార్యక్రమాలకు పాదులు తీసింది. విశ్వమత మహాసభలో వివేకానందస్వామి హిందూధర్మం సర్వధర్మ సారంగా నిరూపించి (1893) విజయదుందుభి మ్రోగించడంతో హైందవోద్యమం సుస్పష్టమైన రూపురేఖలతో ముందంజ వేసింది.

స్వామిదయానంద సరస్వతిస్థాపించిన ఆర్యసమాజం (1875) హిందూధర్మ ప్రాశస్త్యాన్ని ప్రచారం చేయబూనింది. ఈ మతోద్యమాలుకూడ సంఘ సంస్కరణలో పాలుపంచుకొంటూ భారతీయ సాహిత్యాలపై తమ ప్రభావాన్ని ప్రసరించాయి.

స్వాతంత్ర్యంకోసం శంఖారావం చేసిన జాతీయోద్యమం (Nationalism) గాంధీజి నాయకత్వంలో 1920 తరువాత సాహిత్య జగత్తుపై విశేషమైన ప్రభావాన్ని వెలార్చింది. జాతీయ నాయకుల ప్రబోధాలు లక్షలాది యువతీయువకుల హృదయ కవాటాలను వివృతం చేసి నవ్యచైతన్యాన్ని కురిపించాయి. ప్రధానంగా మానవోద్యమమూ, జాతీయోద్యమమూ, భారతీయులలో మహనీయమైన ఆదర్శాలనూ, సమైక్యభావాన్ని ప్రతిష్ఠించాయి.

పై ఉద్యమాలకుతోడు విశ్వకవి రవీంద్రుని ప్రభావంకూడ గణనీయ మయ్యింది ఆకవీంద్రుని 'అవ్యక్తమధురవాక్కు' వంగదేశం నుండి బయలుదేరి భారతీయ సాహిత్య వీధులలో మలయమారుతం లాగ వ్యాపించింది ''ఆ వాక్కులో విశ్వమానవతావాదం దోబూచులాడింది. విశ్వసౌందర్య దేవతా సౌందర్యం పిసాళించింది. తరతరాలుగా చెల్లుతూవున్న భారతీయోపనిషత్సారం, తథాగతుని సర్వజనతా సమతావాదం, కాళిదాస కవితా రామణీయకం, పాశ్చాత్య సభ్యతా చైతన్యం సర్వమూ రాశీభూతమై రవీంద్రభారతిగా ఆవిష్కరింపబడింది. ఆగురుదేవుని సాన్నిధ్య సుఖాన్ని అనుభవించినవారు, ఆ మహాకవి సాహిత్యామృతాన్ని ఆస్వాదించినవారు తదితర భాషాసాహిత్యాలలో నూతన శకాలను సృష్టించారు.''[5]. ఈ ప్రభావాలన్నింటి ఫలితంగా భారతీయ భాషలలో నవ్యసాహిత్యం ఆవిర్భవించి నిలద్రొక్కుకో గలిగింది.

ఆంధ్రదేశంలో కందుకూరి వీరేశలింగం పంతులు 1887 లోనే 'బ్రహ్మసమాజ ధ్వజాన్ని ప్రతిష్ఠించడ'మే కాక, 'పద్యచాపము విడిచి, సరళసుందరమైన 'గద్యచాపము చేపట్టి' వర్తమాన ఆంధ్ర సాహిత్య భీష్ముడు' గా విజృంభించాడు. నవ్యాంధ్ర సాహిత్యంలోని వచన ప్రక్రియలలో చాలవాటికి అతడే మూలపురుషుడు. ఆటుతరువాత ఈ శతాబ్ది ప్రారంభంలో గురజాడ అప్పారావు రాయప్రోలు సుబ్బారావు కవులు నవ్యాంధ్ర కవిత్వానికి యుగప్రవర్తకులయ్యారు. గురజాడ 'ముత్యాల సరాలు' రాయప్రోలు 'తృణకంకణం' మొదలైన ఖండకావ్యాలు నవ్యత్వం ననలెత్తిన కృతులు. గురజాడ 'ప్రాతకొత్తల మేలికలయిక' తో శిష్టవ్యావహారిక భాషలో గేయరచనకు కావ్యగౌరవాన్ని సమకూర్చగా, రాయప్రోలు సాంఘిక వస్తు స్వీకారంతో, శైలీ లాలిత్యంతో భావ కవిత్వానికి మూలపురుషుడయ్యాడు.

## భావకవిత్వ స్వభావం

భావకవిత్వంలో వస్తువు, భావం, రచన – అనే మూడింటిలోను భావం ప్రాధాన్యం వహిస్తుంది. ఈ కవిత్వానికి 'ఆత్మాశ్రయరీతి' ప్రాణం. కవులు తీవ్రమైన తమ సుఖదుఃఖాత్మకమైన అనుభూతులనూ తమ హృదయాన్ని ద్రవింపజేసిన ఇతరుల అనుభూతులనూ ఆత్మీయత ముద్రతో అభివ్యక్తం చేస్తారు. ఈ సందర్భంలో ''ఆత్మాశ్రయరీతిలో రచనచేయు కవి, అందరికి కేవల మింద్రియ గోచరమగు సత్యమును, సౌందర్యమును తన గుండెలో రంగరించుకొని, తనదిగా చేసికొని, వాడిగా, వేడిగా, జవజీవములతో ప్రకటించును. కావున ఆత్మాశ్రయ కవిత్వమునకు, కవి జీవితమునకు పోలికలుండవచ్చును గాని, అభేద మూహింపరాదు''[6] అనే హెచ్చరిక మరువరాదు.

ఈ కవిత్వంలో సాంఘికమైన ఇతివృత్తాలూ, సాంఘిక దృక్పథంతో కూడిన ఇతివృత్తాలూ స్వీకరింపబడ్డాయి. సజీవ భాషాప్రయో

గానికీ, నూతనమైన పదబంధాలకూ, సరిక్రొత్త కవి సమయాలకూ ఈ కవిత్వం పెట్టిందిపేరు. ఇందులోని విశిష్ట రచనకు 'నగిషీ రచన' అని పేరు వచ్చింది. భావ రామణీయకమే భాష ప్రామాణికత్వానికి ముఖ్య ప్రమాణమయ్యింది. అందువల్ల గ్రాంథికంతో సరిసమానంగా వ్యావహారికం ఆదరణ పొందింది. కడకు పామరభాష సైతం కావ్యగౌరవానికి నోచుకొన్నది.

పద్యరచనతోపాటు గేయరచన కూడ అందలమెక్కింది. ఈ కవిత్వంలో క్రమంగా వచనగేయ రచనకూడ కొంత చోటుచేసుకొన్నది. వేర్వేరుగానే కాక పద్యగేయ మిశ్రితమైన రచనలుకూడ బయలుదేరాయి. గానగుణప్రధానమైన ఆంగ్లంలోని 'లిరికల్ పొయట్రీ' ఒరవడిగా వ్రాయబడిన భావగీతాలకు ప్రాధాన్యం లభించింది. ఆత్మాశ్రయరీతిలో వ్రాయబడిన కవితాఖండికల సంపుటాలూ, అనతి విస్తృతమైన కృతులూ ఖండకావ్యాలుగా పరిగణింపబడ్డాయి 'లలితపద విన్యాసం', 'శైలీసౌకుమార్యం', 'అలతి యలతి పదముల జిలుగు విరుపులు' ప్రాధాన్యం వహించిన ఖండకావ్యాలు దీనిలో అగ్రగణ్యత పొందాయి. ఛందోవ్యాకరణ నియమాలలో కొంత సడలింపూ, స్వేచ్ఛాప్రవృత్తీ చోటు చేసుకొన్నాయి. రాయప్రోలు నవ్యకవిత్వానికి ప్రత్యేకంగా లక్షణ నిర్దేశం చేయడం గమనింపదగ్గది

భావకవిత రీతిలో రాయప్రోలుతోపాటు కృష్ణశాస్త్రి, తల్లావఝ్జల శివశంకరశాస్త్రి, వేదుల సత్యనారాయణశాస్త్రి, నాయని సుబ్బారావు, అడవి బాపిరాజు, విశ్వనాథ సత్యనారాయణ, బసవరాజు అప్పారావు, అబ్బూరి రామకృష్ణారావు, దువ్వూరి రామిరెడ్డి మొదలైన అనేక కవులు ప్రసిద్ధిపొందారు. "ఈ శాఖలో నూటికి నూరుపాళ్ళు భావకవి అయినవారు దేవులపల్లి కృష్ణశాస్త్రిగారు. భావోద్వే

గంతో, అక్షరరమ్యతతో, వినూత్నోపమానాలతో కృష్ణశాస్త్రిగారి కవనం వికాసంచెందింది. ఆయనసృష్టి ఒక గంధర్వగానం."[7]

మన ప్రాచీన సాహిత్యంలో ఆత్మాశ్రయరీతి లేదని ఎవరూ చెప్ప లేరు. కాళిదాసు మేఘసందేశం, జయదేవుని గీతగోవిందం, పోతన భాగవతం, శతక వాఙ్మయం, జానపద వాఙ్మయం - ఇలాంటి వాటిలో కనిపించే ఆత్మాశ్రయత్వానికీ భావకవిత్వంలోని ఆత్మాశ్రయత్వానికీ స్పష్టమైన భేదాలు గుర్తింపబడ్డాయి. ఆంగ్ల కాల్పనిక కవుల (Romantic Poets) ప్రభావం ప్రధాన కారణంగా ఈ భావకవిత్వం వికసించిందని చెప్పడం నిర్వివాదం.

## భావకవిత్వ శాఖలు

భావకవిత్వంలోని ప్రణయ కవిత్వం, దేశభక్తి కవిత్వం, ప్రకృతి కవిత్వం, సంఘ సంస్కరణ కవిత్వం, భక్తి కవిత్వం, స్మృతికావ్యాలు - అనే శాఖలనూ, వాటిలోని విశేషాలనూ ఆచార్య సి. నారాయణరెడ్డి పేర్కొని లక్ష్యలక్షణ నిర్దేశం చేయడం జరిగింది. ఈశాఖలలో ప్రణయ కవిత్వం, దేశభక్తి కవిత్వం అగ్రగణ్యాలు. పై శాఖలకుతోడు అదనంగా మరికొన్ని శాఖలను గుర్తించి, వాటిస్వభావాలను పేర్కొన వలసిన అవసరముంది. నవ్యకవితా శాఖలన్నీ ఇంచుమించుగా గురజాడ రాయ ప్రోలు కవులలో'నే అంకురించాయి. ఈపరిశీలనలో భావకవిత్వశాఖ లను కృష్ణశాస్త్రి కవితావికాసానికి అనుగుణంగా పేర్కొవడం జరిగింది.

### 1. ప్రకృతి కవిత్వం

"దృశ్యమానమైన స్థావర జంగమాత్మకమైన జగత్తంతయు ప్రకృతియని స్థూలముగా భావించవచ్చును... 'ప్రకృతి' శబ్దము దృశ్య మాన జగత్తులోని చెట్లు, గుట్టలు, నదులు, తీగెలు, పూలు, కోకిలలు,

తుమ్మెదలు మున్నగువానికే రూఢమై పోయినది. '' ప్రకృతి వర్ణనలు మొదటినుండి సంస్కృతాంధ్ర సాహిత్యాలలోను, విశేషించి మన ప్రబంధాలలోను విస్తారంగా కనిపిస్తాయి. పూర్వకవులకు, నవ్యకవులకు ప్రకృతి చిత్రణలో స్పష్టమైన భేదాలు గుర్తింపబడ్డాయి. ముఖ్యంగా ప్రబంధకవులు 'ఊహాశక్తి' కి ప్రాధాన్యమీయగా, నవ్యకవులు హృదయస్పందనతో కూడిన భావనా రామణీయకానికి ప్రాధాన్యమిచ్చారు. వారు లాక్షణికుల నిర్దేశాలకు విధేయులుకాగా, వీరు సర్వ తంత్ర స్వతంత్రులు. వారి వర్ణనలకు ఇతివృత్తంతో పొత్తు తక్కువ కాగా, వీరి వర్ణనలకు ఇతివృత్తంతో 'తాదాత్మ్యం' ఎక్కువ. ఈ కవుల ప్రకృతి చిత్రణకు 'ఋషులకన్న ప్రకృతి యిచ్చెడి పాఠము గొప్పది' గా భావించే వర్డ్స్‌వర్తు మార్గదర్శకుడు. భావకవులకు ప్రకృతి 'కవితావిష్కృతి' కి మూల కారణం కావడమే కాక, సుఖ స్థితిలోను ఉత్కటమైన దుఃఖస్థితిలోను ప్రాణ స్నేహితుడుగా, కన్నతల్లిగా ఆదు కొన్నది. ప్రాచీన సాహిత్యంలో అరుదుగా కనిపించే 'పల్లీజన ప్రకృతి చిత్రణం' ఈ కవిత్వంలో విశేషంగా ఆదరింపబడింది.

కృష్ణశాస్త్రి సాహిత్యంలో ప్రకృతి సాన్నిహిత్యం విశేషంగా కనిపిస్తుంది. కృష్ణపక్షం, పల్లకీ, మేఘమాలాకృతులలో సందర్భాను గుణంగా మనోహరమైన ప్రకృతి చిత్రణ కనిపిస్తుంది. గేయనాటికలలో కొన్నింటిలో పల్లీజన ప్రకృతిచిత్రణ అధికంగా జరిగింది. అంతేకాక ప్రత్యేకంగా 'ఋతుచక్రం' అనే నాటిక వ్రాయబడి ఉండడం గమనింప దగ్గది.

## 2. ప్రణయ కవిత్వం

ప్రణయ కవిత్వం 'అమలిన శృంగారం' తో కూడింది. దీనిలో 'సభ్యతాపరిధి' కి మకుటాయమానమైన సంయోగ శృంగారం పరిమితం

గాను, 'విషాదమాధురి' వెల్లివిరిసే వియోగశృంగారం అధికం గాను కనిపిస్తుంది. స్త్రీ పై ప్రబంధాలలోని 'కామైకదృష్టి' కి బదులు 'పూజ్యదృష్టి', అంగాంగ వర్ణనలకు బదులు 'అంతరంగ వర్ణన' నెల కొన్నాయి. గురజాడ రాయప్రోలు కవులే 'స్త్రీసమారాధన' తత్వానికి మూలపురుషులు. అందులోను స్త్రీకి 'దేవీపీఠం' సమర్పించి, అమలిన శృంగార సిద్ధాంతాన్ని ప్రతిపాదించింది రాయప్రోలు. ఈ దృక్పథం వికసించడానికి ఆంగ్లకవులు, రవీంద్రుడు, సంఘ సంస్కరణోద్యమం-ప్రస రించిన ప్రభావాలే కారణం.

ఈ ప్రణయ కావ్యాలలో భావకవులు ఆంగ్ల కాల్పనిక కవుల ననుసరించి 'తమ ప్రేయసీ మూర్తులను కావ్యనాయికలుగా చేసికొనుటలో గొప్పనవ్యత చూపినారు.''[9] ఆ ప్రేయసులు లౌకిక ప్రేయసులు, ఊహా ప్రేయసులు - అని రెండువిధాలు. ఈవిభజన వాస్తవికతకూ, కాల్పని కతకూ ఉండే ప్రాధాన్యం మీదనే ఆధారపడింది. కావ్య జగత్తులో ఎంతోకొంత కల్పనరంగు లేని వాస్తవంకాని, వాస్తవం పునాదిగాలేని కల్పనకాని ఉండదని గమనించాలి. లౌకిక ప్రేయసులకు తల్లావఝ్ఝల హృదయేశ్వరి, నాయని వత్సల. ఊహాప్రేయసులకు కృష్ణశాస్త్రి ఊర్వశి, బాపిరాజు శశికళ ఉదాహరణలు[10]. ఊర్వశి, శశికళ 'లౌకిక వాసనల కతీతమైన ఊహాసృష్టులు' గా నిర్ణయం జరిగింది. ఇక ఊహా ప్రేయసి కల్పనకు మూలమేది? అనే విషయాన్ని పరిశీలించడం అవసరం.

ఊహాప్రేయసి తత్వం:

ఊహా ప్రేయసిని గురించి విమర్శకులలో ఈ క్రింది అభిప్రాయా లున్నాయి.

1. 'ప్రకృతినో, కవితాకళనో మనస్సులో పెట్టుకొని, దానిని ప్రేయసిగా కల్పించుకొని, ఊహాసుందరిగా, దివ్యసుందరిగా, కులపాలి

కగా, ఇంకా ఏదో విచిత్ర ప్రణయమూర్తిగా భావించి పాఠకుల బులి పించేటట్లు' భావకవులు కావ్యాలు వ్రాశారు.[11]

2. అప్రాప్తంగా ఉండిన స్వాతంత్ర్య దేవతయే ఊహాప్రేయసి సృష్టికి మూలం. "ఇనుపగుప్పిట పరిపాలనలో సుకుమార కవి విహంగ ములు కలకలారావములు చేయుటకు గూడ వెరచెను. వారు తమ హృదయశోకమును అన్యాపదేశముగ మాత్రమే వెళ్ళబోసికొనవలసిన వారైరి. స్వాతంత్ర్యదేవతను ప్రియురాలిగ భావనచేసి యామె సాన్నిధ్యమునకై పరిదేవించుట దేవులపల్లి కృష్ణశాస్త్రి, తల్లావఝ్ఝల శివశంకరశాస్త్రి, వేదుల సత్యనారాయణశాస్త్రి వంటివారి రచనలలో భాసించును. ప్రియతమ వస్తువు అలబ్ధి నిశ్చయమగుటచే శోకమే సుఖ మను మృదుమానసిక చ్ఛాయకు వీరి రచనలు ప్రతిబింబములు."[12]

3. "ఉర్దూలో సూఫీకవుల అప్రాప్త మనోహారి వర్ణనలూ వగైరాలలో ఉండే కవితాధోరణులకు, తెలుగు కవుల ప్రణయధోరణికి చాల దగ్గరిపోలికలున్నాయి."[13] అంటే ఈ ప్రణయ కవిత్వంలో సూఫీ తత్వం అంతర్భవించిందని భావం. ఈ అంశాన్ని కొంత విపులంగా చర్చించవలసి ఉంది.

సూఫీకవులు ఆరాధించిన 'అప్రాప్త మనోహారి' భగవంతునికి సంకేతం. సూఫీతత్వం పారశీకం. ఉర్దూ, హిందీ, బెంగాలీ మొదలైన సాహిత్యాలలో విస్తరించింది. ముఖ్యంగా రవీంద్రుని ప్రభావంవల్లను, బ్రహ్మర్షి రఘుపతి వెంకటరత్నంనాయుడు మొదలైనవారి ద్వారాను సూఫీతత్వం భావకవులకు సంక్రమించింది. సూఫీతత్వంద్వారా భావ కవులు ఆరాధించిన ఊహాప్రేయసి 'ఆధ్యాత్మిక ప్రేయసి' అని స్పష్ట మవుతుంది. ఊహాప్రేయసులను ఆధ్యాత్మిక జగత్తులో అడుగు పెట్టించిన సూఫీతత్వంలోని ముఖ్యాంశాలను గమనించడం అవసరం.

సూఫీతత్వం:

1. సూఫీలు ప్రాపంచిక విషయాలనుండి తమ మనస్సును మరలించి ఈశ్వరుని సౌందర్యంపై లగ్నంచేస్తారు. పరిమితత్వంనుండి అపరిమితత్వాన్ని అందుకోవడానికి తపిస్తారు. సూఫీమార్గంలో (1) దైవ మహాత్మ్యానికి విస్మయం పొందడం, (2) మంచి-చెడు, కర్తవ్యాకర్తవ్యాలను తెలుసుకోవడం, (3) విశ్వశక్తిలోని వాస్తవాన్ని గ్రహించడం, (4) భగవంతుని సత్యస్వరూపాన్ని అవగాహనం చేసుకోవడం-అనే నాలుగు దశలున్నాయి. వీటికే క్రమంగా శరీయత్, తరీకత్, హాకీకత్, మారిఫత్ - అని పేర్లు.

2. సూఫీల దృష్టిలో ప్రపంచం భగవత్స్వరూపం. భగవంతుడు సౌందర్యమయుడు. ప్రకృతి సౌందర్యస్వరూపం. ఉదయాస్తమయాలు, మేఘాలు, గిరిశిఖరాలు, జలపాతాలు, నదులు, సముద్రాలు, సూర్యచంద్రులు, నక్షత్రాలు, ఆకాశం, పూపొదరిండ్లు, పశుపక్ష్యాదులు - ఇవి అన్నీ సౌందర్య మహాత్మ్యాన్ని వ్యక్తం చేస్తాయి.

3. సూఫీలు వెలుగులోలాగే చీకటిలోను వెలుగునే చూస్తారు. సుందరమైన ప్రకృతిలోలాగే ప్రచండమైన ప్రకృతిలోను భగవత్తేజాన్నీ, ప్రేమస్వరూపాన్నీ దర్శిస్తారు. వారి దృష్టిలో ప్రపంచం ఒక మహాకావ్యం. అందులోని ప్రతిపుటలోను కొంత స్పష్టత, కొంత అస్పష్టత కనిపిస్తుంది. సర్వత్ర వారు 'నిగూఢతత్వాన్ని' చూస్తారు.

4. సూఫీలు ప్రణయారాధకులు. వారి ప్రణయ కావ్యాలు వాచ్యార్థాన్నిబట్టి మనోరంజకాలై, వ్యంజనాశక్తివల్ల సాంకేతికార్థాన్ని ప్రతిపాదిస్తాయి. ప్రతీకాత్మకమైన పరిభాషద్వారా ఆధ్యాత్మిక తత్వం ఆవిష్కరింపబడుతుంది. సూఫీలు మహమ్మదీయులైనా సమన్వయ దృష్టితో తమ కావ్యాలలో హైందవ దేవతలను గౌరవిస్తారు.

5. 'మధురభక్తి' సంప్రదాయంలో పరమాత్మను ప్రియుడుగాను, జీవాత్మను ప్రేయసిగాను పరిగణించగా, సూఫీలు పరమాత్మను ప్రేయసిగాను, జీవాత్మను ప్రియుడుగాను భావించి సాధన చేస్తారు. ఈ రెండు మార్గాలలోని మాధుర్యం రసాత్మకం; 'ఇది కేవలం కల్పితం'[14].

నవ్యాంధ్ర సాహిత్యంలో ప్రవేశించిన సూఫీతత్త్వాన్ని గుర్తించి, "దీనియందు కొంత దివ్యవేదాంత సౌరభము గుబాళించెను. కవి తాను ప్రియుడై విశ్వాత్మరూపిణియైన ప్రియురాలి 'పదముల గుసగుసల'కు చెవియొగ్గి యాలకించుట కృష్ణపక్షము, ఊర్వశి, హృదయేశ్వరి, దీపావళి మున్నగు కావ్యములలో చూడనగును"[15] – అని ఆచార్య ఖండవల్లి లక్ష్మీరంజనం పేర్కొనడం గమనింపదగ్గది.

ఈ పరిశీలనవల్ల ఊహాప్రేయసి కల్పనలో కాల్పనిక కవితావేశమూ, స్వాతంత్ర్యపిపాసతో కూడిన నిగూఢమైన జాతీయభావమూ, సూఫీతత్త్వంలోని ఆధ్యాత్మిక ప్రణయ సౌరభమూ – ఈమూడూ మేళవించాయని వ్యక్తమవుతుంది. అందులోను నిరాశా నిస్పృహలకు ఆలవాలమైన ఆనాటి పరిస్థితుల ప్రాబల్యాన్నిబట్టి దీనిలో పారమార్థిక చింతనతో కూడిన సూఫీతత్త్వమే ప్రబలమయ్యిందని గుర్తించడం సత్య సమ్మతం.

కృష్ణశాస్త్రి సాహిత్యంలో ప్రణయమూ, భక్తీ, సంఘసంస్కరణమూ ప్రాధాన్యం వహించాయి. కృష్ణపక్షం, ప్రవాసం, ఊర్వశి సంపుటాలలో ప్రణయకవిత్వం ప్రాముఖ్యం పొందింది. కృష్ణపక్ష ప్రవాసాలలో లౌకిక ప్రేయసి స్వభావమూ, ఊర్వశిలో ఊహాప్రేయసి స్వభావమూ ప్రాధాన్యం వహించాయి. ప్రవాసంలో 'విషాద మాధురీ', ఊర్వశిలో సూఫీతత్త్వానుగుణమైన ఆధ్యాత్మిక ప్రణయమూ చరమ సీమలుగా రూపొందాయి. మేఘమాలలోను, శ్రవ్య

రూపకాలు కొన్నింటిలోను సభ్యమైన సంయోగ వియోగ శృంగారాలు రెండూ పోషింపబడ్డాయి.

## 3. భక్తి కవిత్వం

భావకవుల భక్తి విశ్వజనీనం. పూర్వ కవులలోని శివకేశవాది భేదం వీరికి లేదు. సమస్తసృష్టి పరమేశ్వరుని చిద్విలాసంగాను, 'తాపత్రయ సంతప్త' మైన లోకానికి సర్వేశ్వరుడే శరణ్యుడుగాను వీరి విశ్వాసం. 'ఆత్మ న్యూనత్వాన్ని' ప్రకటిస్తూ, తమ పాపాలకు పశ్చాత్తాపంతో కన్నీరు కురిపిస్తారు. ఏకేశ్వరోపాసనతోపాటు, సంప్రదాయానుసారంగా రాముడు, కృష్ణుడు, శివుడు - ఇలాంటి నామరూప విశిష్టుడుగాను భగవంతుని ఆరాధిస్తారు. భగవంతుని ప్రియుడుగాను, ఆత్మను ప్రేయసిగాను ఊహించే వైష్ణవ తత్వంలోని 'మధుర భక్తి' వీరిలో ప్రాముఖ్యం వహించింది. ఆధునిక యుగంలో భక్తి కవితావికాసానికి మతోద్యమాలూ, రవీంద్రుని సాహిత్యమూ, ప్రాచీనమైన గీతగోవిందం, పోతన భాగవతం మొదలైన రచనలూ ప్రేరకాలయ్యాయి. ఈకవులలో ఏకేశ్వరతత్వం ప్రబలడానికి బ్రహ్మసమాజంతోపాటు పాశ్చాత్యప్రభావంకూడ కొంతదోహదం చేసిందని చెప్పవచ్చు.

కృష్ణశాస్త్రి సాహిత్యంలో మహతి, కన్నీరు మొదలైన బ్రిహ్మసమాజ గీతాలలో ఏకేశ్వర తత్వమూ, కృష్ణపక్షం పల్లకీ మేఘమాల తిరుప్పావు మొదలైన కృతులలో నామరూప వైవిధ్యంతో కూడిన భగవత్తత్వమూ కనిపిస్తుంది. మొత్తంమీద 'మధురభక్తి' సంప్రదాయమే ఈ కవిలో ప్రస్ఫుటంగా ఉంది.

## 4. స్మృతి కవిత్వం

మృతులైన అభిమాన పాత్రులను 'తాత్విక దృక్పథం' తో స్మరించే ఈ కవిత్వం పాశ్చాత్యుల 'స్మృతిగీతం' (Elegy) ఒరవడిగా

వెలసించి. ఈశాఖలో రాయప్రోలువారి గోపాలకృష్ణగోఖలే స్మృతి మొదటిది. ప్రాచీన సాహిత్యంలోని స్మృతి కవిత్వానికీ దీనికీ స్పష్టమైన భేదం గుర్తింపబడింది. ఈ కవిత్వం దేశనాయకస్మృతి, సతీస్మృతి, సుతస్మృతి, ఆప్తస్మృతి - అని నాలుగు వర్గాలుగా విభజింపబడింది; "కేవలము ప్రేయసీ నిర్యాణముపట్ల వ్రాసినది ప్రణయ కవిత్వంలోని 'విషాద' విభాగమున చేరును"[16] - అని నిర్ణయింపబడింది.

కృష్ణశాస్త్రి కృష్ణపక్షంలోని 'మహాకవి' గురజాడస్మృతీ, తండ్రీ పెదతండ్రుల స్మృతీ. పల్లకీలోని 'ఏమి మిగిలె' అనే గాంధీ స్మృతి ఈ శాఖలో చేరుతాయి. పత్నీవియోగాన్ని పురస్కరించుకొని వ్రాయబడిన కృష్ణపక్షంలోని కొంతభాగమూ, ప్రవాసమూ, పల్లకీలోని ఒకటి రెండు ఖండికలూ ప్రణయకవితా భాగాలుగానే పరిగణింప బడ్డాయి. అందుకు మృతిపొందిన పత్నిని ప్రేయసిగానే కవి సంభావించడం ఒక కారణం.

## 5. సంఘ సంస్కరణ కవిత్వం:

సంఘ సంస్కరణ కవిత్వం వికసించడానికి మానవోద్యమం ముఖ్యకారణం. మానవోద్యమం మూఢాచారాలను ఖండిస్తూ, కుల మత భేదాలను నిరసిస్తూ, సర్వమానవ సౌభ్రాత్రాన్ని చాటింది. దానితో గాంధీజి 'విశ్వమానవ కల్యాణ సందేశం' చేయికలిపింది. వేమన, వీరబ్రహ్మం మొదలైన పూర్వుల ప్రబోధాలు కూడ ఈ కవితా వికాసానికి సాయపడ్డాయి. నవ్యాంధ్ర సాహిత్యంలో సంఘ సంస్కరణ కవిత్వం గురజాడలోనే పల్లవించింది.

'బ్రహ్మసమాజ కవిచక్రవర్తి'గా కృష్ణశాస్త్రి వ్రాసిన మహాతి, కన్నీరు, ఋగ్వీథి మొదలైన కృతులలో సంఘ సంస్కరణ దృక్పథం

మహోన్నతస్థాయి నందుకొన్నది. ఇది పల్లకీ సంపుటిలోను, శ్రవ్యనాటి కలలోను ప్రస్ఫుటంగా కనిపిస్తుంది.

## 6. దేశభక్తి కవిత్వం

నవ్యాంధ్ర సాహిత్యంలో దేశభక్తి కవిత్వం ఒక వినూత్న శాఖ. దీనిలో ముక్తకాలు మొదలుకొని మహాకావ్యాల వరకూ వచ్చాయి. ఇందులో అఖండ భారతాభిమానంతో వ్రాసిన కవిత్వం ఒక శాఖగానూ, ఆంధ్రాభిమానంతో వ్రాసిన కవిత్వం ఇంకొక శాఖగాను విస్తరించింది.

భారతీయ సాహిత్యాలలో ఈ దేశభక్తి కవిత్వం మొలకెత్త డానికి 1857 లో జరిగిన ప్రథమ భారత స్వాతంత్ర్య సంగ్రామమే బీజావాపం. ఆ యుద్ధవీరుల గాథలు జానపదులలో 'కథలు'గా, 'పదా లు'గా ఊపిరి పోసుకొన్నాయి. జాతీయోద్యమ ప్రాతస్సంధ్యలో పలు ప్రాంతాలలో దేశభక్తులు గావించిన పోరాటాలూ, బలిదానాలూ గ్రామసీమలలో 'వీరగాథలు'గా మారుమ్రోగాయి. వాటికి జాతీయ నాయకుల ప్రబోధాలూ, త్యాగాలూ దీప్తి కలిగించాయి. క్రమంగా జానపదుల ఒడిలోని ఈ దేశభక్తి కవిత్వాన్ని 'నగరకవులు' నెత్తికెత్తు కొన్నారు. తెలుగులో దేశభక్తి కవితా శాఖలకు రెంటికీ రాయప్రోలు వారే మూలపురుషులు. గురజాడ 'దేశభక్తి' విశ్వమానవప్రేమతో నిండింది. దేశభక్తి ప్రచారంలో గరిమెళ్ళ సత్యనారాయణ గీతాలకు విశిష్ట స్థానముంది.

కృష్ణశాస్త్రి వ్రాసిన దేశభక్తి కవిత్వం రాశిలో తక్కువే; వాసిలో తక్కువ కాదు. ఆతని ఆకలి, కార్తికి కృతులు 'జాతీయభావ ప్రేరితాలు'గానే వెలశాయి. మహతిలోని రెండు మూడు దేశభక్తి గీతాలు జాతీయస్థాయికి చెందినవిగా పరిగణింపబడ్డాయి. పల్లకిలోని

'ఆగష్టు 15', 'విజయవాడ గగనవాణి' మొదలైనవీ, 'శాంతకోవెల' మొదలైన రూపకాలూ కృష్ణశాస్త్రి దేశాభిమానానికీ, ఆంధ్రాభిమానానికీ నిదర్శనాలు'.

## 7. స్తుతి కవిత్వం

కవితారచననాటికి మృతులైన అభిమానపాత్రులను స్మరిస్తూ వ్రాసిన దానిని స్మృతి కవిత్వంగా పరిగణించినట్లే, సజీవులైన అభిమాన పాత్రులను ఆర్ద్రభావాలతో స్తుతిస్తూ వ్రాసిన దానిని 'స్తుతికవిత్వం'గా వర్గీకరించడం సమంజసం. దైవస్తుతి దీనిలో చేరదు; భక్తి కవిత్వంలోనే చేరుతుంది. ఈ కవితారీతి పూర్వమున్నదే. దానికీ దీనికీ స్పష్టమైన భేదాన్ని గుర్తించవచ్చు. ఆధునికమైన స్తుతి కవిత్వానికి రాయప్రోలువారి 'ఆంధ్రావళి' ఆదికావ్యం.

కృష్ణశాస్త్రి పల్లకీ సంపుటిలో బ్రహ్మర్షిని గురించి వ్రాసిన 'గురుదేవుడు' అనే ఖండిక, రవీంద్రుని గురించి వ్రాసిన 'చరణ సన్నిధిని' అనే ఖండిక – ఇవి రెండూ ఉత్తమ స్తుతి గీతాలు.

## 8. అభ్యుదయ భావకవిత్వం

"అభ్యుదయ కవిత్వానికి మార్క్సిస్టు సిద్ధాంతాలు ఆత్మ; సమసమాజ నిర్మాణం ధ్యేయం."[17] సాధారణంగా అభ్యుదయ వాదులు భావకవిత్వాన్ని మెచ్చుకోరు; ముఖ్యంగా ప్రణయ కవిత్వాన్ని నిరసిస్తారు. భావకవులలో మార్క్సిస్టు సిద్ధాంతాలకు అంకితం కాకుండ, 'సమసమాజనిర్మాణం ధ్యేయం'గా కవిత్వం వ్రాసినవారు కూడ ఉన్నారు. అలాంటివారి ఆ రచనలకు అభ్యుదయ కవిత్వంగా గుర్తింపు రావడం అరుదు. అందువల్ల భావకవుల అభ్యుదయ కవిత్వాన్ని 'అభ్యుదయ భావకవిత్వం'గా పరిగణించడం అసమంజసం కాదు.

ఇక ఆధునికయుగంలో వచన వాఙ్మయంలోను రూపకవాఙ్మయంలోను సరిక్రొత్తగా బయలుదేరిన శాఖలనూ, అందులోచేరే కృష్ణశాస్త్రి రచనలనూ ప్రస్తావించవలసి ఉంది.

## నవీన వచన – రూపక శాఖలు

పందొమ్మిదవ శతాబ్దం చివరిభాగంలోనే ఆధునిక వచన, రూపక సాహిత్యాల వికాసం మొదలయ్యింది. వచనవాఙ్మయంలో నవల, దేశ చరిత్ర, జీవితచరిత్ర, శాస్త్ర గ్రంథరచన, విమర్శ. వ్యాసం మొదలైనవీ, రూపకవాఙ్మయంలో అనువాద కృతులూ, స్వతంత్రకృతులూ, వాటిలోని వివిధరీతులూ తామర తంపరగా ముందంజ వేశాయి. వీరేశలింగం, చిలకమర్తి లక్ష్మీనరసింహం, పానుగంటి లక్ష్మీనరసింహారావు, వేదం వేంకటరాయశాస్త్రి, గురజాడ, కట్టమంచి రామలింగారెడ్డి మొదలైన వారు పై శాఖలకు పరిపుష్టి చేకూర్చారు. ఆశాఖలలో క్రమంగా గణనీయమైన నవ్యత ప్రవేశించింది. అందులో శిష్టవ్యావహారికం చోటు చేసుకొని దినదినాభివృద్ధి పొందడం గమనింపదగ్గ ఒక ముఖ్యాంశం. ఈ విషయంలో గిడుగు రామమూర్తి, గురజాడ కృష్ణాఙ్నులై నిర్వహించిన పాత్ర చిరస్మరణీయం.

వచన వాఙ్మయంలో అతినవ్యంగా కథానిక, ఏకాంకిక బయలు దేరాయి. ఇవి క్రమంగా నవలకు, నాటకానికి కాలానుగుణమైన సంగ్రహరూపాలుగా చెప్పవచ్చు. ఈకాలంలో వ్యాసరచన విశేషమైన ప్రాచుర్యాన్ని పొందింది. ఆకాశవాణి వచ్చిన తరువాత శ్రవ్యనాటిక ఆవిర్భవించి రూపక వాఙ్మయంలో వినూత్నమైన అధ్యాయాన్ని ఆవిష్కరించింది. దీనిలో వచన నాటికలూ, సంగీత నాటికలూ వచ్చాయి. ఇదివరకే సంగీత రూపకంలోని కవితాస్వభావం కొద్దిగా సూచింపబడింది. పత్రికలు, ఆకాశవాణి పై ప్రక్రియలకు పట్టుగొమ్మలయ్యాయి. ఇవి

విస్తృతిలో చిన్నవైనా వీటిలోని ఉత్తమ రచనలు అనల్పమైన విజ్ఞాన వినోదాలను అందిస్తున్నాయి.

కృష్ణశాస్త్రి అనేకవ్యాసాలనూ, శ్రవ్యరూపకాలనూ వ్రాశారు. అవి చాలవరకు ఆకాశవాణి ప్రసారాలకు ఉద్దేశింపబడ్డవే. ఆ వ్యాసాలను సారస్వత వ్యాసాలు, వివేచనాత్మక వ్యాసాలు, భావనాత్మక వ్యాసాలు, సాంఘిక వ్యాసాలు - అని నాలుగు ప్రధాన వర్గాలుగా విభజించవచ్చు. అందులో 'రిక్షావాలా', 'అవ్వ బస్సు ప్రయాణం' మొదలైన వ్యాసాలలో కథాశిల్పమూ, నాటకీయ శిల్పమూ కొంత వరకు చోటుచేసుకోవడం విశేషం. ఇక శ్రవ్యరూపకాలలో ఒకటి రెండు మాత్రమే వచనరూపకాలు; తక్కినవన్నీ సంగీతరూపకాలే. అందులో ఆకాశవాణి ప్రసారానికీ, ప్రదర్శనకూ రెంటికీ అనుగుణంగా యక్షగానాలు వ్రాయబడి ఉండడం ఒక వైశిష్ట్యం. కృష్ణశాస్త్రి రూపకాలు కల్పనారామణీయంతో కూడినవి. అవి సాంఘిక రూపకాలు, పౌరాణిక రూపకాలు - అని రెండు ప్రధాన వర్గాలుగా విభజింపదగి ఉన్నాయి. పౌరాణికాలలో భక్తి రసాత్మకాలు అధికం.

'శ్రీ ఆండాళ్ళు కల్యాణం', 'ధనుర్దాసు' 'సాయుజ్యం' మొదలైన రూపకాలలోను 'గుహుడు', 'శ్రీ కృష్ణావతార తత్త్వం' మొదలైన వ్యాసాలలోను హృదయంగమమైన భక్తి చిత్రణం కనిపిస్తుంది. 'గౌతమి', 'ఏడాదిపొడుగునా' మొదలైన రూపకాలలోను, 'కోవెల-కొలను', 'మా ఊళ్ళో వీధిఅరుగు' మొదలైన వ్యాసాలలోని తెలుగు దేశంలోని పల్లీజన ప్రకృతిలో వెల్లివిరిసే చల్లదనమూ, తీయదనమూ తీర్చిదిద్దబడ్డాయి. 'వేణుకుంజం', 'మైలురాయి' మొదలైన రూపకాలలోను, 'రిక్షావాలా', 'బూట్ పాలిష్' మొదలైన వ్యాసాలలోను సంఘ సంస్కరణ ప్రబోధం ప్రస్ఫుటంగా ధ్వని

స్తుంది. ఇలాంటి రచనలలో 'సంఘముయొక్క చెంపను చెళ్ళుమనిపించి, వీపును చరిచే వ్యంగ్యం' కూడ చోటుచేసుకోవడం మరొక విశేషం. వియోగప్రణయచిత్రణంలో విఖ్యాతి పొందిన కృష్ణశాస్త్రి కలం 'శర్మిష్ఠ', 'మాళవికాగ్నిమిత్రం' మొదలైన రూపకాలలో సంయోగ ప్రణయ చిత్రణంలోని ప్రాశస్త్యాన్ని ప్రదర్శించడం గమనింప దగ్గది.

## కృష్ణశాస్త్రి సాహిత్య సంస్కారం:

కుటుంబ వాతావరణాన్నిబట్టి చిన్నతనంలోనే కృష్ణశాస్త్రి హృదయం సంస్కృతాంధ్రసాహిత్య సంస్కారంతో సారభూత మయ్యింది. అటుతరువాత నవ్యాంధ్ర సాహిత్యంలో నాయకులైన కందుకూరి, గురజాడ, రాయప్రోలుకవుల ఆదర్శాలు అతనిని ఆకర్షించాయి. కృష్ణశాస్త్రి సంఘ సంస్కరణ దృష్టిపై కందుకూరి గురజాడల ప్రభావం ప్రస్ఫుటంగా ఉంది. ప్రణయకవితారచనలో తక్కిన భావకవులపై నున్నట్లే కృష్ణశాస్త్రిపై రాయప్రోలు ప్రభావం స్పష్ట మవుతుంది.

బ్రహ్మర్షి సన్నిధిలో వికసించిన ఆంగ్ల సాహిత్యాభిరుచివల్ల ప్రధానంగా వర్డ్స్‌వర్తు, షెల్లీ, కీట్సుకవుల సాహిత్యం కృష్ణశాస్త్రికి అభిమానపాత్ర మయ్యింది. మానవోద్యమ ప్రభావంవల్ల రవీంద్రుని సాహిత్యం సన్నిహితమయ్యింది. ఈ కవుల సాహిత్య విశేషాలనూ, కృష్ణశాస్త్రిపై వాటి ప్రభావాన్నీ కొంత పరిశీలించడం అవసరం.

### ఆంగ్ల కవిత్రయ ప్రభావం:

1. ఫ్రెంచి విప్లవానంతరం (1789) పాశ్చాత్యులలో తల ఎత్తిన కాల్పనికోద్యమంలో (Romantic revival) వర్డ్స్‌వర్తు ప్రకృతి సాహచర్యంలో అమరమైన 'సత్య పరిజ్ఞానం' సమకూరుతుందని

విశ్వసించాడు. సామాన్యప్రజల జీవితంనుండి కవితావస్తువులను స్వీక రించి, 'శక్తిమంతమైన భావనల సహజప్రకాశనమే' కవితాలక్ష్యంగా, విప్లవాత్మకంగా స్వాభావికతపై దృష్టి మరల్చి 'ఉత్తమకవి'గా పేరు పొందాడు. కాని అతని దృష్టి పాక్షిక మయ్యింది.

2. షెల్లీకూడ సంప్రదాయాన్ని నిరసిస్తూ అమరమైన ప్రేమ వాహినియే జీవితాన్ని పునీతం చేస్తుందనీ, 'ప్రేమయే జీవిత పరమార్థ' మనీ నమ్మి, 'సార్వజనీన' మైన 'నిగూఢభావ ప్రకర్ష' వల్ల 'ఉత్త మోత్తమకవి'గా ప్రసిద్ధిపొందాడు. అతని భావనాజగత్తులో 'స్వాప్నిక జగత్తు' లో లాగే 'అతిలోక మనోహర' మైన 'ఛాయాస్వరూపాలు' తప్ప 'సహజాకృతులు' కానకావు. అతని ప్రతిపద్యమూ సహజమైన 'సంగీత గతుల' తో ఒక పాటలాగా వీనులలో కరగిపోతుంది. మానవ సహజమైన స్వేచ్ఛాప్రణయాలకు అజరామరమైన వాక్కు ప్రసాదించిన అద్వితీయమైన కవి షెల్లీ.

3. కీట్సు 'ప్రేమయే త్రికాలాబాధితమైన సత్యం' గాను, లోక మంతా శృంగారమయంగాను దర్శించి 'సౌందర్యమే సత్యం - సత్యమే సౌందర్యం' అని భావిస్తూ, సృష్టిలోని అణువణువునా సౌందర్యాన్ని దర్శించే 'అతిలోకమైన భావుకత' తో 'మధురరసస్యంది' మైన పదాలతో కవిత్వం చెప్పాడు. అంతటి మాధుర్యాన్నీ, లాలిత్యాన్నీ, మరి ఏ కవీ సాధించలేదు. ప్రతి పదంలోను ఒక సుందరమైన చిత్రాన్ని చూపి, పాఠకుని 'మంత్రముగ్ధుని' చేసే 'శిల్పకళాప్రజ్ఞ' అతని సొమ్ము. 'రొమాంటిక్ తత్వం' సంపూర్ణంగా ఉండే కవి కీట్సు ఒక్కడే.[19].

కృష్ణశాస్త్రిలో పై ముగ్గురి కవుల తత్వాలూ మేళవించాయి. వర్డ్స్‌వర్తులోని ప్రకృతితాదాత్మ్యం, శక్తిమంతమైన భావనలు, షెల్లీలోని అమరమైన ప్రణయారాధనం, అతిలోక సౌందర్య దర్శనం.

విశిష్టమైన ఛందోగమనం, సంగీతగతులతో కూడినవాక్కు; కీట్సులోని అణువణువునా సౌందర్యాన్ని దర్శించే స్వభావం, అతిలోకమైన భావుకత, మధురరసస్యందియైన పదప్రయోగం, శిల్పకళాప్రజ్ఞ - ప్రతిఫలించాయి. అంతేకాక ఈ కవిలో సామాన్య మానవ చిత్రణం, సంఘసంస్కరణాత్మక దృష్టి మొదలైనవి విశేషంగా నెలకొని ఉండడం విశేషం.

కృష్ణశాస్త్రికి పై కవులతో ఉండే పోలికలను పురస్కరించుకొని "కీట్సు, షెల్లీ, వర్డ్స్‌వర్తు కవుల కాల్పనికోద్యమ ప్రభావం గాఢంగా ప్రతిఫలించి ప్రతిభతో స్వంతం చేసుకొన్నవారు కృష్ణశాస్త్రి ఒక్కరే... మిగిలిన భావకవుల మాటేమిటంటే ఒక్కొక్కరికి ఒక్కొక్క ఆంగ్లకవి ఆరాధ్యుడు కావచ్చు. పై ముగ్గురు కవుల కవితా త్రివేణీ సంగమం కృష్ణ శాస్త్రి గారే"[20] - అనే పండితాభిప్రాయంలో అతిశయోక్తి లేదు. ఇక్కడ కృష్ణశాస్త్రికిగల 'ఆంధ్రషెల్లీ' బిరుదంలోని ఔచిత్యం స్మరింప దగ్గది.

## రవీంద్రుని ప్రభావం

రవీంద్రుడు సార్వకాలికమైన సాహిత్యాన్ని సృష్టించిన వారిలో ఒకడు. ప్రాశ్చాత్య సాహిత్యాన్ని మథించి సమన్వయించు కొన్న మనీషి. అతడు వేయికిపైగా ఖండకావ్యాలను, రెండు వేలకు పైగా గేయాలను, అనేక విషయాలపై వ్యాసాలు, నాటకాలు, కథలు, నవలలు వ్రాశాడు. అతడు ప్రపంచంలోని అత్యుత్తములైన గేయకవులలో ఒకడు. 'సంవేదన', 'భావచిత్రం', 'సంగీతం', 'ప్రకృతి మానవుల అనన్యత్వం' - అతని రచనలలో ప్రధానాంశాలు. అతని హృదయంలో ధ్వనించని భావం మానవుల హృదయాలలో లేదని చెప్పవచ్చు. అతని 'ప్రకృతిప్రేమ', 'మానవప్రేమ' క్రమంగా 'భగవ త్ప్రేమ' లో సంగమించాయి. అతని తొలి కావ్యాలలో సంస్కృత

శబ్ద బాహుళ్యం, అలంకార ప్రయోగం కనిపిస్తాయి; తరువాతి కావ్యాలలో సరళత విశిష్ట లక్షణం. అతనిలో కొన్నిచోట్ల సాంఘిక దురాచారాలపట్ల 'తీవ్రమైన అవహేళనం' కనిపిస్తుంది. బహుముఖమైన భారతీయుల జీవితంలోని విభిన్నమైన దృక్పథాలను అతడు ప్రతిబింబింపజేశాడు. 'వైష్ణవ గేయ కవితను', 'సూఫీల తత్త్వానుభూతులను' సమగ్రంగా సమన్వయించాడు.[21].

రవీంద్రునిలోని ప్రాక్పాశ్చాత్యసాహిత్యాల సమన్వయం, ఉత్తమ ఖండకావ్య గేయకావ్యరచన, సంవేదన భావచిత్రాదులు, ప్రకృతిప్రేమ, మానవప్రేమ, భగవత్ప్రేమ, తొలి కావ్యాలలో సంస్కృత శబ్దబాహుళ్యం, తరువాతి రచనలలో సారళ్యం, వైష్ణవ సూఫీ తత్త్వానుభూతులు మొదలైనవి కృష్ణశాస్త్రిలోను ఉన్నాయి. సాంఘిక దోషాలపై 'తీవ్రమైన అవహేళనం' ఇతనిలో లేకపోవడం, వ్యావహారిక భాషనుసైతం వాడిఉండడం విశేషం. 'ఆంధ్ర రవీంద్రుడు'గా ప్రసిద్ధుడైన కృష్ణశాస్త్రిపై ఆంగ్లకవుల ప్రభావంకంటె రవీంద్రుని ప్రభావమే విశేషంగా ప్రసరించింది. అది ఇంచుమించుగా ఇతని రచన లన్నింటిలోను స్పష్టమవుతుంది.

కృష్ణశాస్త్రి సాహిత్యాన్ని సమగ్రంగా పరిశీలించడంలో పై కవుల రచనలలోని స్పష్టమైన సాదృశ్యాలను ఆయా సందర్భాలలో సమన్వయించడం సముచితంగా ఉంటుంది. ఇక ఈ ప్రకరణంలో కృష్ణశాస్త్రి కృతులను పేర్కొనవలసి ఉంది.

## కృష్ణశాస్త్రి కృతులు:

1. పద్యకృతులు: కృష్ణపక్షము, ప్రవాసము, ఊర్వశి, పల్లకీ, ఋక్కులు, ఆకలి, కార్తికి, బదరిక. ('పల్లకీ'లో ఋక్కులు, బదరిక, కార్తికి కృతులలోని కొన్నిభాగాలు చేరాయి)

2. గేయకృతులు: మహతి, మేఘమాల, తిరుప్పావు, కన్నీరు, నిశ్రేణి, గీతావళి మొదలైనవి. (ఇంకా ముద్రణ పొందవలసిన గేయాలు ఎన్నో ఉన్నాయి.)

3. శ్రవ్యనాటికలు: 'ధనుర్దాసు', 'శర్మిష్ఠ,' సంపుటాలలోని నాటికలు, 'శ్రీ ఆండాళ్ళు కల్యాణము' - ఇవి సంగీత నాటికలు. 'బహుకాల దర్శనం', 'మైలురాయి'-ఇవి వచననాటికలు. ఇవేకాక 'ప్రసన్న పారిజాతము', 'మదనసాయకము', 'విద్యావతి' 'కొత్తకోవెల', 'రాజఘట్టము', 'మహామేళనము', 'అతిథిశాల', అరుణరథము' 'ఋతుచక్రము' - మొదలైనవి అముద్రితాలుగా ఉన్నాయి.

4 యక్షగానాలు: 'క్షీరసాగర మథనము', విప్రనారాయణ', 'మాళవికాగ్నిమిత్రము' - మొదలైనవి ముద్రణ పొందవలసి ఉన్నవి.

5. వచన రచనలు:- ప్రచురితమైన 'పుష్పలావికలు', 'బహుకాల దర్శనం', 'అప్పుడు పుట్టిఉంటే' - అనే సంపుటాలలోని వ్యాసాలే కాక, 'ఊర్వశి', 'శ్రీనాథుని కవిత', 'తిక్కన ప్రతిభ', 'వేమన', 'ప్రాక్పశ్చిమ సమ్మేళనము', 'సాహిత్యంలో బ్లేక్, ఎడ్గర్ అలెన్ పో, హౌస్‌మన్', 'రవీంద్రస్మృతి', 'రవీంద్రుని ఉపనిషద్వాణి' 'అమూల్యాభిప్రాయము', 'రావిచెట్లు'- మొదలైన వ్యాసాలు వెలుగు చూడవలసి ఉన్నాయి.

ఇక తరువాతి ప్రకరణాలలో ఉపలభ్యమానంగా ఉండే కృష్ణశాస్త్రి కృతులనూ, అతని సాహిత్య తత్త్వాన్నీ సమాలోచన చేయడం జరిగింది. అందులో కవిభావ ప్రవాహాన్నీ, విషయ విశ్లేషణ సౌకర్యాన్నీ దృష్టిలో పెట్టుకొని ఆయా అంశాలను పునర్వ్యవస్థీకరణ చేసుకోవడం అవసర మయ్యింది.

— ❖ —

# పద్యకృతుల ప్రాభవం

" అపారే కావ్యసంసారే కవిరేవ ప్రజాపతిః
యథాస్మై రోచతే విశ్వం తథేదం పరివర్తతే
శృంగారీ చేత్కవిః కావ్యేజాతం రసమయం జగత్
స ఏవ వీతరాగశ్చేత్ నీరసం సర్వమేవ తత్ "

## కృష్ణపక్ష ప్రకాశం

కృష్ణశాస్త్రి తొలికృతి కృష్ణపక్షం. సాధారణంగా తొలి కావ్యం ద్వారానే కవికి కీర్తి రావడం అరుదు. కాని నవ్యాంధ్ర సాహిత్యంతో ఏమాత్రం పరిచయం కలవారికైనా కృష్ణపక్షం కృష్ణశాస్త్రికి మారుపేరుగా స్మృతిపథంలో మెదలుతుంది. దీనినిబట్టి ఈ కావ్యం లోకాన్ని ఎంతగా ఆకర్షించిందో వ్యక్తమవుతుంది.

కృష్ణపక్షం, ప్రవాసం, ఊర్వశి - ఆత్మపరమైన ఈమూడు ఖండ కావ్యాలూ పరిపక్వమైన కృష్ణశాస్త్రిలోని కాల్పనికకవితా సౌరభాన్ని గుబాళిస్తాయి. అందువల్ల వీటిని రసజ్ఞులు ఒకే కావ్యంలోని అంతర్భాగాలుగా పరిగణించడానికి అవకాశముంది.

కృష్ణపక్షంలో కరుణరసాత్మకమైన భావగీతాలు ప్రాధాన్యం వహించాయి. దీనినిబట్టి ఈకావ్యనామౌచిత్యం స్పష్టమవుతుంది. కవితాస్వభావాన్ని పురస్కరించుకొని ఇందులోని గీతాలను నాలుగు వర్గాలుగా విభజించవచ్చు. 1. ప్రకృతి కవిత్వం 2. ప్రణయకవిత్వం 3. భక్తి కవిత్వం 4. స్మృతి కవిత్వం.

ఈ వర్గీకరణంలో ఒక చిక్కుంది. అదేమంటే పై కవితారీతులు సంకీర్ణంగా ఉండే సందర్భాలుకూడ ఉన్నాయి. అందులో ముఖ్యంగా

ప్రకృతి చిత్రణం తరచు ప్రత్యేకించడానికి వీలులేనంతగా ఈ కవి సాహిత్యంలో పడుగుపేకలుగ సర్వత్ర అల్లుకొని ఉంటుంది. ఇక్కడ కవి స్వేచ్ఛాప్రవృత్తి కేంద్రబిందువుగా ఉండే ప్రకృతికవిత్వాన్ని మాత్రం పృథక్కరించడం జరిగింది. ఆయా భావాల ప్రాధాన్యం మీదనే ఈ పరిశీలనలోని వర్గీకరణం ఆధారపడిందని గమనించాలి.

## 1

అద్వైతం

> " The artist is the Lover of nature,
> therefore he is her slave and master "[1]

అని ఆధునిక కవికులగురువైన రవీంద్రుని ప్రవచనం. ఇది భావకవులపట్ల మిక్కిలి అన్వర్థం. నవ్య 'పికకుమారకుడై'న కృష్ణశాస్త్రి ప్రకృతి ఉత్సంగంలోనే పరవశించి కలకూజితాన్ని ప్రారంభించాడు.

> " ఆకులో నాకునై పూవులోఁబూవునై,
> కొమ్మలోఁగొమ్మనై నునులేత రెమ్మనై,
> ఈ యడవి దాగిపోనా - ఎటులైన,
> నిచటనే యాగిపోనా? ......... "

ఇది కృష్ణపక్షానికి నాందీగీతం. ఇందులో కవి 'చిఱుగాలికెరటం' గా, 'సెలపాట తేటు' గా, 'విరిచేడె చిన్నారి సిగ్గు' గా, 'జలదంపు నీలంపు సిగ్గు' గా మారిపోవాలని అభిలషించాడు. ఈ గీతానికీ —

> " Away away from men and towns
> To the wild wood and the downs —
> To the silent wilderness
> Where the soul need not repress
> Its music lest it should not find
> An echo in another's mind "[2]

అనే షెల్లీ చరణాలకూ గల భావసామ్యం గమనింప దగ్గది.

ప్రకృతి సహవాసంవల్ల కలిగే ప్రయోజనాన్ని గురించి కృష్ణశాస్త్రి - "ఆఁకలా దాహామా చింతలా వంతలా, ఈ కరణి వెఱ్ఱినై యేకతమ తిరుగాడ" అని పేర్కొన్నాడు. ఈ సందర్భంలో -

" Fade far away, dissolve, and quite forget
What thou among the leaves hast never known
The weariness, the fever, and the fret
Here where men sit and hear each other grown"[3]

అనే కీట్సు చరణాలు స్మరింపదగి ఉన్నాయి.

'ఉదయలక్ష్మి'కి 'గీతి కాప్రసవం'తో ఈ "కవి కుమారుడు" స్వాగత మిచ్చాడు. శ్యామలాంబరంలో 'తారకా విలాసినులను' దర్శించి, హృదయంలో 'భావనక్షత్ర కాంతుల' కోసం ప్రతీక్షించాడు. నింగిలో నిండుజాబిల్లి విహరించడమూ, తెమ్మెరలూ పద్మాలూ నిద్రించడమూ, పరమేశ్వరుని కరారవిందాలలో విశ్వం "విశ్రాంతి" తీసుకోవడమూ దర్శించాడు.

ప్రతిఫలాపేక్ష లేని త్యాగమే "లోకము" లో ప్రకృతి ధర్మంగా గుర్తించాడు. సంధ్యాప్రకృతినిచూచి అతడు (పరమ పురుషుడు) కూడ 'వింతగీతి' పాడడాన్ని, "అతని పాట" తనలో అపూర్వమైన భావాలను అంకురింపజేయడాన్ని పేర్కొన్నాడు.

స్వేచ్ఛాప్రీతి

"Free me as free are the birds of wilds,
the wanderers of unseen paths"[4]

అని రవీంద్రకవీంద్రుడు ఆలపించినట్లే కృష్ణశాస్త్రి కూడ "స్వేచ్ఛాగానము" నాలపించడానికి ఉవ్విళ్ళూరాడు.

ప్రకృతిలో చైతన్యం వెల్లివిరిసేలాగ, హృదయం ఆనంద తరంగాలలో తేలే విధంగా విశ్వం తన కష్టాలు మరచి తనతో గొంతుకలిపే రీతిగా గానం చేయడానికి సంకల్పించాడు.

"క్రౌర్యకౌటిల్య కల్పిత కఠినదాస్య, శృంఖలములు తమంతనె చెదరిపోవ
గగనతలము మార్మ్రోగగ, గంగంఠమెత్తి, జగమునిండ స్వేచ్ఛాగానఝురుల నింతు"

అని ఉద్ఘోషించాడు. ఇక్కడ "నవ్యకవులకు స్వేచ్ఛప్రాణము. వీరు ప్రాణమైనను గోల్పోవుదురు కాని శృంఖలములు ధరింపరు"[5] అనే అంశాన్ని గమనించాలి. పై గీతంతో -

"My soul spurned the chains of its dismay
And in the rapid plumes of song
Clothed itself, sublime and strong"[6]

అనే షెల్లీ చరణాల సామ్యం గమనింప దగ్గది.

"కల విహంగమ పక్షములఁ దేలియాడి, తారకా మణులలోఁ దారనై మెలపి
మాయమయ్యెదను నా మధురగానమున, నవ్వివోదురుగాక నాకేటి సిగ్గు?"

అని వ్రాశాడు. ఇక్కడ "నకామవృత్తి ర్వచనీయ మీక్షతే"[7] - అనేసూక్తి స్మరింప దగ్గది. పై గీతంతో -

"My paths are open before me
My wings are full of desire of the sky
I go to join the shooting star of mid-night
To plunge in to the profound shadow"[8]

అనే రవీంద్రుని చరణాల సామ్యం గమనింప దగ్గది.

మేఘం, చందమామ, కొండవాగు, జలధితరంగం - ఇత్యాదిగా మారిపోయి మాయం కావాలనే తపనను కృష్ణశాస్త్రి వ్యక్తం చేశాడు. 'దిగిరాను దిగిరాను దివినుండి భువికి' అని కూడ చాటి చెప్పాడు. తనలోని "నేను" స్వభావాన్ని -

"ఏను స్వేచ్ఛాకుమారుఁడ నేను గగన, పథవిహార విహంగమ పతిని నేను
మోహన వినీల జలధరమూర్తి నేను, ప్రళయ ఝంఝూప్రభంజన స్వామినేను"

అని వ్యాఖ్యానించాడు. యుగయుగాలుగా స్వేచ్ఛకోసం ప్రాణదానం

చేసిన 'ఈశ్వర యోధుల' ధ్యేయం చరితార్థమయ్యేవిధంగా స్వేచ్ఛాగానం చేస్తానని కూడ స్పష్టంచేశాడు.

## నవ్యతా ప్రీతి

నవ్యకవి సామాన్యమైన నవ్యతా ప్రీతిని కృష్ణశాస్త్రి "తేఁటి వలపు" లో ధ్వనింపజేశాడు. ఇందులో ఒక తేటి మల్లికా కుసుమంలోని మకరందాన్ని గ్రోలి వలపులూరించి పద్మపత్రాల మాటున దాగుతుంది. తమ చెలిని వరింపరమ్మని మల్లిక చెలులు ఆహ్వానింపగా ఆ తేటి చెప్పిన సమాధానమిది :

"... ... నిరతంబు మల్లిక కడనెయుండి, ముదము గూర్పఁగ మాకొక్క పూవె చెపుమ?" ఈ సందర్భంలో "...... a sexless bee, Tasting all blossoms and confined to none"[9] అనే షెల్లీ మాటలు స్మరింపదగి ఉన్నాయి.

నవ్యభావలోలుడైనప్పటికీ ఈ కవికి ప్రాతభావాలపై సానుభూతి లేకపోలేదు. ఇందుకు వాడీవాడని ఒక "విరిచేడె" ను చూచి ఈ కవి 'మది కరంగడం' నిదర్శనం.

## ప్రేమ పాఠం

ప్రకృతి సాహచర్యంలోనే కవి ప్రేమపాఠాన్ని నేర్చుకొన్నాడు. "ఏల ప్రేమింతును" అని ప్రశ్నించుకొని, మధుమాసంలో కోయిల పాడడంతో సమానమే ప్రేమించడమని చెప్పాడు. ప్రేమను ప్రకృతి ధర్మంగా భావిస్తూ ఇంకా ఇలా పేర్కొన్నాడు :

"పౌరభములేల చిమ్ము పుష్పవ్రజంబు?, చంద్రికల నేలచల్లు చందమామ?
ఏల సలిలంబుపాఱు?, గాడ్పేల విసరు?, ఏల నా హృదయంబు ప్రేమించు నిన్ను?"

ఈ గీతానికీ —

" The fountains mingle in the rivers
And the rivers with the ocean,
The winds of heaven mix for ever
With the sweet emotion;
Nothing in the world is single,
All things by a law devine
In one spirit meet and mingle
Why not I with thine?[10]

అనే షెల్లీ చరణాలకూ గల సామ్యం గమనింప దగ్గది.

ప్రకృతిలో సమైక్యం పొందాలనే కృష్ణశాస్త్రి తృష్ణ ఈ విభాగంలో ముఖ్యంగా ద్యోతక మవుతుంది. ఇందులో కవిలోని 'పలాయన చిత్తవృత్తి' స్పష్టమవుతుంది. ఇది నిర్హేతుక మయ్యిందికాదు ఆనాడు భారతజాతి 'పారతంత్ర్యశృంఖలా బద్ధమై' 'ఎటుచూచిన నిరాశా నిస్పృహాలు వికటాట్ట హాసం' చేస్తున్నట్లు కనిపించింది. అందువల్ల 'ఆత్మ తృప్తికి, సత్యాన్వేషణకు' ప్రకృతియే నవ్యకవులకు శరణ్యంగా తోచింది.[11]

ఇక 'స్వేచ్ఛాగానం' లో కృష్ణశాస్త్రి కేవలం కవితాస్వేచ్ఛను, వ్యక్తిస్వేచ్ఛను మాత్రమేకాక, దేశస్వేచ్ఛను కూడ అభిలషించాడు. 'దివి' నుండి 'భువి' కి దిగిరానని చెప్పడంలో తన దృష్టిని 'క్రాంత దర్శనం' నుండి 'మామూలు చూపు' వైపు మరల్చననే భావాన్ని ధ్వనింప జేశాడు.[12] వర్డ్స్‌వర్తు మొదలైన ఆంగ్లకవులు కూడ ఆనాటి సాంఘిక స్థితిగతులతో విసుగెత్తి స్వేచ్ఛాప్రియులై ప్రకృతిని ఆశ్రయించడం ఇక్కడ గుర్తింప దగ్గది.

2

ఆదర్శం

ప్రేయసితో 'చేయి చేయి కలిపి' ప్రకృతి సౌందర్యాన్ని సందర్శించడమే "దివ్యభాగ్యము" గా కృష్ణశాస్త్రి భావించాడు. భౌతిక సంప

దలు కోరకుండ ప్రకృతి సంపదను పరికిస్తూ, 'అన్యోన్య హృదయాల'కు ఏలికలై 'ప్రేమ సామ్రాజ్య పట్టభద్రు' లైతే, దాని ముందు 'సార్వభౌమ భోగాలు' సైతం సరిరావని భావించాడు. ప్రణయజీవిత సౌఖ్యానికి ఇందులో చక్కని సందేశం లభిస్తుంది.

ఈ సందర్భంలో 'ప్రేమ పెన్నిధి' అనీ, 'మాయ మర్మము లేని స్నేహము' జీవిత సౌభాగ్యానికి 'రాజమార్గ' మనీ గురజాడ చెప్పిన సూక్తుల ప్రభావం గమనింపదగి ఉంది.[13]

ప్రేయసిని శర్వరీవీథులనుండి అవతరించిన చందమామగాను, తన్ను కలుపాత్ముడుగాను భావిస్తూ కవి నీ వల్ల "నా ప్రేమ" పావన మయ్యిందని ఆమెను సమ్మానించాడు.

వి యో గ ం

'ప్రణయ జీవనం' పోసి పెంచుకొన్న 'గు లా బి మొ క్క' 'క్రూరార్క కిరణం' సోకడంతో కవిని ఎడబాసింది. కవి దీనస్థితికి కోకిల, మందపవనం సానుభూతి చూపాయి. "అయ్యో" అని కవి అలమటించాడు.

ఈ సందర్భంలో -

"I had a dove and the sweet dove died,
And I have that it died of grieving
O, what would it grieve for? Its feet were tied"[14]

ఇత్యాదిమైన షెల్లీ కథనం స్మరింపదగి ఉంది.

చిరుత ప్రాయంలోనే 'ఆనందగీతి' అంతరించి, 'హృదయనాళం' తెగిపోయింది. 'మమత గోలిపి' మాయమైన 'సౌదామని' కోసం విలపించాడు, తన 'హృదయ పుటాన్ని' చీల్చి రక్తాన్ని త్రాగరమ్మని

ఆక్రోశించాడు. ప్రేయసిని అనుగమింపదలచాడు. 'అవిరతానందాన్ని' అందుకొన్న ప్రేయసికి "ఆఖని దివ్వె" సమర్పించాడు.

ఈ సందర్భంలో -

" ... ... You have come in to my life
make me weep, see if you can break my heart"[15]

అనే రవీంద్రుని వేదన పేర్కొనదగి ఉంది.

ప్రేయసి చెలులతో కలసి వినువీథిలో వెళ్ళుతున్నట్లు ఊహించాడు. ఆమె 'పదసరోజమృదురజోలేశదివ్యసుపదను' స్మరిస్తూ దుఃఖాశ్రువులతో రాయిగా నిల్చిపోయాడు. "ప్రేయసీ" అంటూ వేయి కన్నులతో వెదకాడు. ఆమె నల్లమబ్బులలో మెరపుగా కనిపించి -

''నల్లమబ్బుల నింగి నా సౌధరాజమ్ము, నల్లమబ్బే ప్రియుడు నన్నుం గోరకుమా!'' అని పలికినట్లు భావించాడు.

అశాంతి

''మాటి మాటికి'' కవి హృదయం కలత చెందింది. తన 'వేడి నిట్టూర్పు గాడ్పుల'ను ప్రేయసికడకు తీసుకొని పొమ్మని 'మలయ పవనుని'తో మొరపెట్టుకొన్నాడు. అతని హృదయం 'తలపులపేటి' కడకు ఎగిరిపోయింది. "ప్రాణకాంత" వియోగంతో శాంతికరవయ్యింది. ప్రకృతిని శాంతిభిక్ష యాచించాడు. 'చిన్నిపూవే' వాడినందుకు ఖిన్నుడయ్యాడు.

''ఏటి పనియిది లోకమా! హృదయదళన, దారుణ మహోగ్ర కార్యంబుఁ దలఁచినావు
ప్రణయ మధురిమ మెఱుఁగవు పాపమనవు, పక్షములు దూల్చి బంధింతువు పంజరాన''

అంటూ ప్రేయసి వియోగానికి కారణమైన ''లోకము''ను ప్రశ్నించాడు. ఈ సందర్భంలో —

"The world is full of wood men who expel
Lover's gentle Dryads from the haunts of life
And vex the nightingales in every dell"[16]

అనే షెల్లీ చరణాలు గుర్తింపదగి ఉన్నాయి.

మానసికంగా కవి ప్రేయసితో కలసి 'విహంగదంపతులు' గా జీవింప నెంచాడు. నవవసంతంలో 'పికమ పాడకు'మని లోకం "శాపము", పెట్టింది. హృదయపద్మాన్ని త్రుంచి 'జీవితవల్లి' ని త్రెంచినందుకు "అబ్బ" అని నిట్టూర్పు వదలాడు.

పేరాసతో ఆకాశంలోని "చుక్కలు" చూచి 'నూరేళ్ళ బ్రతుకు' ను 'మూడునాళ్ళకె ముక్కలు' చేసుకొన్నందుకు పశ్చాత్తాప పడ్డాడు. ప్రేయసి వియోగానికి కవి బాధ్యత ఇక్కడ వ్యక్తమవుతుంది.

"దుఃఖము" తీవ్రమై కవి దయనీయ స్థితికి వచ్చాడు. 'ప్రావృడంభోధరస్వామి' జాలిగా 'కన్నీటి చుక్కలు' కార్చి, నిట్టూర్చి, హోరుమని ఏడ్చి వెళ్ళిపోయాడు. "నేనొకండ" కృశిస్తానని కవి వాపోయాడు. కవికి సానుభూతిగా మేఘం రోదించడంలో —
"ప్రాయస్సర్వో భవతి కరుణావృత్తి రార్ద్రాన్తరాత్మా" (మేఘ సందేశం) అనే కాళిదాసు సూక్తి గమనింపదగ్గది.
నితాంతమైన వేదననుండి విముక్తి కోరుతూ సంధ్యాసమీరణునితో–

"నీదు మనులేత ఱెక్కలమీఁద వడిగ, నెత్తుకొని పోవరాదె నన్నెచటికేని
దివ్యతేజోమయానంద నిలయమునకు, నిముసమేనియు నిటనుండనేరనోయి!" —

అని మొరపెట్టుకొన్నాడు.

ఈ సందర్భంలో —

"Oh! lift me as a wave, a leaf, a cloud!
I fall upon the thorns of life! I bleed!"[17]

అని షెల్లీ పశ్చిమ సమీరణునితో మొరపెట్టుకొన్న ప్రకరణం స్మరింపదగ్గది.

కవిస్థితికి కనికరంతో ఒక 'ఉడుమణి' విషాదద్యుతులు రాల్చింది. పవనం 'విలాపగీతం' పాడింది. అందుకు 'గౌతమీవీచికలు' ఎదకరిగే టట్లు ఏడ్చాయి. కవికి దుఃఖమే తోడునీడ అయ్యింది.

వేదనా భాగ్యం

> " Life has become richer by
> the love that has been lost"[18]

అని రవీంద్రుడన్నట్లు క్రమంగా కృష్ణశాస్త్రికి కన్నీరూ, నిట్టూర్పూ, శోకమూ ప్రీతి పాత్రాలుగా మారాయి. 'అనంతశోకభీకరతిమిర లోకైక పతిని' నేనని చాటాడు. తన నిశ్వాసాలూ, కన్నీరూ, 'దుఃఖంపు నిధులూ' అపూర్వానందాన్ని ఇస్తాయన్నాడు. తనపై ఎవరూ జాలి చూపడం "వద్దు" అని హెచ్చరించాడు.

వెలుగు చీకట్లతో నిండి "నాజీవితము" నాకే వింతగా ఉందని కవి వాపోయాడు. 'అమల మోహన సంగీతం'లో 'దారుణ రోదన ధ్వనులు' విన్నాడు. తెలిసీ తెలిసీ 'విషాన్నే' తిన్నాడు. తన జీవితానికి "ఆశ" అనర్హ మనుకొన్నాడు:

అంతటి దుఃఖంలోను "నేనుకూడ" పాడగలనని గొంతు సవరిం చాడు. కాని ఆపాట 'శోకంపుటెడారుల' లో ఇంకిపోయింది. ఐనా 'మూగవోయిన నాగళమ్మునను గూడ నిదుర వోయిన సెలయేటిరొదలు గలవు' అన్నాడు. అవకాశం లభిస్తే ఏకాంతంలో ఏడ్వడమే మహదా నందంగా భావించాడు.

> " వెక్కి వెక్కి రోదింతును – విసువు లేక
> విరతిలేక దుర్భర శోక విషమ గీతు, లేడ్పివైతు "

అన్నాడు. ఈ సందర్భంలో —

26

" I could lie down like a tired child
And weep away the life of care"[19]

ఇత్యాదియైన షెల్లీ రోదన ప్రియత్వం స్మరింపదగి ఉంది. ఇట్లే కీట్సు కూడ ఏకాంతంగా ఏడ్వాలనే కోరికను వ్యక్తం చేశాడు.

## విరక్తి

కృష్ణశాస్త్రికి ఈలోకం మొదటినుండి 'కృష్ణపక్షంపు వీథియే' కాని 'మధుర మధురమూర్తి, ప్రియురాలు, సఖురాలు, పూర్ణరాగకలిత' యైన 'సహధర్మచారిణి' కోసం 'నాకు మరణమ్ము వలదు' అను కొన్నాడు. ప్రేయసి పోయిన తరువాత 'మరణం' 'లేతనుడి' గా మారింది. ఈ సందర్భంలో —

" Darkling I listen; and for many a time
I have been half in love with easeful Death
Call'd him soft names in many a mused rhyme"[20]

అనే కీట్సు చరణాలు గమనింపదగి ఉన్నాయి.

'విషాద సుఖాన్ని' అందించి ప్రేయసి వెళ్ళిపోయిన సంధ్యా సమయాన్ని కవి విస్మరించలేకపోయాడు. ఆమె 'నూపురాహ్వానాల' వెంట తన హృదయం కదలిపోయినట్లు భావించాడు. ప్రతి సాయంకాలం ఆమె కోసం, తన హృదయం కోసం, "ప్రతీక్ష" చేశాడు. 'ప్రవాసక్లేశం' దుర్భరమయ్యింది. 'ఆవలిదరి'లో దివారాత్రాలూ ప్రేయసిపిలుస్తున్నట్లు తోచింది. ఆమెతో 'నిత్యాశ్లేషాన్ని' కోరుతూ శూన్యమైన లోకాన్ని, దేహాన్నీ వదలి 'దుఃఖ ఝరుల' పై పరుగెత్తి ఆమెను చేరుకో దలచాడు.

"నిర్యాణము" నకు నిశ్చయించుకొని 'పరమపదశాంతి' కోసం 'నిర్యాణ గీతి' ఆలపించాడు. తరువులు, చిరుగాలులు, విహంగాలు

జాలిగా వీడ్కోలిచ్చాయి. దూరపు ప్రయాణానికి ఉద్యమించి, 'కవి కుమార! ఎచటికేగుచుంటివోయి నేడు!' అని ప్రశ్నించుకొన్నాడు.

ఈ విభాగంలో 'ప్రేయసీ పూజ్యత', 'ఆత్మ న్యూనత', అడుగడుగునా ప్రకృతి సానుభూతి – వ్యక్తమవుతాయి. ఇందులోని భావవిన్యాసం 'ఏకోరసః కరుణఏవ' – అనే సూక్తిని తలపింప జేస్తుంది. ప్రేయసి పాదధూళి భాగ్యాన్ని కోరుతూ, ఆమె సాన్నిధ్యం కోసం కవి అశ్రులు చాచడంలో సూఫీతత్త్వం ద్యోతక మవుతుంది. వేదనను ఆదరించడంలో ఈ తత్త్వమే ధ్వనిస్తుంది.

**3**

ప్రశ్న

విషాదస్మృతులు కవి హృదయాన్ని మరల మరల కలత పెట్టాయి. దురంతమైన దుఃఖానికి పరమేశ్వర సంస్మరణం తరణోపాయ మయ్యింది. కృష్ణశాస్త్రి విరక్తి, భక్తివైపు మరలింది. 'తియ్యని ప్రణయగీతి' పాడుకోవడానికి 'లసద్విపంచి' చేతికిచ్చి తంతులేల త్రెంచితివి? మనోహరమైన 'కుసుమదామాన్ని' మెడలోవేసి రేకులేల చిదిమితివి? 'కల్యాణ మకుటాన్ని' శిరస్సుపై పెట్టి దిగంతాలకేల గిరాటు వేసితివి? అంటూ భగవంతుని ప్రశ్నిస్తూ విలపించాడు.

అనుకంప

దయామయుడైన జగదీశ్వరుడు 'తారావిలోకనాల'తో సైగచేస్తూ, కౌగిలింప వచ్చినట్లు తోచింది. ఆ భాగ్యం బురదలో పొరలే పురుగు లాంటి తనకు తగదనీ, 'విఘాత పాతమే' సంతోషదాయకమనీ కవి వాపోయాడు. కాని పరాత్పరుని 'ప్రణయార్ద్ర నిస్స్వనాలు' నిద్రించే కవి 'హృదయపాత్రి' లో సిందాయి. మేల్కొగానే 'శూన్యలోకమే' కనిపించి హోరుమని ఏడ్చాడు.

దైన్యం

రాజరాజేశ్వరుడు 'చింపి పాతల'తో 'జీర్ణ పటకుటీరాల' లో నివసిస్తూ, దరిద్రులతో చేరి భిక్షాటనం చేస్తున్నట్లు తోచింది. చిత్ర మైన దైవలీలలకు విస్మయం పొందుతూ కవి 'ఎట్లు నిన్నూహ సేయుటో యెఱుఁగ' లేననీ శిరసువంచి, "క్రుంగిపోదు" ననీ విన్నవించాడు. హృద యనాథునకు ఇదే "నా కానుక" అంటూ 'కన్నీటి చుక్క'ను సమర్పిం చాడు. ఈ సందర్భంలో –

"... thou walkest in the clothes of the humble among the poorest and lowliest and lost"[21]

"I felt I was poor, and from door to door went with my hunger

... ... You came and asked for alms"[22]

అనే రవీంద్రుని చరణాలు గుర్తింపదగి ఉన్నాయి.

పశ్చాత్తాపం

కవి "పాపి" గా తన్ను పరిగణిస్తూ కన్నీటితో, నిట్టూర్పులతో, సర్వేశ్వరుని శరణుకోరాడు.

"కురియుమురా కన్నీటిని, మఱి మఱి విలపింపుమురా
నరముఁగూర్చి పరమేశుఁడె, దాల్చునురా పాపీ!"

అని ఆత్మ ప్రబోధం చేసుకొన్నాడు. తన "కన్నీరు" స్వామి పాదాల సాన్నిధ్యంలో 'జాహ్నవీ ప్రతిభ' పొందుతుందని ఆశించాడు.

"తావకీన పదసరోజదళములందు, నిలువనిమ్మొక్కవేడి కన్నీటిచుక్క
కడలఁ బ్రసరించి నెత్తావి కమ్మఁ దనముఁ, ద్రావనిమ్మొ ప్రభూ! దానిఁదనివి తీర!"

అని భక్తి తన్మయుడై అర్థించాడు.

అభిసరణం

పశ్చాత్తాపంతో పరిశుద్ధమైన కృష్ణశాస్త్రి భక్తి 'మధురభక్తి' గా పరిణమించింది. కవి హృదయం అలనాటి వ్రేపల్లెలోని ఒక గోపిక గా

మారింది. ఆమె అభిసారికయై చిమ్మచీకట్లు క్రమ్మిన తమాలవాటిక గుండా బృందావనికి పయనించింది. కాని నాటి బృందావన సౌందర్యమూ, యమున నాట్యవిలాసమూ, బాలగోపాలుని మురళీరవళీ లేకుండడంవల్ల విరహావిహ్వల అయ్యింది.

పూర్వమొక శరద్రాత్రి యమునాతరంగాల సంగీత సాహచర్యంతో దిగంతాల వ్యాపించిన నందకిశోరుని వేణుగాన మాధుర్యంలో విలీనమై పరుగులుతీసే హృదయంతో, దేహాన్నీ, దైహిక బంధాలనూ విస్మరించి, 'వలపుతొందర' తో బృందావనికి వచ్చి స్వామిని కలుసుకొన్న మధురక్షణాలు మదిలో మెదలాయి.

" ఇచటనే యిచటనె యతఁడిచటనేను — ఇచట నీ జాజిపూఁ బొదరింటనేను -
ఈ కడిమిచెట్టుక్రింద సుమ్మీయతండు, సరిగ కన్నులఁ గట్టిన సరణిఁదోచు "

అని జగన్నాథునితో కలసి మెలసి ఉండిన ప్రదేశాలను ఉత్కంఠతో వెదకి చూచింది. చిన్నికృష్ణుని సోయగాన్నీ, అతని వేణుగాన మహిమనూ తనివితీర స్మరించింది.

" బాలగోపాలుఁబోలెడు పాటగాని, కని విని యెఱుంగమెన్నండు-కరములోని
మురళినేకాదు-నాలోని మోడుఁబెడఁద, నీరిఖిలజీవనమ్ము మోయింప గలఁడు "

అనుకొంటూ పరవశించింది. ఆగానంలో 'తారకా రవి చంద్రతతులు' సైతం 'చిని చిన్ని గీతులు' గా కలసిపోయేవని ఊహించింది. "మధుర భక్తి కవిత్వమున శ్రీకృష్ణుని వేణుగానమునకు అత్యంత ప్రాధాన్యమున్నది. ఆ కవిత వెలయించినవారు వేణుగానమును వర్ణించక విడువలేరు"[23] అనే అంశం ఇక్కడ గమనింప దగ్గది.

జాలిగా పిలిచే యముననూ, కళావిహీనమైన సైకతాలనూ, తెరువరులులేని తెరువులనూ, మోడువారిన చెట్లనూ సానుభూతితో చూస్తూ, ఎదలో త్రుళ్లింతలాడే 'వేణునాదం' తో గోపిక "అన్వేషణము" సాగించింది.

విప్రలబ్ధయైన ఈ గోపికను ఇంకొక గోపిక కలుసుకొంటుంది. ఆ గోపిక ఎవరు? అనే ప్రశ్న కలుగుతుంది. ఇద్దరి స్థితీ ఒకటే కావడంవల్ల ఈ గోపికకు ఆ గోపిక ప్రతిబింబంగానే నిర్ణయించవలసి ఉంది.

ఈ విషయంలో —

"I came out alone on my way to my tryst
But who is this that follow me in the silent dark?
... ... ... ... He is my little self"[24]

అనే రవీంద్రుని చరణాల సామ్యం ఇక్కడ గుర్తింప దగ్గది.

'నవ్యకవులు తమ్ము తాము గోపికగానో రాధికగానో భావన' చేస్తూ వ్రాసిన ఖండికలలో ఈ అన్వేషణం 'రమ్యాతిరమ్యం'. ఇది భక్తికీ ప్రణయానికీ విడదీయరాని సంబంధం' కల్పిస్తూ 'తెలుగుజాతి గర్వించ దగిన మహాకావ్యం' గానే మన్నన పొందింది.[25]

ఈ విభాగంలో భగవంతుని భిక్షాటన సూచించడంలో శైవ సంప్రదాయమూ, 'అన్వేషణ'లో వైష్ణవ సంప్రదాయమూ, 'పాపి'గా తలపోస్తూ 'కన్నీరు' కురిపించడంలో బ్రహ్మసమాజ సంప్రదాయమూ కనిపిస్తాయి. ఈ సందర్భంలోని గీతాలు 'కన్నీరు', 'మహతి' కృతులలో కూడ చేరి ఉండడం గమనింపదగ్గ అంశం.

## 4

విశ్వగాయకుడు

"మహాకవి" అనే గీతంలో గురజాడ విశ్వగాయకుడుగా వినుతింప బడ్డాడు. ఇది గురజాడకు ప్రీతిపాత్రమైన ముత్యాల సరంలోనే వ్రాయ బడి ఉండడం రసవంతం.

నవవసంత కోకిలగా గురజాడ విపత్తుల లక్ష్యపెట్టక మేలి ముత్యాల సరాలతో తెలుగు తల్లిని కైసేసిన విషయాన్ని, ఆ కవి

భాస్కరుని కవితావైభవాన్ని కృష్ణశాస్త్రి భక్తిప్రపత్తులతో సంస్మరించాడు.

"యుగ యుగంబుల నుండి మ్రోగెడు, విశ్వగాన వియత్తరంగిణి
భంగముల నుప్పొంగు నాతని, గీతిశీకరముల్"

ఇది ఆ మహాకవి ప్రశస్తికి చక్కని నీరాజనం. ఆ 'మూగవోయిన ముద్దు కోయిల'ను 'చిన్నిపికము:లు' పిలిచే అంశం రమణీయం. విస్తృతిలో చిన్నదైనా ఈ స్మృతిగీతి విషయగౌరవంలో గణనీయం.

అమరగాయకులు

"మాబాబయ్య – నాన్నగారు" అనే గీతంలో కృష్ణశాస్త్రి అమరగాయకులైన తన తండ్రీ పెదతండ్రులకు అక్షరార్చన చేశాడు. పుణ్యలోక నివాసులైన ఆ 'దేవులపల్లి సోదరకవులు' తమ 'అమృత గానాన్ని' ఆ లోకంలోను కురిపిస్తారని ఊహించాడు. వారు రామ రాయావనీంద్రునితో ఎడబాయక కలసి ఉన్నారనీ, ఆ ముగ్గురూ సూర్యరాయని ప్రశస్తికి మెచ్చి 'ఆశీఃపాక్షతలు' చల్లుతారనీ భావించాడు.

అలనాటి పిఠాపుర సభావైభవాన్ని, కవిసన్మానాలలో తలమానికంగా రామరాయావనీంద్రుడు తమతండ్రులను సింహాసనంపై అధిష్ఠింపజేసి సత్కరించడాన్ని అభిమాన పురస్సరంగా సంస్మరించాడు. తమ తండ్రుల కవితామాధుర్యంలోని కొన్ని 'చినుకులు' తన గొంతులో ఉన్నాయనీ; కనులూ మనసూ విప్పి చూచేవారికి అవి స్ఫురిస్తాయనీ పేర్కొన్నాడు.

ఈ గీతాలలో సాధారణంగా స్మృతి గీతాలలో కనిపించే శోక భావ ప్రాధాన్యం లేకపోవడం విశేషం. ఈ రెంటినీ మధురస్మృతి గీతాలుగా పరిగణించడం యుక్తం.

కృష్ణపక్షం 'ఆంధ్ర సారస్వతములో అపూర్వము, అత్యంత విశిష్టము'[26]. దీనిలోని భావగీతాలు 'అమృత గుళికలు'.



# ప్రవాస మాధుర్యం

కృష్ణపక్షంలో రెక్కలు విప్పిన కృష్ణశాస్త్రి వేదనావిహంగం ప్రవాసంలో చరమసీమలలో పరిభ్రమించింది. భవభూతి మహాకవి —

" దళితహృదయం గాఢోద్వేగాద్ ద్విధాతు న భిద్యతే
వహతి వికలః కాయో మోహం న ముంచతి చేతనామ్
జ్వలయతి తనూ మంతర్దాహః కరోతి న భస్మసాత్
ప్రహరతి విధి మర్మచ్ఛేదీ న కృంతతి జీవితమ్ "

అని వియోగ సంతప్తమైన శ్రీరాముని హృదయ స్పందనను ఆవిష్కరించి నట్లే కృష్ణశాస్త్రి ఈ కావ్యంలో తన 'విషాద మాధురి' కి అక్షరాకృతి కల్పించాడు. ఈ కావ్యనామౌచిత్యం స్పష్టం. నిరంతరమైన పరితాపం వల్ల లౌకిక మాలిన్యం కొంత 'క్షాళనం' జరగడంవల్ల కవిలో పూర్వజన్మస్మృతి జాగృతమయ్యింది.

తొలి ప్రవాసం

" నా నివాసమ్ము తొలుత గంధర్వలోక
మధుర సుషమా సుధాగాన మంజువాటి "

అని తోచింది. అప్పుడు తానొక 'వియోగశాలిని', 'వియోగగీతిక'గా ఉండినట్లు భావించాడు. ఒకప్పుడు ఆమె 'అంగుళీకిసలయాల' నుండి విడివడి, ఒక 'విపంచి విరహాకంఠం' సోకి 'నిదుర వెన్నెలలదారి' లో ఎగిరి, ఈ 'అనంతవిశ్వాన' పడినట్లు స్ఫురించింది. 'గంధర్వగాయకుడై'న కృష్ణశాస్త్రి తాను గంధర్వలోకం వాడుగా తలంచడం అసమంజసం కాదు.

భూలోకానికి రావడమే కృష్ణశాస్త్రికి 'తొలిప్రవాస' మయ్యింది. పారమార్థిక దృష్టితో చూస్తే ఈ లోకం ఎవరికైనా ప్రవాసమే. 'వెత్తియన్వేషణ' సాగిస్తూ కవి 'ఆశావకాశాల' కు కదలిపోసాగాడు.

"ఏను తొలుత నేగూడేని లేవి పులుఁగు, రాయద వహించినాఁడ నా బ్రదుకుబాట
నాట నవయని తెక్కు యుయ్యాలకొనల, తెరువెలేని - తీరమెలేని దివ్యసీమ"

అంటూ నిలకడకాని, నిర్ణీతగమ్యంకాని లేకుండ జీవితంలో ప్రవేశించిన విషయాన్ని పేర్కొన్నాడు.

ప్రాణస్నేహితులతో కలసి 'పైఁడి వన్నియ', 'నీలినీడ' లతో కూడిన 'సంధ్యా మనోజ్ఞ చిత్ర సిందూర రేఖ'గా మారిపోయానంటూ- సుఖదుఃఖాత్మకమైన అనుభూతులతో పాశ్చాత్య సంస్కారసౌందర్యాన్ని సంతరించుకొన్న విషయాన్ని వ్యక్తం చేశాడు. నవ్యసాహిత్యంలో నక్షత్రంగా - తారాపథంలోని మిత్రులను క్షణంకూడ ఎడబాయక జీవించాడు.

మలిప్రవాసం

ప్రేయసి 'అగమ్య తమస్వినీ గర్భకుహరాల' లోనికి వెళ్ళిపోవడంతో దారులన్నీ మాసి, కవిజీవితంలో అంధకారం అలముకొన్నది. ప్రేయసి అడుగులసందడి తన 'ఎడఁదత్రోవ'నే నడచి, అందులోనే అంతర్భవించినట్లు తోచింది. ఈ సందర్భంలో -

"I know well the rhythm of your steps,
they are beating in my heart"[1]

అనే రవీంద్రుని వేదన గమనింపదగి ఉంది.

నిర్వేదంతో కవి ప్రతి నిశీథంలోను 'శూన్యహృదయం' లోనికి చూచుకొంటూ 'ఓ చెలీ!' అంటూ వాపోయాడు. 'సడి లేని నడి రేయి'లో పడిపోయిన ప్రేయసి 'కడియాల రవళులూ', 'గాజుల మ్రోతలూ' జీవిత మార్గాన్ని నిర్దేశించినట్లు తలంచాడు. నక్షత్రంగా ప్రకాశించిన కవి 'ఇరుల చాయ' గా మారి కృశించి పరితపించాడు.

ఈ సందర్భంలో —

"Thus at last my day has ended and
now in the evening I sing my last song
to say that I have loved thy world"[2]

అనే రవీంద్రుని పరితాపం స్మరింపదగి ఉంది. ప్రేయసి వియోగంతో కృష్ణశాస్త్రికి 'మలి ప్రవాసం' మొదలయ్యింది.

కవి కంఠం నుండి 'దుస్స్వప్నాలు' బహిర్గమించాయి. లోక మంతటా శోకమే సాక్షాత్కరించింది. 'క్షమాజనని' 'గర్భకుహరం'లో కార్చిచ్చు నిండినట్లు తోచింది. లోకేశ్వరుని హృదయంకూడ ఏడ్పులు గ్రక్కినట్లు భావించాడు. ప్రళయం క్రమ్మినట్లు తలచాడు. రెక్కలు ధరించడానికే కవిపాట వెరచింది. తనలోని 'సంజియకావి' నశిస్తుం దేమో అని అలమటించాడు.

ఆశానిరాశలు

'అనంత యాత్రాపథం' లో కవికి తనలాంటి వారి 'అడుగు జాడలు' కనిపించి, 'అమృత జీవప్రతిభ' తో పలుకరించాయి. అజ్ఞాత మైన 'భావికాలం' వైపు ఒక 'క్రొత్తబరువు' తోను, ఒక 'క్రొత్తఆశ' తోను అడుగులు వేశాడు. 'కనరాని దానికొఱకై' నిరీక్షించాడు. 'మఱపు మసకలు' తొలగిస్తూ ఏదో 'కల' విరిసి మెరపిస్తుందో లేదా 'వెఱ్ఱి బ్రతుకు' నిరర్థకమవుతుందో అని సందేహించాడు.

'తమఃక్రాంత' మైన జీవితంలో 'లేత నెత్తావి గుసగుసలు' ఏవో స్ఫురించాయి. వెలుగు చీకట్లు ఎదురయ్యాయి. క్రమంగా నిరాశ పెరిగింది. కాలం 'కారు రూపు' తో కనిపించింది.

"నా కుగాదులు లేవు, నా కుషస్సులు లేవు
నేను హేమంత కృష్ణానంత శర్వరిని" అనుకొన్నాడు.

ప్రేయసి స్వరూపం మనసులో మెరసింది. ఆమె ధమ్మిల్లంలోని పూలు వెక్కిరిస్తూ దురంతమైన ఆవేగానికి గురిచేశాయి. ఆమె వస

నాంచలాలూ, మంజీరాలూ, కాంచీఘంటికలూ పలుకరించి వెఱ్ఱిని చేశాయి. 'చాలు నా సఖి! నీ ప్రేమ శాపమీ యపూర్వ నారక యాతనాఖర్వతాప' మని మొరపెట్టుకొన్నాడు.

ఈ సందర్భంలో —

" I cry your mercy – pity – love! aye, love!
Merciful love that tantalizes not ... ... ... ...
That shape, that fairness, that sweet minor zest"[3]

అనే షెల్లీ చరణాలు స్మరింపదగి ఉన్నాయి.

వెలుగును చూస్తేనే కవి దివాంధంలాగ భయపడ్డాడు. 'మాపేమో, రేపటకో' అనే సందేహం ముదిరింది. ఐనా అంధకార మయమైన జీవితంలో 'వేకువరేకు' కోసం ప్రతీక్షించాడు.

"చివురింపదో చైత్ర శుభోత్సవ విభాత
కల్యాణము ఈ దరిద్ర హేమంతమున" అని ఆశించాడు.

బ్రతుకు 'రూపుమాసి', 'జాలినీడ' కోసం వెదకాడు. కరుణభిక్షకోసం చేయిచాచాడు. కాని ప్రయోజనం లేకపోయింది. ఈ సందర్భంలో -

" A begger in me lifted his lean hands to the starless sky
and cried into night's ear with his hungry voice"[4]

అనే రవీంద్రుని చరణాలు గమనింపదగి ఉన్నాయి.

లోకం కవిజీవితంపై 'ఇనుపపాదాల'తో నడచింది. అవసాన కాలం ఆసన్నమైనట్లు తోచి, ఏకాంతంగా ఏడ్చాడు. 'అమావాస్య రాత్రి' మాత్రం ప్రియమిత్రంగా కనిపించింది. 'స్వాగతాశ్లేషమున విడఁజాలు నెదల, నల్లద్రావితిమున్న దోసిళ్ళకొలఁది' – అని తన దయనీయ స్థితికి కారణ మూహించాడు.

మరణోద్యోగం

జీవితాంతం వియోగాగ్నిలో కాలిపోవడానికంటె చితిమంటలో ప్రవేశించడమే హాయిగా తోచింది బాలోలు! 'అవసాన వాంఛ'గా 'మరణశయ్య' పరచుకొని, తనకు తానే వీడ్కోలిచ్చుకొన్నాడు. తన ఊర్పులే చితిమంటలు రేపి, దహింపజేస్తాయనుకొన్నాడు. 'పడములే అర్పంగా నొక బాష్పమేని' అనుకొన్నాడు. తన మృతికి ఎవరూ బాధపడరని భావించాడు. ఈ సందర్భంలో —

" My little joy! my little pride!
In two days more I must have died,
Then do not weep and grieve for me"[5]

అనే వర్డ్స్‌వర్త్ భావాలకూ,

" Some might lament that I were cold,
As I, when this sweet day is gone
Which my lost heart, too soon grown old,
Insults in this untimely moan"[6] —

అనే షెల్లీ భావాలకూ కృష్ణశాస్త్రి భావాలకూ ఉండే భేదసాదృశ్యాలు గమనింపదగి ఉన్నాయి.

అశ్వాసం

మరణాన్ని వరించడానికి సంసిద్ధుడైన కవిని నిశీథిలో 'నీడవో తారసింగిలో నిల్చి ఎవరో పిల్చినట్లు తోచింది. జీవితం నిర్జీవమైన తరువాత పిల్చేవారెవరా? అని కవి ఆశ్చర్యపడ్డాడు. ఆ పిలుపే కవి జీవితానికి ఆశాతంతువయ్యింది.

ప్రాణత్యాగం చేయడానికి ఎన్నో మార్గాలున్నాయి; చితి పేర్చుకో నక్కరలేదు. అందువల్ల కృష్ణశాస్త్రి భౌతికంగా మరణించ డానికి ప్రయత్నించాడనే వాచ్యార్థాన్ని గ్రహించరాదు. అతనికి 'కష

త్వం ప్రాణం.' కవిత్వాన్నీ, లోకంపై మమకారాన్నీ త్యజించడానికి సంకల్పించాడని గ్రహించాలి. ఇది కేవలం తాత్కాలికమే అన్న సంగతిని గుర్తించాలి. ఇక్కడ -

"We live in this world when we love it"[7]

అనే రవీంద్రుని అభిప్రాయాన్ని గమనించాలి.

కాల్పనిక కవులలోని కలలూ, మరణోద్యోగాలూ తమ ప్రభావాన్ని ప్రసరించి, ప్రవాసానికి మార్గదర్శకమయ్యాయి. అందువల్ల దీనిలో కృష్ణశాస్త్రి చితిపేర్చుకోవడమూ, నీడలాంటి వ్యక్తి పిలువడమూ కేవలం స్వప్నానుభూతులే. ఇందుకు కవి పేర్కొన్న నిశీథి, 'నిదుర హృదయం'అదరడం మొదలైనవి సాక్ష్యమిస్తాయి. పైగా 'కల' కోసమే కవి నిరీక్షించాడు. ఆ కలలో పిల్చిన వ్యక్తి కవి ప్రేయసియే అని చెప్పడం నిర్వివాదం. భవభూతి సృష్టించిన 'ఛాయాసీత'కు ఛాయగా ఈ ప్రేయసి భాసిస్తుంది.

ఈ కావ్యంలో ప్రేయసి అడుగుల సవ్వడి తన గుండెలో విలీనమైనట్లు కవి భావించడం, చీకటిని కూడ అభిమానించడం మొదలైన అంశాలలో సూఫీతత్వం స్ఫురిస్తుంది. ప్రకృతి సాన్నిహిత్యం కూడ తగినంతగా దీనిలో చోటు చేసుకొన్నది. కరుణ రసానికి ప్రాధాన్యమిచ్చిన నవ్యాంధ్ర కృతులలో ఇది ప్రథమ గణ్యం. ప్రణయ కవిత్వంలో 'పరాంకోటి' కెక్కిన కృష్ణశాస్త్రి 'కృష్ణపక్షంలో కంటె ప్రవాసంలోనే తన లక్ష్యాన్ని చేరుకొన్నా'డని రసజ్ఞులు కొందరు అభిప్రాయపడ్డారు[8]

"Let love melt into memory and pains in to songs"[9] —

అన్న రవీంద్రవాణికి ప్రవాస గీతాలు చక్కని దృష్టాంతాలు.

---

# ఊర్వశీ హృదయం

కృష్ణపక్షు, ప్రవాసాలలో తీరని లౌకిక వేదనతో పరితపించిన కృష్ణశాస్త్రికి ఊర్వశిలో 'అమృతత్వం' దర్శనమిచ్చింది. ఊహాప్రేయసులలో ఈ ఊర్వశి అగ్రపీఠాన్ని అలంకరించింది. అలౌకిక ప్రణయ సౌందర్యాలపై కేంద్రీకృతమైన కృష్ణశాస్త్రి సాధనకు ఈ కృతి అక్షరాకృతి.

ఈ కావ్యంలో దివ్యప్రణయాన్వేషణకూ విశ్వసౌందర్యోపాసనకూ పేరుపొందిన సూఫీతత్వం ప్రథమస్థానాన్నీ, కవితాదేవతారాధన తత్వం ద్వితీయస్థానాన్నీ ఆక్రమించాయి. అంతేకాక ప్రకృతీ, జాతీయభావమూ దీనిలో కొంత చోటుచేసుకొన్నాయి. నవ్యసాహిత్యంలో ఊహాప్రేయసి కల్పనకు మూలభూతమైన నాలుగుఅంశాలూ ఇందులో మేళవించి ఉండడం గణనీయమైన విశేషం.

సూఫీతాత్వికులలోని 'విశ్వాత్మరూపిణి'యైన 'అప్రాప్త మనోహరి' స్వభావాన్నీ స్వీయకవితాలక్ష్యాన్నీ దృష్టిలో పెట్టుకొని కృష్ణశాస్త్రి ఊర్వశిని సృష్టించాడు. ఈ ఊర్వశిలో ప్రాప్తా ప్రాప్త స్వభావాలు రెండూ కనిపిస్తాయి. ఐనా ఈ కావ్యానికి మూలం సూఫీతత్వమని చెప్పడం యథార్థం. కృష్ణశాస్త్రిలో సూఫీదృక్పథం వికసించడానికి 'గురుదేవుడు' బ్రహ్మర్షి కురిపించిన 'సూఫీచరితామృతమే' అంకురార్పణంగా గుర్తించాలి.

ప్రాచీనకాలంనుండి భారతీయవాఙ్మయంలో ఊర్వశి అప్సరసగా, సౌందర్యరాశిగా, శృంగారమూర్తిగా చిత్రింపబడుతూ వచ్చింది. ఆమె క్షీరసాగరంలో జన్మించినట్లూ, నారాయణుని ఊరువునుండి ఉద్భవించినట్లూ - రెండు అభిప్రాయాలు ఉన్నాయి. అందులో మొదటిదానిని రవీంద్రుడు ఆదరించాడు; రెండవదానిని కృష్ణశాస్త్రి అభిమా

నించాడు.[1] దీనినిబట్టి కృష్ణశాస్త్రి ఊర్వశిలో అలౌకిక సౌందర్యాన్నే కాక, దివ్యత్వాన్ని కూడ గుర్తించాడని స్పష్టమవుతుంది. రవీంద్రుడు తన ఊర్వశీ ఖండకావ్యంలో 'స్వర్గ మర్త్యములకు స్వర్ణ సేతువు రచించిన సౌందర్యదీధితి'గా ఊర్వశిని తీర్చిదిద్దాడు.[2] ఐనా రవీంద్రుని ఊర్వశి పౌరాణిక రంగంలోనే నర్తించింది. పౌరాణికమైన ఊర్వశికీ కృష్ణశాస్త్రి ఊర్వశికీ నామమాత్రమైన సామ్యం కనిపించినా, భేదమే గణనీయంగా ఉంది.

ఈ ఊర్వశిపై రవీంద్రుని ఊర్వశి ప్రభావం ఒకటి రెండు అంశాలకే పరిమితం. కాని రవీంద్రుని కవిత్వంలో తరచు తళుక్కుమని మెరసే సూఫీదృక్పథం ఈ కావ్యంలో రాశీభవించింది. అందువల్ల కృష్ణశాస్త్రి-ఊర్వశిని వరించడంలో రవీంద్రుని ప్రభావమే పౌరోహిత్యం వహించి ఉండడం వాస్తవం. అంతేకాక విరహగీతాలు వ్రాయడంలో క్రమంగా గ్రీకుపారశీక సాహిత్యాలలో ప్రసిద్ధి పొందిన శాఫో, జేబున్నీసా కవయిత్రులతో స్పర్ధిస్తూ కృష్ణశాస్త్రి ఈ ఊర్వశీ గీతాలు వ్రాసినట్లు ఒకచోట సూచించాడు.[3] దీనినిబట్టి ఈ కావ్యంపై ఆ కవయిత్రుల ప్రభావం కొంత ఉన్నట్లు గతార్థమవుతుంది.

ఊర్వశీ కావ్యావిర్భావాన్ని సూచిస్తూ కృష్ణశాస్త్రి వ్రాసిన 'మా ప్రణయలేఖల కథ'[4] లోని ముఖ్యాంశాలను సమీక్షించడం అవసరం.

అవతరణిక

1. కృష్ణశాస్త్రి ప్రేమనూ, సౌందర్యాన్నీ ఆరాధించడమే తన నిసర్గ స్వభావంగా భావించాడు. అతని లేతహృదయాన్ని గిలిగింతలు పెట్టిన ఇద్దరు సౌందర్యమూర్తులు దూరంకావడంవల్ల అతనిలో పంద్రెండవ ఏటనే ప్రణయగీతాలు మొలకెత్తాయి. జీవితంలో

పాలుపంచుకొన్న 'అద్భుతవ్యక్తి' అతని స్వేచ్ఛాప్రవృత్తివల్ల అదృశ్యమయ్యింది.

2. లోకం ఆదరించకపోయినా 'స్వచ్ఛందమైన ప్రకృతి' కోసం అతడు 'లోకసామాన్యమైన బాధలూ, కోరికలూ స్పందించే' ప్రణయగీతాలు వ్రాశాడు. 'లోకంలోనివాడు' కాబోతున్నట్లు నటించాడు. కాని లోకం 'స్వేచ్ఛావిహంగం', 'కుటిలపన్నగం', 'మూఢదివాంధం' అంటూ అతనిని ఆడిపోసుకొన్నది. అతడు ఆశించిన ప్రేమసౌందర్యాలు ఇరవై ఏడేండ్లదాక ఎండమావులుగా ఉండిపోయాయి.

3. అతడు ఒకరాత్రి 'ఆకాశప్రేయసి' పై అనురాగంతో ఆడుతూ పాడుతూ ఉన్న సముద్రునిచూచి, అలాగే తానుకూడ 'త్రిభువనైక మోహిని' యైన ప్రేయసిని సృష్టించుకోవాలనే స్ఫూర్తిపొందాడు. గతజీవితంలో దర్శించిన 'సౌందర్యఖండాలనూ', 'ప్రేమ శకలాలనూ' సేకరించుకొని, 'భావార్ద్రహృదయుడు'గా, 'ప్రణయరాజరాజేశ్వరుడు' గా పునర్జన్మ పొందినట్లు పొంగిపోయాడు.

4. 'సౌందర్యైక స్వరూపిణి' దివ్యదర్శనం లభించింది. దానితో అతడు జీవితలక్ష్యం సిద్ధించిందని తలంచాడు. ఆ ప్రేయసీ, తానూ సరస్వతీబ్రహ్మలలాగ అన్యోన్యమైన అనురాగంతో శాశ్వతంగా జీవించాలని సంకల్పించాడు. ఆ 'హృదయేశ్వరి' అనుజ్ఞవల్ల ప్రతిఅణువు నుండి తన 'అమరసందేశాలు' పంపడానికి నిశ్చయించాడు.

పై అంశాలనుబట్టి (1) కృష్ణశాస్త్రి ఊర్వశీసృష్టికి ప్రకృతి ప్రేరణం, (2) అతడు ఊర్వశిని కవితారూపంలో సృష్టించి ఆరాధింప సంకల్పించడం, (3) ప్రవాసంలో అతడు చేసిన మరణోద్యోగానికి లక్ష్యం నూతనాశయంతో పునర్జన్మ పొందడం, (4) అతని ప్రణయగీతాలలో 'లోకసామాన్యమైన బాధలూ, కోరికలూ' స్పందించడం—

ఈ నాలుగు అంశాలు వ్యక్తమవుతాయి. కృష్ణశాస్త్రి ఊర్వశీ కల్పనతో —

" We dream of happy, high, mejestical,
Where is the love, beauty, and truth we seek
But in our mind ... ... ..."[5]

అని షెల్లీ చెప్పిన అంశాలూ,

" సర్వోపమాద్రవ్య సముచ్చయేన యథాప్రదేశం వినివేశితేన
సా నిర్మితా విశ్వసృజా ప్రయత్నాదేకస్థ సౌందర్య దిదృక్షయేన"[6]

అని కాళిదాసు పార్వతి దివ్యసృష్టిని గురించి చెప్పిన అంశాలూ— సంవదించడం గమనించదగి ఉంది. ఇక ఊర్వశీ కావ్యపరిశీలన చేయ వలసి ఉంది.

అన్వేషణం

"నా కఠిన పాదశిలల క్రిందఁబడి నలఁగి
పోయె నెన్నెన్నియో మల్లెపూలు మున్ను...."

ఇది ఊర్వశీ కావ్యంలో తొలిగీతం. దీనిలో కృష్ణశాస్త్రి దివ్య భావ ప్రసూనమైన ఊర్వశిని అన్వేషిస్తూ సామాన్యమైన ఎన్నో భావ ప్రసూనాలకు 'జర'గా, 'రుజ'గా, 'మృత్యువుగా' పరిణమించినట్లు వ్యంగ్యంగా తెలిపాడు. తానుకోరిన రంగు, రుచి, వాసన - ఆ ప్రసూనాలలో లేకపోవడమే అందుకు కారణం. 'అనంత సౌందర్యభావన' కోసం అతడు ఆరాట పడ్డాడు. ఈ సందర్భంలో-

" I cannot see what flowers are at my feet
Nor what soft incense hangs upon boughs"[7]

అని కీట్సు వ్యక్తంచేసిన వేదన సంవదిస్తుంది.

ప్రవాసంలో లాగే ఈ కావ్యంలోను కృష్ణశాస్త్రి నిరంతరం స్వప్నలోకసంచారిగా కనిపిస్తాడు. "తీయని వేదనకు సంకేతం

స్వప్నం.''[8] ఒక 'నిశావసానం'లో అతడు కోరుకొన్న ఊర్వశీభావం ఒక 'తార' లాగ, 'దివ్యమందార సుమం'లాగ దాసోహమంటూ దరి జేరింది. దానిలో 'మోహినీహాసమల్లీ ప్రఫుల్లరుచీ', 'శ్రీ లలిత వైజయంతీ పరిమళమూ', 'హరజటా పారిజాత లతాంత మధువూ' మేళవించాయి. ఐనా దానిని ఆదరించే అర్హత తనకు లేదని మథన పడ్డాడు.

"త్రిజగతీపతి కోటీర దివ్యరత్న, రాజినేలు వజ్రాల తురాయి వీవు।
ఏనొ పాతాళలోకంపు టిఱుకుసందు, లందు దిగద్రాక వెఱచు గాఢాంధరేఖను"

అంటూ ఊర్వశి పరతత్వస్థాయినీ, తన న్యూనత్వాన్నీ వ్యక్తం చేశాడు. ఆమె తన స్థాయికిదిగి 'పతిత' కాదనీ, ఆమె స్థాయికి ఎదిగి తాను 'పక్షి' కాలేననీ పరితపించాడు. ఈ సందర్భంలో —

"O, Great beyond, O the keen call of thy flute
I forget, I ever forget, that I have no wings
to fly that I am bound in this spot ever more"[9]

అనే రవీంద్రుని ఆవేదన గమనింపదగివుంది.

పై సందర్భంలో పౌరాణికమైన ఊర్వశికీ -ఈఊర్వశికీ, కృష్ణపక్షంలోని కవికీ- ఊర్వశిలోని కవికీ ఉండే తారతమ్యాలు పరిశీలింపదగి ఉన్నాయి. ఆధ్యాత్మికంగా ఔన్నత్యాన్ని పొందడానికి ఊహాపథాలు చాలవు; సాధన ఆవశ్యకం.

అనుబంధం

కవి అంతరంగం సూఫీసాధనానుగుణంగా పరిమితత్వాన్ని దాటి అపరిమితత్వానికి ఎదిగింది. ఊర్వశికీ తనకూ చిరంతనంగా ఉండే అనుబంధం అవగతమయ్యింది. కల్పాల తరబడి ఆమె తనకు 'వేదనా సుఖాన్ని, ప్రసాదిస్తూ, సంధ్యగా, శర్వరిగా, మంచుసోనగా ఆత్మీయమై, తన గీతాలలో ఒక 'శోకగీతి'గా ఊరట అందజేస్తున్నట్లు కవి

గ్రహించాడు. ఈ సందర్భంలో —

" Ycu are no longer before my songs but one with them"[10]

అని రవీంద్రుడు అలౌకిక ప్రేయసిని పరిగణించడం గమనించదగ్గది.

కృష్ణశాస్త్రి తన ఊర్వశీ గీతిముందు శాఫో 'అరుణారుణాంధగీతి' వెలవెలపోతున్నట్లు భావించాడు. శాఫో విరహం లౌకికమూ, కృష్ణశాస్త్రి విరహం ఆధ్యాత్మికమూ కావడం ఇందుకు ముఖ్యకారణం.

ఎన్నో జన్మలలో కవి 'కృపణజీవితాన్ని' గడిపినట్లూ, అందుకు తన 'అమవస కన్నీటిపాట' (కృష్ణపక్షం) ఫలితమైనట్లూ సూచించాడు. ఊర్వశి 'చరణకరుణామధుకణం' లభిస్తే మల్లోకాల సౌఖ్యాన్ని హస్తగతం చేసుకొని, కాలాతీతవ్యక్తిగా ప్రకాశిస్తానని ఆశించాడు. అవ్యయానందానికి ఊర్వశికరుణ సంకేతం. తన 'గీతికాంతాల' లో 'ఆరని వెలుంగు' కూర్చి, ఆమె 'శ్రీవిలాసాసికే' 'నీరాజనం'గా సమర్పింప దలచాడు. ఈ ఊర్వశీ కావ్యం 'ఊర్వశికే' అంకితం కావడం ఇక్కడ గమనించదగ్గది.

## సాక్షాత్కారం

కవి కల పండింది. అతని భావాంబరవీధిలో ఊర్వశి మెరసింది. 'కాలమే పసిపాప' గా ఉన్నతరుణంలోనే శోకాన్ని వెదజల్లుతూ తాను అవతరించి నట్లు పేర్కొన్నది. 'తొలి వియోగిని నేనె, తొలి ప్రేయసినీ నేనె, ఆనాటికేనాటికేనునీదాననే' — అని' తెలిపింది. ఈ సందర్భంలో —

" She said ' I am the first great Sorrow
Whom you met when you were young"[11]

అనే రవీంద్రుని అనుభూతి గమనించదగి ఉంది.

సృష్టిలోని సంయోగ వియోగాలూ, సుఖదుఃఖాలూ తన స్వరూపాలుగానే ఊర్వశి సూచించింది.

" హాలాహలానలమె అమృత శీతల రసమె
తోడబుట్టులు నాకు! తోడు నీడలు నాకు!"

అని వాచ్యంచేసింది. ఈ సందర్భంలో —

" You rose from the churned ocean on
the first day of the first spring, with the
cup of life in your right hand and poison in your left"[12]

అని రవీంద్రుడు ఊర్వశిని వర్ణించి ఉండడం పేర్కొనదగిఉంది.

కాలస్వరూపిణియైన ఊర్వశి 'వేల వేల యుగాలు' సుఖదుఃఖాత్మకమైన 'బరువు కానుక'ను ప్రియునికోసం సమకూర్చుకొని తెచ్చినట్లు వ్యక్తం చేసింది. ఇలాంటి సందర్భాలలో హర్షవిషాదాలు రెంటిలోను ఈశ్వర విలాసాన్ని దర్శించే సూఫీదృక్పథం సుస్పష్టమవుతుంది.

కవితాదేవతకు మారురూపమైన ఊర్వశి కవికి సంగీత మూర్తిగా భాసించడం సహజం. ఆమె పాటలు కవి హృదయంలోపారి, అతని జీవితంలో నిండిపోయాయి. ఆమె 'తేనియగొంతు' విప్పినప్పుడు ఆమె 'కపోలాలూ', 'నేత్రాలూ' కలసి పాడినట్లు తోచింది.

ఈసందర్భంలో —

" ... ... Your eyes sing with love, and
your voice ripples with laughter"[13],

" ... ... thy many tuned music is echoed from
innumerable worlds through signs and colours "[14]

అని రవీంద్రుడు క్రమంగా ఆధ్యాత్మిక ప్రేయసినీ, ఊర్వశినీ వర్ణించి ఉండడం పరిశీలింపదగింది.

" You are one half woman and one half dream "[15] —
అని రవీంద్రుడు ప్రేయసిని పేర్కొన్నట్లు ఊర్వశి కృష్ణశాస్త్రికి స్వప్నమూర్తిగాకూడ దర్శనమిచ్చింది. ఆమెలో —

"....ఏవేవో కలలు ముంగురుల జారీ, వాలి కనుబొమ్మ నునుబొమ్మవంపులందు
దూరి చూపుల, చెక్కిళ్ళజేరి మంద,మందహాసంపు మసకలో మాయము.... ".

కావడాన్ని కవి గుర్తించాడు. అమూర్తాలైన కలలు ఊర్వశి ముంగురుల నుండి చెక్కిళ్ళదాక జారి అదృశ్యం కావడంలోని భావనారామణీయకం సహృదయ హృదయంగమం. ఈ సందర్భంలో —

" స్థితాః క్షణం పక్ష్మసు తాడితాధరాః పయోధరోత్సేధ నిపాత చూర్ణితాః
వలీషు తస్యాః స్ఖలితాః ప్రపేదిరే చిరేణనాభిం ప్రథమోద బిందవః"[16]

అని కాళిదాసు తపోనిమగ్నయైన పార్వతీదేవి పైనుండి వాన చినుకులు క్రిందికి జారడాన్ని పేర్కొవడం గమనింపదగి ఉంది. పై సందర్భంలో కృష్ణశాస్త్రి పాటించిన ఔచిత్యం ప్రశంసనీయంగా ఉంది.

ఊర్వశి విశ్వసౌందర్య స్వరూపిణి. ఆమె కన్నులలో కృష్ణశాస్త్రికి అనంతాకాశంలోని 'నీలినీడలూ', నిర్మలకాసారాలలోని 'నిదుర చాయలూ', సంధ్యావసానంలో తమాలవృక్షాలలో ఉండే 'ఇరుల గుసగుసలూ', వర్షాకాలపు మేఘాలలోని 'బాష్పాలూ' దర్శన మిచ్చాయి. అనిర్వచనీయమైన భావమాధుర్యం ఆకన్నులలో ఉన్నట్లు ధ్వనింపజేస్తూ 'అర్థమ్ముకాని భావగీతమ్ములవి' అని పేర్కొన్నాడు. ఆమె కన్నులను కవిసమయాలతో కప్పివేయకుండ భావగీతాలుగా పేర్కొవడం రసవంతంగా ఉంది. ఈ సందర్భంలో —

" I remember in your dark eyes
sweeping shadows of passion
like the wings of a home seeking
bird in the dusk "[17]

" The small truth has words that are clear;
the great truth has great silence "[18]

అని రవీంద్రుడు క్రమంగా ఊర్వశి నేత్రాలనూ, దివ్యసత్య స్వభావాన్నీ పేర్కోవడం గమనార్హం.

'అనాథ బాలిక' గా కూడ ఊర్వశి దర్శనమిచ్చి కవిలో 'ధీయ దనపు వేదన' నింపింది. ఆమె నాట్యగానాలు మాని 'సిగ్గు దొంతరల' లో అణగిపోయి, తన అందాన్ని తానే చూచుకొంటూ 'వెఱఁగు చూపుల' తో చూస్తున్నట్లు కనిపించింది. ఇక్కడ ఊర్వశిలో అనాడు దాస్యశృంఖలా బద్ధమైన జాతిస్థితినీ, ఆదరణకోసమై పరితపిస్తున్న నవ్య కవితాబాలనూ కవి ధ్వనింప జేశాడని చెప్పడం సమంజసం. 'మృదుల కరుణామధుర' మైన తన హృదయాన్ని లోకం గుర్తించనందుకు కవి విచారించాడు.

ఆశయం

ఊర్వశి తన హృదయాంతరంలో 'వదలని కోరిక'గా ఉంటూ కష్టాలు మరపిస్తూ పాటలు పాడించాలని కవి కోరుకొన్నాడు. ప్రేయసి ప్రేమస్మరణతో 'కోటి గొంతుల'తో కరగిపోవాలని ఆశించాడు. ఆమె 'అనుజ్ఞ'తో పాటు 'గొంతుముడి' వీడితే 'యుగ యుగాల' కలలు పాడుతూ భూనభోంతరాలలో తన సందేశాలు నింపి, 'చిరగాఢనిద్ర' మేల్కొలుపాలని ఉబలాట పడ్డాడు. ఇక్కడ కవి అనాటి జాతి పార తంత్ర్య స్థితినీ, తన స్వేచ్ఛాప్రీతినీ వ్యక్తం చేశాడు.

'పేరాఁకలి' తో ఊర్వశి సాహచర్యంకోసం 'ముదుసలి నిరాశ' తో వసంతోదయంలో ఎదురు చూచాడు.

"నేడు నా జీవితము కూడ నిర్ఝరాంగ, నా దరస్మితమయి ప్రపంచాలు ప్రాకు!
పిలుచు నీరేడు లోకాలు ప్రేమకొఱకు, పఱపు నా హృదయంబు చరాచరములకును!"

అని ఆశిస్తూ కవి తన విశ్వప్రేమను వ్యక్తంచేశాడు. ఈ సందర్భంలో—

"From dawn till dusk I sit here before my door and
I know that of a sudden the happy moment will
arrive"[19];

"My bounds are cut, my debt was paid,
my door has been opened, I go every where"[20]

అనే రవీంద్రుని చరణాలు స్మరింపదగి ఉన్నాయి.

ఊర్వశి అనుగ్రహంవల్ల 'చెర' తొలగితే తన 'ప్రేమగీతాల' రెక్కలపై ఆమెను పవళింపజేసి 'ఊహాలోకాలకు' ఎత్తుకొని పోవాలను కొన్నాడు. ఆ భాగ్యం కలుగుతుందో లేదో అని సందేహించాడు. ఈసందర్భంలో –

"My soul is an enchanted boat
Which like a deepening swan, doth float
Upon thy silver wave of singing,
And thine doth like an angel sit"[21]

అనే కీట్సు చరణాల సామ్యం గమనింపదగ్గది.

కవి హృదయంలో 'విశ్వవీణాగళం' మ్రోగినట్లూ, భవ్యకవితావేశం కలిగినట్లూ భావించాడు. వెల్లివిరిసే 'ఆనంద తేజోంబునిధుల'ను ఆలపించడానికి ఆతురపడ్డాడు. ఊర్వశీ సాహచర్యం లభిస్తే ఇద్దరూ కలసి –

"శీతాచల శిఖరోజ్జ్వల, హిమ పీఠాగ్రమున కెగసి....
మేలుకొనిన శ్రుతులనంత, కాలమె వికసించి వినఁగ...."

కురిపించాలని పరవశించాడు. ఈ సందర్భంలోని భావరామణీయకమూ, పదప్రయోగ నైపుణ్యమూ ప్రశంసనీయంగా ఉన్నాయి.

### సాహచర్యం

ఊర్వశి సాహచర్యంకోసం కవి చిరకాలం నిరీక్షించాడు. ఒక నడి రేయి ఆ ప్రేయసి 'మూగబాధ'తో సాక్షాత్కరించింది. మహా

స్మృత భావనాజగత్తునుండి అవతరించిన ఆమె చూపులు ప్రియునిపై పడి పులకలై మొలకెత్తాయి. పరమేశ్వరుని కారుణ్యంగా కవి ఊర్వశిని ఈ సందర్భంలో సువ్యక్తం చేశాడు.

" వైకుంఠ మృదుకంఠ వైజయంతీమాల
తెగెనేమొ దిగఁజారు జగములన్నీ దాటి
సురభి సౌదామనిగ తరళమధు ధారగా
ఈశ్వరాలోకమే యిటు వెడలెనో నేడు! "

అని పారవశ్యంతో గానంచేశాడు. ఆమె 'జాలిచూపులు' సురలోకంనుండి వివిధ ప్రకృతి దృశ్యాలుగా పరిణమిస్తూ దిగివచ్చి 'వెదకి' ప్రియునిపై ప్రాలినట్లు వర్ణించడం మనోజ్ఞతమం. ఈ సందర్భంలో –

" Thy eyes looked down on my eyes and
my heart has touched thy feet"[22]

అని రవీంద్రుడు ఈశ్వరకృపను పేర్కొనడం గుర్తింప దగ్గది.

చిరవిరహంవల్ల కవికి 'నిద్దుర మరపులు' గ్రమ్మాయి. నిద్రించేటప్పుడు పిలువవద్దనీ, విడిచి పోవద్దనీ ప్రేయసిని వేడుకొన్నాడు. ఆమె 'అడుగుదోయి'ని తన 'ఎడఁద' తో బంధించాలనుకొన్నాడు.

ఈ సందర్భంలో —

" Do not go my love, without asking my leave
I have watched all night, and now my eyes are heavy
with sleep ....
' Could I but entangle your feet with my heart
and hold fast to my breast "[23]

అనే రవీంద్రుని చరణాల సంవాదం పరిశీలింపదగినుంది.

'సుషుప్తి'లో కవికి అద్భుతమైన స్వప్నానుభూతికలిగింది అందులో ప్రేయసీప్రియులు 'నిదుర పొదిగిళ్ల'లో కలసి జీవిస్తూ 'నందనవీథుల' లో

విహరింప బోయూరు. ఆనంద పారవశ్యంతో కునుకులేసే ఆవసంలో ప్రేయసి కౌగిలించింది; మల్లెపూలు దోసిటనించి 'అక్షయప్రేమ' తో చరణపూజ చేసింది; బ్రహ్మాండ రూపమైన తన మల్లెతోట చూపింది. ఈసందర్భంలో —

"…. in the field of Immortality
My spirit should at first have worshipped thine
A devine presence in a devine place"[24]

అనే షెల్లీ చరణాలు పరిశీలింపదగి ఉన్నాయి.

ప్రేయసిపూజవల్ల కవి తన 'పదములు' వాసన కోల్పోని పుష్పాలైనట్లు భావించాడు. తన జీవితం నవవసంతవృక్షంలాగ శోభాయమానమైనట్లు ఆనందాశ్రువులు నించాడు. కృష్ణశాస్త్రి స్వప్నాలలో ఇది గౌరీశంకర శిఖరం. ఈ కావ్యాంతంలో నటరాజ స్తుతిని అనుబంధంగా చేర్చడంలోని ఔచిత్యాన్ని పండితులు మెచ్చుకొన్నారు.

శివతాండవ దర్శనం

శివుడుకూడ తనలాగే 'ఉన్మత్త భావశాలి' అనీ, 'పాటపదాల' కోసం 'నిత్యపథికు'డనీ, ప్రతి పదంలోను 'శీతల మధుతుషారాలు' చిందిస్తాడనీ కవి పేర్కొనడం గమనార్హం. ఆ కవిరాజు సన్నిధిలో కవినసే మిడిసిపాటు తగదనీ, ఆ కవికోకిలకు నిత్యమూ వసంతమే అనీ వినమ్రతతో పేర్కొన్నాడు. ఈ సందర్భంలో —

" My poet's vanity died in shame before thy sight
O, Master poet I have sit down at thy feet"[25]

అనే రవీంద్రుని భావసాదృశ్యం పరిశీలింపదగ్గది.

ఇందులో కవి శివతాండవాన్ని భావగాంభీర్య భరితంగా వర్ణించాడు. స్వామి 'పాదమంజీరాలు' తన బ్రతుకులో ఒక నిమిషమైనా మ్రోగాలని కోరుకొన్నాడు. 'ఆనందరసైకజీవి' గా కవి తన్ను పేర్కొంటూ పరమేశ్వరుని దర్శనం సిద్ధించేదాక ఆటపాటలలో అతనిని అనుక

రిస్తూ 'ఎడతెగని జీవయాత్ర' సాగించడానికి నిశ్చయించుకొన్నాడు. ఈ సందర్భంలో —

" We stake our joys and sorrows
to, play his game to the end"[26]

అనే రవీంద్రుని నిర్ణయంలోని సంవాదం స్పష్టమవుతుంది.

ఈ కావ్యంలో ఊర్వశి నందనవనంలో శచికి పాదపూజ చేసినట్లు పేర్కొనడం లౌకికప్రేయసి స్వభావానికి సన్నిహితంగా ఉంది. కాని మొత్తంమీద కృష్ణశాస్త్రి సూఫీతత్వంలోని ఊహాప్రేయసి స్వభావానికి కాల్పనికరామణీయకాన్ని రంగరించి ఊర్వశిని సృష్టించాడని చెప్పడంలో సందేహం లేదు. వినూత్నంగా సూఫీ దృక్పథాన్ని ప్రవేశపెట్టడంలో ఈ కావ్యం ఆంధ్రసాహిత్యంలో విశిష్టస్థానాన్ని సముపార్జించుకొన్నది.

"ఊర్వశి కల్పనలో, ఊహలో, చిత్రీకరణలో కృష్ణశాస్త్రి గారి ప్రతిభ అనితరసాధ్యమైనది, నాన్యతో దర్శనీయమైనది"[27]. ఆంధ్రుల మనఃపీఠాలపై అతిలోక కళాసౌందర్యరాశిగా ఊర్వశిని చిరస్థాయిగా అధిష్ఠింపజేయడంలో కృష్ణశాస్త్రి ప్రతిభ చరితార్థమయ్యింది.

ఈ కావ్యాన్నిబట్టి కృష్ణశాస్త్రి ముఖ్యంగా మూడు కవితాలక్ష్యాలను ప్రతిపాదించినట్లు వ్యక్తమవుతుంది. 1. 'యుగయుగంబుల కలలు' పాడడం, 2. అనంతమైన కాలం వినే విధంగా 'మేలుకొనిన శ్రుతులు' పాడడం, 3. పరమేశ్వరుని సాన్నిధ్యాన్ని కోరుతూ ఆటపాటలతో వినయంగా అతనిని అనుకరించడం – అంటే సార్వకాలికమైన దృష్టితో విశ్వశ్రేయోదాయకంగా ఆధ్యాత్మికచింతనతో కవిత్వం వ్రాయడానికి కృష్ణశాస్త్రి నిశ్చయించుకొన్నాడని స్పష్టమవుతుంది. ఇవి ఆదర్శ కవితాలక్ష్యాలని చెప్పడం నిర్వివాదం. దీనిలోని గీతాలను గురించి —

" Urvas ... contains some of the finest lyrics ever written in Telugu"[28]

అని పాలగుమ్మి పద్మరాజుగారు ప్రశంసించడంలో అతిశయోక్తి లేదు.

## పల్లకీమహత్వం

పల్లకీసంపుటి కృష్ణశాస్త్రి కవితకు విరాట్స్వరూపం. భావకవిగా ప్రసిద్ధుడైన కృష్ణశాస్త్రిలోని పరిణతమైన ప్రతిభాసంపదకూ, బహుముఖమైన ప్రజ్ఞకూ ఇది నిదర్శనం. నవ్యాంధ్ర కవిత్వంలోని అన్ని శాఖలకూ సంబంధించిన గీతాలు దీనిలో చోటుచేసుకోవడం విశేషం. సార్వకాలిక దృష్టితో విశ్వశ్రేయోదాయకంగా ఆధ్యాత్మిక చింతనతో కవిత్వం వ్రాయాలని ఊర్వశిలో కృష్ణశాస్త్రి కన్నకలలు దీనిలో మనోహరంగా రూపుదాల్చాయి. ఇందులోని గీతాలు 1. ప్రకృతి కవిత్వం, 2. ప్రణయ కవిత్వం, 3. భక్తి కవిత్వం, 4. స్మృతికవిత్వం, 5. సంఘసంస్కరణ కవిత్వం, 6. దేశభక్తి కవిత్వం, 7. స్తుతికవిత్వం, 8. అభ్యుదయభావకవిత్వం, 9. ఆత్మీయచిత్రణం - అనే వర్గాలుగా విభజింపదగి ఉన్నాయి.

**1**

### వసంత గానం

"ఓహో వసంతా" అంటూ ఋతురాజుకు స్వాగతం చెప్తూ కవి, పువ్వులు, కోయిల, వేణువు, తుమ్మెద, గాలి—పాట పాడడమూ, వసంతుడుకూడ వారితో గొంతు కలుపడమూ మనోహరంగా చిత్రింప బడింది. ఇది ఒక చిన్న సంగీతరూపకం, దీనిలో 'రేగుకోర్కెలగుత్తి' గా కవి గుండెనూ, 'ఊహలతోట' గా అతని హృదయాన్నీ, 'మ్రోగు పాటల పేటి' గా అతని కంఠాన్నీ, వేణువులో భక్తిపారవశ్యాన్నీ, కోయిలలో గానమాధుర్యాన్నీ పేర్కొని, తుమ్మెదలో 'భావనాకాశ విహారాన్నీ', గాలిలో ఊహాపథాల సొగసునూ సహజసుందరంగా భావనామాధుర్య పూరితంగా పేర్కొవడం ప్రశంసనీయం. వసంతుని చిత్రణం హృదయంగమం.

"మధుర మధుర మధుమైరేయము మా
మరుగుచెదలలో దాగెనులే .... ...."

అనే పూలపాటలో కృష్ణశాస్త్రి గీతికా పుష్పమకరందం చిందులాడింది. దీనిలో ప్రతి అంశలోను కవి ఆత్మీయత తొంగిచూస్తుంది.

**2**

నిశ్వాసం

"అనుకోని అతిథి" గా ఒక 'అచ్చర' కవి జీవితంలో అడుగుపెట్టి అదృశ్యమైన విషయం కరుణరసప్లావితంగా వర్ణింప బడింది. కవి ఒడిలో ఆమె సగం నిజమైన 'స్వప్నాలు' పోసి, 'హిమ పదాంకాలు' మిగిలించి వెళ్ళిన విషయాన్ని చిత్రించడంలోని భావనాపటిమ మనోజ్ఞం.

కలవరింతలు మిగిలించి వెళ్ళిపోయిన ప్రేయసికోసం కవి వెర్రిగా విలపించడమూ, నీ ప్రేయసి 'స్వర్గామృతనందనప్రసవం' గా మారిందని లోకం ఎగతాళిచేయడమూ స్వాభావికంగా చిత్రింపబడింది. కవికి దుఃఖం "బ్రతుకంత పర్వగా" 'ప్రేయసిపోయగమ్మునకు లేదుశరీరము, లేదు నా తీయని వేదనకేని. కలదే యెడబాటిక మాకు?' అని అతడు తలంచడంలో అలౌకిక ప్రేమ స్ఫురిస్తుంది.

దివికేగిన ప్రేయసి "నీలిదారాలు" ద్వారా 'తారాలతాంతాల' ను మాలకూర్చి ప్రియునికోసం ఎదురు చూస్తున్నట్లు వర్ణించబడింది. ఇక్కడ-ఒక బాలిక దీపం పట్టుకొని మేడమెట్లనుండి పడిపోయిన అంశాన్ని ప్రస్తావిస్తూ " I looked at the sky and it seemed that a child of walking there treasuring many lamps behind her veils"[1] అనే రవీంద్రుని కథనం గమనింపదగ్గది.

ఈవిభాగంలోని మూడు ఖండికలలోను కృష్ణపక్ష, ప్రవాసాల నాటి తుదిజల్లులు కనిపిస్తాయి.

ఇహపరాలు

"ఉమర్ ఖయామ్" తత్త్వంలో సూఫీలలోని ప్రణయారాధనతో పాటు కొంత భిన్నత్వంకూడ చోటు చేసుకొన్నది. సుఖానుభవం

మూలంగానే భగవంతుని చేరుకోవచ్చు - అనే నమ్మకం ఖయ్యాంకుంది. 'సిపా', 'ఖుషీ' రెండూ మహారాజపదవికన్న మిన్నగా అతడు భావించడం ఈఖండికలో స్పష్టంచేయబడింది. ఇది 'అతిథిశాల' నాటికలోని పద్య భాగం.

ఉమర్ ఖయామ్ తత్వానికి అనుగుణంగానే మధు ప్రశంసతో "హాఫిజ్" సాగింది. ఆసవానికితోడు 'అరుణాధరాస్వాదనం' అవసర మని వ్యక్తంచేయబడింది. ఈ తత్వంలో 'సాఖి' పరమాత్మకూ, 'పాన పాత్ర' జీవాత్మకూ, 'అంగన - ఆసవం' ఆనందానికీ ప్రతీకలు.

3

అనుభూతి

"పల్లకీ" ఆధ్యాత్మిక భావ కుసుమాలతో నిండింది. అందుకే ఇది ఈ సంపుటికి 'తిలకం' అయ్యింది. ఇది వ్యంగ్యార్థ ప్రధానం. 'పల్లకీ' భగవదనుగ్రహానికీ, కృష్ణశాస్త్రి కవితకూ సంకేతం. దానిని పంపిన 'ప్రాణసఖుడు' పరమాత్మకు మారుపేరు. కవికి కలిగిన 'కాల్చేహాయీ', 'తేల్చే భారమూ' ఆధ్యాత్మిక విరహానికి సంకేతాలు. పల్లకీపరంగా ప్రయుక్తమైన 'ప్రణయవల్లకి', 'ప్రసవభరవసంతవల్లిక', 'శక్రచాప వక్రరేఖ', 'మధుస్వప్నశాఖ' - ఇవి కృష్ణశాస్త్రి కవితకు చక్కని భావ చిత్రాలు. కవితాతపస్సు సాధనంగా భగవంతుని చేరుకొంటాననే విశ్వాసాన్ని కవి దీనిలో ధ్వనింపజేశాడు.

అభ్యర్థనం

పరమాత్ముని పాదాలను అందుకోవాలనే తన తపననూ, పరమా త్ముని దీన జనావనత్వాన్నీ స్పష్టంచేస్తూ "అందవోయినాకు" అంటూ అభ్యర్థిస్తూ, స్వామి 'మంగళాహ్వానం' కోసం ఎదురుతెన్నులు చూచే కవి హృదయ స్పందన వ్యక్తంచేయబడింది.

## సుకృతం

పిఠాపురం కుంతీమాధవస్వామికి 'నాకనందన హరిచందనముల కన్న' ప్రీతిపాత్రాలై, ఆ స్వామి కైంకర్యంకోసమే ఆరుకాలాలుపూచే "తిరునాళ్ల చేమంతులు" చేసుకొన్న సుకృతాన్నీ, వాటి సౌకుమార్యాన్నీ కృష్ణశాస్త్రి మనోహరంగా కీర్తించాడు. దీనిలో కవిలోని భక్తిభావానికి అతని పిఠాపురాభిమానం సాహచర్యం నెరపింది.

## అహ్నికం

"నిగమశర్మ" యైన కుక్కుటేశ్వరస్వామి 'తొలికోడి' యై ప్రబోధించి, తాండవనృత్యం చేయడాన్ని భావనామాధుర్యం వర్తింపజేస్తూ కవి గానంచేశాడు. ఇది ఊర్వశీకావ్యాంతంలోని శివతాండవానికి పైమెట్టు. శివుడు 'గయాసుర నిరాసన తీవ్రత కోడి కోడి' కావడాన్నీ, దుంఠి 'తుండాగ్రమున స్వర్గభాండమెత్తి' కోవెలతోటకు నీరు పోయడాన్నీ, నంది గర్వంతో గంగడోలు సారించడాన్నీ కవి చమత్కారభరితంగా పేర్కొన్నాడు.

## పరివర్తనం

అనుక్షణం ప్రేయసి నేత్రసౌందర్యాన్ని ఆరాధించే "ధనుర్దాసు", యతిరాజుకృపవల్ల సాక్షాత్కరించిన దివ్యనేత్రాలకు దాసుడైన అంశాన్నీ, శ్రీరంగనాథుని మాహాత్మ్యాన్నీ ఆధ్యాత్మిక భావసమన్వితంగా కవి వర్ణించాడు. ఇది 'ధనుర్దాసు' నాటికలోని పద్యభాగం.

## పారవశ్యం

"మల్హణుడు" ప్రేయసియైన మల్హణిప్రేరణవల్ల తనహృదయాన్ని శివునికి పునరంకితంచేస్తూ ప్రదర్శించిన పారవశ్యాన్ని కన్నులకుగట్టినట్లు కవి చిత్రించాడు. సాయుజ్యంకోసం సతమతమయ్యే భక్తుని మనోధర్మం

దీనిలో చక్కగా వ్యక్తీకరింపబడింది. ఇది 'సాయుజ్యం' నాటికలోని పద్యభాగం.

ఈ విభాగంలోని గీతాలలో కనిపించే శివకేశవ భక్తితత్త్వాలలో కృష్ణశాస్త్రి భక్తిక్షేత్రంలో వటవృక్షంగా వ్యాపించిన మధుర భక్తి భావమే అత్యున్నతస్థానాన్ని అలంకరించింది.

## 4

### జాతిపిత

జాతిపిత అస్తమయంవల్ల నాటి నలభైకోట్ల భారతీయుల గుండెలలో నిండిన విషాదశ్రుతులు రాశీభవించి కృష్ణశాస్త్రి కవితాపల్లకిలో వెల్లివిరిశాయి. సర్వధర్మమూర్తియై 'మనుగడనే మతం'గా కలిగిన ఆ 'కన్నతండ్రి'ని అర్థం చేసుకోలేకపోయిన 'మొరకు' వ్యంగ్యంగా విమర్శించబడ్డాడు. మహాత్ముని నిష్క్రమణంవల్ల నట్టింటిలోని దీపం ఆరిపోయినట్లుగా, ప్రళయం చుట్టుముట్టినట్లుగా భావిస్తూ "ఏమిమిగిలె" నంటూ దుఃఖించాడు. ఇది ఆంధ్ర సాహిత్యంలో అగ్రశ్రేణికి చెందిన స్మృతిగీతాలలో ఒకటి.

భారతీయుల శాంతికీ, ఔన్నత్యానికీ "తుషారాద్రి" సంకేతం. అది కల్లోలతరబడి నిద్రిస్తూ ఒక ఉషఃకాలంలో మేల్కొని, ఊరకే 'పేదకీటకాలు' పెనగులాడడం చూచి బాధతో కన్నీరు కార్చి, మరల 'హేమంతయుగాంత నిద్ర'లో మునిగినట్లూ, దానిని చూచి 'ఈ రేడులోకాలు' - 'ఇది ప్రళయం' అంటూ వాపోయినట్లూ కవి వర్ణించాడు. స్వాతంత్ర్యసిద్ధితో కన్నులు విప్పిన శాంతి ప్రజల అంతఃకలహాల ఫలితంగా గాంధి అస్తమించడాన్ని చూచి మరల కన్నులు మూసుకొన్నట్లు కవి ధ్వనింపజేశాడు. "మబ్బు - మలా" క్రమంగా త్యాగానికీ, శాంతికీ మారుపేర్లు. గాంధిలాంటివారి త్యాగానికి కఠినాత్ముల హృదయం కరగదనే సత్యాన్నికూడ కవి వ్యంగ్యంగా తెలిపాడు.

"మహాత్ముడు" 'సగముబట్టలేని సామాన్యుడు' గా, 'ఫకీరు' గా దర్శనమిస్తూ పురుగులాంటి భారతీయులకు విశ్వమానవజగత్తులో స్థానాన్ని కల్పించడాన్ని ప్రస్తావిస్తూ, కులమత స్వార్థలోభాలవల్ల దేశం బూడిద అవుతుందని హెచ్చరిస్తూ, గత వైభవాన్ని స్మరిస్తూ దుఃఖించడానికంటె 'గడచిచన్న గాంధి గట్టిపునాది' గా 'క్రొత్త జాతి'ని కట్టుకోవాలని కృష్ణశాస్త్రి మహనీయమైన సందేశమిచ్చాడు. అంతేకాక ప్రజలంతా 'చల్లని కుటుంబం' గా ఉంటే మన దేశమూ, మనజాతీ, మననీతీ ఉండేవరకు గాంధి మనతో ఉండిలీరుతాడని కూడ ప్రబోధించాడు. గురజాడ 'దేశభక్తి' ప్రభావం ఈ గీతంపై పుష్కలంగా కనిపిస్తుంది. అమరజీవియైన గాంధీమహాత్ముని స్మృతిలో స్తుతిగీతి స్వభావంకూడ కొంత ఉంది.

మానవతానేత

"రాజా రామమోహనరాయ్" ఔన్నత్యాన్ని హిమాలయంతోను, అతని విశ్వమానవ ప్రేమను గంగాయమునలతోను పోలుస్తూ కృష్ణశాస్త్రి వ్రాసిన మధురస్మృతి గీతం ముక్తకవాఙ్మయంలో ఒక ఆణిముత్యం.

ఈ విభాగంలో నవభారత నిర్మాణానికి మూలపురుషులైన గాంధీ, రామమోహనులపై కృష్ణశాస్త్రికి గల భక్తి ప్రపత్తులేకాక, అతని విశ్వకల్యాణ దృష్టికూడ స్పష్టమవుతుంది.

**5**

జీవితభారం

"హాలికుడు" 'వేలశతాబ్దుల వ్రేగువల్ల వంగి' భూమాతపైనే, ఆశపెట్టుకొని కాలగమనాన్ని గమనించకుండ మొగంలో 'శూన్యాన్నీ' భుజంపై 'విషాదాంత నాటకాన్నీ' ప్రదర్శిస్తూ దుఃఖించలేక, సంతోషించ

లేక భ్రంగిపోవడాన్ని వాస్తవికత ఉట్టిపడేవిధంగా కృష్ణశాస్త్రి చిత్రించాడు. 'ఆభగవంతునకిదా మనమర్పించుకునే ఉపద?' అంటూ పాలకులనూ, శ్రీమంతులనూ ప్రశ్నించాడు. ఇది 'The Man with the Hoe' అనే Edwin Markham రచనకు అనుసరణమైనా మౌలికరచన లాగే భాసిస్తుంది.

## కృపావృష్టి

మూడేండ్ల కరవులో మాడిపోయిన గ్రామీణులు బుద్ధుని మునరుకొన్నప్పుడు 'ఈ జనమ్ములో క్షామము నెవ్వరేన్ తరుమజాలుదురా?' అని స్వామిశిష్యుడు వినిపించిన ప్రశ్నకు 'కృపాదరిద్రు' లైన ధనికులు మొగాలు తేలవేయగా సుప్రియ అనే పేదపిల్ల స్వామికన్నీటితో 'అక్షయభాండ' మైన తన జోలెను సమర్పించడాన్నీ, స్వామి కన్నులు చెమ్మగిల్లడంతో అన్నివైపుల వానకురియడాన్నీ కృష్ణశాస్త్రి అద్భుతావహంగా వర్ణించాడు. లోకానికి ఆదర్శప్రాయమైన సుప్రియ శీలాన్నీ, స్వామి కృపావృష్టినీ కవి రమ్యాతిరమ్యంగా రూపొందించాడు. ఈ "సుప్రియ: బుద్ధభగవానుడు" కృష్ణశాస్త్రి ఆఖ్యానరీతికి చక్కని దృష్టాంతం.

దీనికి రవీంద్రుని రచన మూలం[2]. అందులో బుద్ధుని ప్రేరణతో శ్రావస్తి గ్రామంలోని క్షామబాధితులను తన జోలెతో ఆదుకోవడానికి సుప్రియ సంకల్పిస్తుంది. ఆకథనాన్ని కృష్ణశాస్త్రి సంగ్రహించడమే కాక కమనీయమైన కల్పనలతో సర్వాంగసుందరంగా తీర్చిదిద్దాడు.

ఈ విభాగంలో కర్షకాభ్యుదయమే లోకాభ్యుదయానికి వెన్నెముక అవుతుందనీ, వ్యక్తిశ్రేయస్సుకంటె సంఘశ్రేయస్సు ధ్యేయంగా ఉన్నప్పుడే దైవకృపతోడవుతుందనీ సంస్కరణాత్మకమైన కృష్ణశాస్త్రి సందేశం వ్యక్తమవుతుంది.

## 6

### శుభోదయం

పరతంత్ర భారతదేశాన్ని ధూళీ, బూజూ, ఇరులూ నిండిన 'పురాణదివాణం' గా కృష్ణశాస్త్రి భావించాడు. స్వాతంత్ర్య దేవతను ''మాఅమ్మ'' అని పరిగణిస్తూ, ఆమెరాకతో ముసిరిన చీకట్లు చెదరి పోవడాన్నీ, వాత్సల్యంతో ఆమె ఒకచేత 'నెనరుపాలకడలి'నీ, మరొక చేత 'అభయముద్ర' నూ ధరించి అవతరించడాన్నీ వ్యంగ్య వైభవంతో వర్ణించాడు.

"ఆగష్టు 15" కృష్ణశాస్త్రి హృదయంలో పొంగిన ఆశలకూ, ఆశయాలకూ చక్కని వాగ్దర్పణం. దేశం 'దుష్టధవళభుజంగదష్ట' మైన తరుణంలో సమరనేతగా మహాత్ముడూ, సాహిత్యనేతగా రవీంద్రుడూ నిర్వహించిన పాత్రను మనోహరంగా చిత్రించాడు. క్రమంగా 'నిర్భయ మురళి'నీ, 'తరుణకాహళి' నీ ప్రయోగించిన వారిద్దరినీ లోకం జీవన్ముక్తులుగా స్తుతించడాన్ని పేర్కొంటూ దేశభవితవ్యాన్ని గురించి 'వెరపు' ను కూడ వ్యక్తంచేశాడు. ప్రజలలోని ద్రోహచింతనకూ, కవులలోని నిరుత్సాహానికీ కారణం మన 'మన్ను మిన్నుల'లోనే ఉందని చింతించాడు. తనలో గాంధీ, రవీంద్రుడూ ఆవహిస్తే 'ఎగుడుదిగుడులులేని సొగసైన వీడు' నిర్మిస్తానని చాటిచెప్పాడు. "రేడియో" కావేరినుండి కాశ్మీరందాక భారతీయులలో భావసమైక్యాన్ని ప్రతిష్ఠిస్తుందని ఆశించాడు.

### తెనుగు స్వర్గం

కృష్ణశాస్త్రి దృష్టిలో తెనుగుదేశం స్వర్గమే. "విజయవాడ గగనవాణి" లో గొంతువిప్పిన తెనుగుకవి పలుకులను పంపా బుసి కుల్యలమధ్య ఉండే 'స్వర్గం'లోని 'నా ముక్కోటి యనుగు తెనుగులు' వినాలని ఆశించాడు. ఆ పలుకులను 'సామంతులూ, మంత్రులూ'

కాక 'నా గుండె నిలుకట్టుకున్నవారు' - సామాన్యులు కూడ వినాలని కోరాడు. ఆ పలుకులలో 'మంచిగతమున కొంచెమేననీ, ఇక మంచి మంచి వార్తలు' వస్తాయనీ తెలుపాలని కోరుకొన్నాడు. ఈపలుకులపై

"ఆకులందున అణగి మణగీ, కవితకోయిల పలుకవలెనోయ్
పలుకులను విని దేశమందభి, మానములు మొలకెత్తవలెనోయ్"[3]

అనే గురజాడ పలుకుల ప్రభావం స్పష్టంగా కనిపిస్తుంది, 'మంచిగత మున కొంచెమే' నన్నది గురజాడదే.

ఈ విభాగంలో కృష్ణశాస్త్రికిగల అతివేలమైన దేశాభి మానమూ ఆంధ్రాభిమానమూ ద్యోతక మవుతాయి. గాంధీరవీంద్రుల అడుగుజాడలలో భారతీయులూ, ఆంధ్రులూ సమతా మమతా బంధా లతో అభ్యుదయాన్ని అందుకోవాలనే కవి మహదాశయం సువ్యక్త మవుతుంది.

## 7

### బ్రహ్మర్షి

ఆదర్శదేశికుడుగా నవయుగ వైతాళికులలో ఒకడైన బ్రహ్మర్షి గొప్పదనాన్ని కృష్ణశాస్త్రి రసవత్తరంగా గానంచేశాడు. ఆ "గురుదేవుడు" దేశభక్తులను సృష్టించిన 'రాజరాజేశ్వరుడు'గా మాత్రమేకాక వైదిక విజ్ఞానం, బుద్ధుని విశ్వకారుణ్యం, ఏసుక్రీస్తు త్యాగం, సూఫీ సాధకులదీక్ష - ఇవి అన్నీ కలసిన 'విశ్వవిశాల దేవా లయం'గాను, అతని శరీరం నిష్కామకర్మ పరతంత్రమైన 'కురుక్షేత్రం' గాను, అతని హృదయం 'బృందావనం'గాను. అతని మనసు 'ప్రయాగ' గాను, అతడు స్వర్గ పాతాళాలకు ముడివేసే 'వారణాసి'గాను కవి కీర్తించాడు. ఈ స్తుతిలోని ప్రతిపద్యమూ ఒక అనర్ఘరత్నమే. అందులో ఈ 'జడజీవితమ్ము పలికించితి, వీయఘు పంకమునందు నంభో జము మొల్వజేసితి, వపూర్వము నీదయ...' అనే పద్యం దీనికి హృద

యం. మనోజ్ఞ మనోజ్ఞమైన ఈ రచనద్వారా కృష్ణశాస్త్రి విశ్వదేశిక వర్గంలో బ్రహ్మర్షికి గల అమూల్యమైన స్థానాన్ని ఆవిష్కరించాడు. అంతేకాక "బ్రహ్మర్షి మాటలు" 'అమృతాల యూటలు'గా అనువదింపబడి ఉండడం మరొక విశేషం.

## విశ్వకవి

కృష్ణశాస్త్రి 'రవ్వంత కోయిల'గా ఉంటూ 'అల్పాల్పగీతులు' ఆలపించేటప్పుడు అతని హృదయంలో 'నవరసధాని'యైన రవీంద్రుని వాణి ప్రవేశించి వినీత స్వభావునిగా మార్చిన అంశాన్ని పేర్కొంటూ, ఆ 'కవిపురందరు' ని "చరణసన్నిధిని" తన భక్తిగీతాంజలి సమర్పించాడు.

ఉత్తమజీవిత మార్గాన్ని నిర్దేశించిన బ్రహ్మర్షీ, ఉత్తమ కవితా మార్గాన్ని ప్రదర్శించిన రవీంద్రుడూ కృష్ణశాస్త్రి హృదయాన్ని ఎంతగా చూరగొన్నారో ఈ స్తుతిగీతాలలో స్పష్టమవుతుంది.

# 8

## సర్వోదయం

"యువగీతం"లో కృష్ణశాస్త్రి 'మందికృతమహాయుగం' అంటూ, భూతకాలాన్ని నిరసిస్తూ, ఉజ్వల భవిష్యత్తును ఆహ్వానించాడు. నిరంతరమైన 'కృతమహాయుగం' కోసం కలలుగన్నాడు. 'అంటుదు పురుగు' లాంటి అవినీతివల్ల సంఘవిద్రోహక శక్తులు తలఎత్తి తద్వారా 'ఆటం బాంబు' లాంటి అనర్థాలు పైబడతాయని హెచ్చరిస్తూ "అయ్యో మనిషీ" ఒక 'మ్రోడు'కు ఉండే విశ్వప్రేమ నీకు లేదే! అంటూ బాధపడ్డాడు.

యువశక్తి జాగృతమై నిర్దయగా అవినీతిరాత్రిని అంతరింపజేయాలనీ, "అప్పుడుగాని అరుణోదయం కాదు" అనీ కృష్ణశాస్త్రిప్రబోధించాడు.

'నరకభవన' మైన లోకంపై ఆగ్రహావేశాలు పెరిగి పురుగు-నరుడై - అమరుడై - మహామానవుడై "నవ్యశక్తి" తో 'నవమంగళ యుగం' స్థాపిస్తాడనీ, అప్పుడే 'సమసౌఖ్యమూ', 'సమృద్ధి' సిద్ధిస్తాయనీ, అలాంటి దివ్యశక్తి లోకాన్ని అనుశాసించాలనీ కోరుకొన్నాడు.

దుర్బలహస్తంనుండి జారిన "జీవనశంఖం" ఏదో ఒక అదృశ్యశక్తి ప్రేరణతో గొంతువిప్పగానే 'ఉదయారుణ శంఖం' లోకాన్ని ప్రబోధించి కర్తవ్యాన్ని బోధిస్తుందనీ, అప్పుడు మానవుడు 'మహావీర శంఖాన్ని' పూరించి, చివరికి 'శాంతమంగళశంఖం' పూరిస్తాడనీ కవి పేర్కొన్నాడు. ఇందులోని శంఖాలు విప్లవానికి సంకేతాలు. వాటి పరమలక్ష్యం శాంతి స్థాపనమే. ఇది రవీంద్రుని రచనకు కొంతవరకు అనుసరణం[4]

ఈవిభాగంలోని గీతాలలో కృష్ణశాస్త్రిలోని సర్వతోముఖమైన సాంఘికాభ్యుదయ దృష్టితోపాటు శాంతిస్థాపనోన్ముఖమైన విప్లవదృష్టి కూడ సుస్పష్టమవుతుంది.

9

సౌభ్రాత్రం

కృష్ణశాస్త్రికి చిన్నతనంనుండి లోకమంతా తిరిగి, ప్రతి హృదయ ద్వారాన్నీతట్టి "స్నేహ క్షీరము" కురిపించి, 'అనుగు సోదర! మరలి రానా!' అంటూ సాగిపోయే 'చిరపథికుడు' కావాలనీ, హిమాలయం పైనుండి సేతువుదాక 'గళకాహళి' పూరించి 'విద్వేష వైతరణికి సౌహార్దసేతువు' నిర్మించాలనీ కోరిక ఉండినట్లు తెలిపాడు తీయని కలలు నెమరువేసుకొంటూ ప్రతి "ఉగాది"కీ స్వాగతంచెప్పే మానవునికి భవిష్యత్తు 'బంగారు పంట' కావాలని కోరుకొన్నాడు.

ఆహ్వానం

కవి తన కళత్రమైన "స్త్రీ"ని 'దరహాస పారిజాతాలు' చల్లుతూ 'సమరం'లో తగిలిన 'గాయాల నెత్తురుచాళ్లు' కడగడానికోసం, 'దీపం'

వెలిగించడానికోసం తన జీవిత ప్రాంగణంలోనికి ఆహ్వానించాడు. దీనిని స్వాతంత్ర్యదేవతకు స్వాగతగీతంగాకూడ అన్వయించుకోవచ్చు. ఇది రవీంద్రుని రచనకు కొంతవరకు అనుసరణం[5]. ఒక "సంక్రాంతి" నాడు కోరియారణం, మలయాళ్ర్వణం వరదలు వరపులు - ఇలాంటి గగనవాణి వార్తలు వినీ వినీ చింతించే కవిని ఇల్లాలు లోకంలోనికి ఆహ్వానిస్తుంది. ఆమె సంక్రాంతిలక్ష్మిగానే అతనిని ఆకర్షిస్తుంది. ఈసందర్భంలో కవి పిల్లలిద్దరూ కనిపిస్తారు.

## సాదృశ్యం

పిఠాపురం రాజా కళాశాల ఆవరణంలోని నల్లమామిడి చెట్టుకూ తనకూ కవి అభేదం ఊహించాడు. ఇద్దరికీ ఆ కళాశాల 'చెరసాల'గా భావించాడు. ఆ చెట్టు కోటి ఆకులు కదలి తనలాగే పాడినట్లు భావించాడు. దానిని "అశోకము" అని పేర్కొన్నాడు. ఆ చెట్టు పాటలో యుగ యుగాల భారత యువ హృదయాలలోని 'నెత్తురు చాలునూ', 'సీతా వియోగ హృదయాన్ని', 'ప్రాచేతసోచ్ఛ్వసితినీ' గుర్తించాడు. తన కవిత్వంలో ఆ గుణాలు ఉన్నాయని కవి అంతర్యం.

## పరిణామం

కృష్ణశాస్త్రి "భావ కవి" దశనుండి తనలో వచ్చిన పరిణామాన్ని చక్కగా వ్యక్తీకరించాడు. తలవని తలంపుగా తనకు వచ్చిన "గొంతు చీకటి"ని కరుణరస స్ఫోరకంగా పేర్కొన్నాడు. "మాట - మానమూ" ఈ రెంటికీ ఉండే సంబంధాన్ని అనుభవ పూర్వకంగా వ్యాఖ్యానించాడు. మానం ప్రకృతి అనీ, మాట వికృతి అనీ చెప్పడం గమనింప దగ్గది.

జీవితంలో ఎన్ని కష్ట నష్టాలు సంభవించినా కవి "నాకు జర లేనిదా యౌవనమ్ము నిమ్ము" అంటూ భగవంతుని ప్రార్థించాడు.

అందుకు కారణం 'దూర దూరాల నీహార తుంగ శృంగం' పిలుస్తుం దని చెప్పాడు. ఇక్కడ అనంతమైన జ్ఞానరాశికి 'నీహార తుంగ శృంగం' సంకేతం. జ్ఞాన జగత్తులో తీర్థయాత్ర సాగించడానికే కృష్ణశాస్త్రి జర లేని యౌవనాన్ని కోరాడు. దీనిలో అతని తీరని జ్ఞాన దాహం వ్యక్త మవుతుంది. ఈ విషయంలో —

> "Knowledge is precious to us, because
> we shall never have time to complete it."[6]

అనే రవీంద్రుని మాటలు గమనింపదగి ఉన్నాయి. ఈ విభాగంలో కృష్ణశాస్త్రి ఆత్మీయ చిత్రణం రసవంతంగా ఉంది.

కృష్ణశాస్త్రి కవితోద్యాన వాటిలో వివిధ ఋతువులలో పూచిన పుష్పాల పేటి ఈ పల్లకీ సంపుటి. దీనిలో రసజ్ఞ సార్వభౌములు మొదలు సర్వసామాన్యులదాక అందుకొని ఆస్వాదింప దగ్గ దివ్యమందారాలూ, మల్లెలూ, మొల్లలూ ఉన్నాయి. ఊర్వశి సాంగత్యంతో కృష్ణశాస్త్రి గానం చేయాలని కోరుకొన్న 'యుగ యుగంబుల కలలూ', 'మేలు కొనిన శ్రుతులూ' ఈ సంపుటిలో గొంతు విప్పాయి. కృష్ణశాస్త్రి వ్యక్తిత్వ వికాసానికీ, అతని కవితా రీతులకూ ప్రాతినిధ్యం వహించే ఈ సంపుటి మహాత్వం ప్రశంసనీయం.



# ఋగ్వేధి ఋబుత్వం

బ్రహ్మర్షి రఘుపతి వెంకటరత్నం నాయుడు ఆంగ్ల సూక్తులకు కృష్ణశాస్త్రి చేసిన పద్యానువాదం ఋగ్వేధి. ఈ రచన 'శిరీషకుసుమ పేశల సుధామయోక్తుల' తో సాగింది. ఇందులోని చాలభాగం 'బ్రహ్మర్షిమాట' అనే మకుటంతో తేటగీతిలోను, కొంత భాగం మకుటంలేకుండ మంజరీద్విపదలోను నడచింది. ఈ సూక్తులలో విస్తారమైన బ్రహ్మర్షిజ్ఞానసంపత్తి, అతని మానవతా దృక్పథమూ వ్యక్తమవుతాయి. ఇందులోని విషయాన్ని సమీక్షించిన తరువాత అనువాద విధానాన్ని పరిశీలించడం యుక్తం.

ఋగ్వేధిలో భగవంతుడు, మానవుడు, ఆస్తిక్యం, మతం - ఇవి ప్రధానమైన అంశాలు. బ్రహ్మర్షి దృష్టిలో భగవంతుడు ఒకడే. పతితపావనుడైన ఆ జగన్నాటక సూత్రధారి అదృశ్యుడుగానే ఉంటాడు. అతడు నరకంలోసైతం ఉంటాడు మానవుల ఆర్తి హాలాహలాన్ని హరించే ఆశివంకరుని చేరుకోవడానికి ప్రార్థన రాచబాట. స్వామి సేవకు జీవితాన్ని సమర్పించడమే ఆరాధన.

ప్రభువుపై విశ్వాసమేమతం. మతానికి బలం నీతి. నీతికి ప్రేమ తలవంచుతుంది. ప్రేమ శాసనమే జీవిని నడిపిస్తుంది. లోకయాత్రకు విశ్వాసం ఆలంబనం. భక్తి విశ్వాసాలు ముక్తికి సోపానాలు. 'నీవు నేనె' అని భావించడమే ముక్తి. స్వర్గ నరకాలు ఆంతరంగిక స్థితులు. బాధ్యతా నిర్వహణమే ధర్మం.

సృష్టి ఈశ్వరమయం. అంతకంతకు సృష్టిలో అందం పెరుగుతుంది. ఈ ప్రపంచం మాయకాదు. మానవుడు రక్తమాంసాదుల విగ్రహమే కాదు; ఆలోచన, ఆచరణ కలవాడు. అతడు 'వేలకల్పాల కర్మ ఫల

మహాభాగ్యరాశికి భాజనుండు'. ఈలోకంలో అమృతశాంతిని అన్వేషించే బాటసారి. పరుల సుఖదుఃఖాలు తనవిగా భావించేవాడే భాగవతుడు. 'అంతరాళ పునరవేక్షణ'మే తీర్థయాత్ర. స్వార్థరాహిత్యమే సన్యాసం.

అహంకార త్యాగమూ, ప్రకృతిని 'ఈశ్వరప్రబంధం'గా గ్రహించడమూ, ప్రతికావ్యంలోను ఏదో సత్యాన్ని గ్రహించడమూ, ప్రతిజీవిలోను ఏదో మహత్తును గుర్తించడమూ యోగం. చావుబ్రతుకుల దాటి ఆత్మనిశ్చలత పొందడమే సంయోగం.

మనోదౌర్బల్య ఫలం పాపం. పాపిపై జాలిచూపాలి. పాపిని పవిత్రీకరించడమే శిక్ష. నేటి పాపి రేపు తాపసికావచ్చు. 'మంచిగాం జెడ్డ, మధువుగా మంచుకారు మాటతీరు.' సత్యరతి, ధర్మగతి, గృహస్థ విధి, అతిథిసేవ, స్వదేశభక్తి, అఖిలమానవప్రేమ, ఈశ్వరభక్తి- ఇవి 'సప్తపది'కి అంగాలుగా చెప్పబడ్డాయి.

ఇక ఉత్తమ అనువాద లక్షణాలనూ, ఋగ్వీథిలోని అనువాద విధానానికి సంబంధించిన రామణీయకాన్ని పరిశీలించడం ఆవశ్యకం.

అనువాదం ఒక కళ. అందుకు మూలగ్రంథ భాషలోను, స్వీయ భాషలోను క్షుణ్ణమైన పరిజ్ఞానం అవసరం. మూలకర్త హృదయాన్ని నిపుణంగా గ్రహించాలి. గ్రహించిన భావాన్ని సమర్థవంతంగా - కళాత్మకంగా వ్యక్తీకరించాలి. మూలాన్ని మార్చరాదు అప్పుడే అది వాస్తవమైన అనువాదమవుతుంది. యథాతథంగా కాని, అవసరాన్ని బట్టి సంగ్రహించి కాని లేదా వివరణాత్మకంగా కాని అనువదించవచ్చు. అనువాదంలో కృత్రిమత్వం ఏమాత్రమూ ఉండరాదు; స్వతంత్ర రచనగానే భాసించాలి. సంస్కృతం లేక సంస్కృతంతో సంబంధమున్న భాషలనుండి తెనిగించడానికంటె తద్భిన్నమైన భాషలనుండి తెనిగించి కృతకృత్యత పొందడం క్లేశదాయకం. ఈ అంశాలను దృష్టిలో పెట్టు

కొని పరిశీలిస్తే కృష్ణశాస్త్రి కృషి ఋగ్వీథి అనువాదంలో చరితార్థ మయ్యిందని చెప్పడంలో సందేహం లేదు.

కృష్ణశాస్త్రి అనువాద వైదగ్ధ్యానికి ఋగ్వీథి అంతా ఉదాహరణమే. ఇందులోని అనువాద రీతులకు కొన్ని ఉదాహరణలు పేర్కొ-వడం అవసరం.

"Prayer is the royal road to heaven; it is the cipher key for opening the gates of the City of God. It is the passport for prompt admission in to abodes of immortality" దీనికి —

"రాజ పథము స్వర్గమునకు-రాజ రాజు, నగరు మొగసాల తాళమ్ము-పగలు రేయి
పరమధామమ్ముఁ జొరగ నుత్తరువు మనకు, ప్రార్థనమ్మె యటంచు బ్రహ్మర్షి మాట".

అని అనువాదం. ఇందులో మూలంలోని భావం సంపూర్ణంగా ఇమిడిపోవడమే కాక, 'పగలు రేయి' అనే ప్రయోగం మూలానికి వన్నె పెట్టింది.

"O, my God, my body I render in to Thee that it may be engaged in Thy service. My mind I offer in to Thee that it may be employed for the propogation of Thy truth." దీనికి —

"జీవితేశ్వర! నీపాదసేవకోస, మేను నామేను సర్పింప నీఁగదోయి!
సతము నీదివ్యసత్యమ్ముఁ జాటనాదు, మనసు నొనరింపు మనుచు బ్రహ్మర్షి మాట".

అని అనువాదం. ఇందులో మూలంలోని భావం సమగ్రంగా సంగ్రహింపబడింది.

',Man - thc heir of ages past and the architect of centuries to come" దీనికి —

"సాగిపోయిన వేలకల్పాల కర్మ, ఫల మహాభాగ్యరాశికి భాజనుండు
రాఁగల యుగాల శిల్పనిర్మాతయైన, యతఁడు మానవుఁడనుచు బ్రహ్మర్షి మాట".

అని అనువాదం, ఇందులో మూలంలోని భావం మనోహరంగా వివరింపబడింది,

ఈ కావ్యం 'ఎంత వినినను గాని యావంత విసువు, ఎంత చదివినఁ గాని రవ్వంత వెగటు' కలుగని విధంగా, సరళసుందరమైన శైలిలో, కృత్రిమత్వం ఏ మాత్రమూ లేకుండ స్వతంత్ర రచన లాగే రూపొందింది. 'ఈ విశ్వమంతయు నీశ్వరాలయము, ఆత్మ యందలి పవిత్రాంతరాలయము', 'విధ్యుక్త ధర్మమ్ము విమల శాసనము, సత్యమే శాశ్వతాక్షర వేద వాక్కు,' 'బ్రతుకు నిత్యవికాస పావన యాత్ర, మానవత్వమ్ము పూర్ణానుగ్రహమ్ము' - అని ఎలుగెత్తి చాటే బ్రహ్మర్షి సందేశామృతానికి సుమధుర కవితా సౌరభాన్ని కై సేసిన కృష్ణశాస్త్రి కలం అమృతత్వాన్ని పొందింది, కృష్ణశాస్త్రి ఊర్వశిలో పాడాలని కలలుగన్న 'మేలుకొనిన శ్రుతులు' ఈ ఋగ్వీథి అనువాదంలో సుస్పష్టంగా మేలుకొన్నాయి,



# గేయకృతుల ప్రాశస్త్యం

"సంగీతమపి సాహిత్యం
సరస్వత్యాః స్తనద్వయమ్
ఏక మాపాత మధురం
అన్యదాలోచ నామృతమ్"

## మహతీనిస్వనం

నవీన భారతసాహిత్యాలలో ప్రశస్తమైన గేయకవిత్వం వ్రాసిన వారిలో రవీంద్రుని ప్రథమ శిష్యుడుగా కృష్ణశాస్త్రి కీర్తిపొందాడు. కృష్ణశాస్త్రి వ్రాసిన సహస్రాధిక గేయాలలో సగంకూడ వెలుగు చూడకపోవడం విచారకరం. అతనికి కవిత్వం ప్రాణం, సంగీతం ప్రాణాధికం[1]; సంగీత సాహిత్యాలు రెండూ సంగమించిన గేయకవిత్వం ఆత్మ. "గేయానికి ఎక్కువగా శబ్దార్థ అలంకారాలు తొడుగకూడదు"[2]– అని అతని నిర్ణయం. ఈ విషయంలో —

"My song has put off her adornments,
She has no pride of dress and decorations,
Ornaments would mar our union;
they would come between thee and me;
their jingling would drown thy whispers"[3]

అనే రవీంద్రుని అభిమతాన్ని కృష్ణశాస్త్రి అనుసరించాడు.

మహతి బ్రహ్మసమాజపరంగా వెలసిన గేయసంపుటి. ఇది రాగ తాళ లయాత్మకమైన రచన. ఈగుణం తిరుప్పావు గీతాలలో మరింత ఎక్కువ. మేఘమాల గీతాలు లలితసంగీతరీతికి అలంకారాలు. ప్రాచీన నవీన గేయ కవితారీతులన్నింటినీ కృష్ణశాస్త్రి తన వివిధ రచనలలో ప్రతిభావంతంగా ప్రదర్శించాడు.

నారదమహర్షి మహతికి నూరుతంతులున్నట్లే కృష్ణశాస్త్రి మహతికి మాలికంగా నూరుగీతాలున్నాయి. ఇవి బ్రహ్మర్షి సాన్నిధ్యంలో సూఫీ వైష్ణవతత్త్వానుభూతుల సమన్వయంతో గానం చేయబడ్డవి. ఈ గీతాలపై బ్రహ్మర్షి సూక్తుల ప్రభావం ప్రబలంగా కనిపిస్తుంది. వీటికి బ్రహ్మసమాజంలోని భక్తితత్త్వమూ, సంస్కరణలక్ష్యమూ ప్రాణవాయువు. కృష్ణశాస్త్రి ఆత్మీయత ఈగీతాలలో అడుగడుగునా వ్యక్తమవుతుంది.

"దైవంమీద విశ్వాసంకల మనిషి ఏనాటివాడైనా ఏచోటివాడైనా నోరారా పాడుకోగల భక్తిగీతాలివి. ఇరుకుగోడలు కట్టుకొని జాతిమతాల పేరుతో ముక్కలుకాని మహామానవ హృదయంలో ప్రభవించిన ప్రసూనాలివి. ఆంధ్రసాహితి గర్వంగా కంఠాన ధరించదగిన మణిహారం మహతి"[4]. వంగదేశంలో రవీంద్రుని గీతాలలాగే ఆంధ్రదేశంలో ఈ గీతాలు ప్రసిద్ధిచెందాయి. వీటికి 'మధురభక్తి' హృదయం.

ఈ మహతీనిస్వనంలో ఈశ్వరకారుణ్యం, ప్రార్థనామహిమ, సర్వమానవ సామరస్యం, దేశాభిమానం – ఈ నాలుగు స్వరాలు తారస్థాయిలో పలికాయి.

## ఈశ్వరకారుణ్యం

ఆత్మేశుడైన పరమాత్మను చేరుకోవడమే జీవాత్మకు పరమ గమ్యంగా నిరూపింపబడింది. 'మౌన నిశీథభారం'తో, 'ఉపశమింపని తపన'తో క్రుంగిపోయే లోకానికి 'కుటిల శృంఖలాలూ,' 'కుడ్యాలూ' లేని బ్రహ్మసమాజం 'కరుణాలయం'గా పేర్కొనబడింది.

"లేదోయి నిదురలో లేదోయి సుగతి
చూడవా కనువిచ్చి చూడవా జగతి...."

ఇలాంటి చరణాలలో అజ్ఞాన నిద్రలో మైమరచిన జీవాత్మకు సుగతి

మార్గం నిర్దేశింప బడింది. పశ్చాత్తాపంతో అశ్రువర్షం కురిపించడమే భగవంతుని అనుగ్రహానికి పరమ సాధనంగా స్పష్టం చేయబడింది.

"కురియుమురా కన్నీటిని, మఱిమఱి విలపింపుమురా
సరము(గూర్చి పరమేశు(డె, దాల్చునురా పాపీ!"

అంటూ పదేపదే హెచ్చరింపబడింది. ఇలాంటి సందర్భాలలో –

" Master I shall weave a chain of pearls
for thy neck with my tears of sorrow"[5]

అనే రవీంద్రుని చరణాల సామ్యం వ్యక్తమవుతుంది.

స్వార్థాన్నీ, అహంకారాన్నీ విసర్జించి, ధనిక దరిద్ర భేదాలకు స్వస్తిచెప్పి 'తులలేని తుదిలేని పదవి దారి'లో పయనిస్తూ కరుణామయుని సాన్నిధ్యంకోసం పరితపించాలని ప్రబోధింపబడింది.

"నవ్యమోహనమూర్తి హృదయేశు(డు నవ, లావణ్యామలమూర్తి హృదయేశు(డు
దివ్యప్రశాంత సమీర వీచికలలో(, దేలించు లాలించు హృదయేశు(డు" –

అనే విశ్వాసంతో ఆడిపాడాలనీ, ఎట్టి పాపినైనా ప్రభువు కరుణిస్తాడనీ ఆశాసందేశం అందింపబడింది. 'ఎంతచెడినగాని మీనందనులమే' అంటూ పాదాక్రాంతులైతే 'తవిలి విడువదు స్వామి దయ' అని స్పష్టం చేయబడింది దయామయుని దరిజేరినప్పుడు 'ఎట్టులుందునో నా ఎద ఎగిరి నాట్యమాడునో' అంటూ కవి భక్తితన్మయత్వంతో గానం చేశాడు.

"పడవ నడుపుము కర్ణధారీ!, కడిమి విడువక కడలి మీరి!
సుడులు తిరిగే పడవ, అదరిపోయే పడవ, తడిసిరానే లేక తల్లడిల్లే పడవ...."

ఇలాంటి గేయాలలో సంసారసాగరాన్ని దాటించి పరమపదాన్ని ప్రసాదించేవాడు పరమాత్ముడే అని స్పష్టం చేయబడింది.

ఈ సందర్భంలో –

" Jesu! bless our slender Boat,
By the current swept along,
Land its threatenings-let them not
Drown the music of a song ... "[6]

అనే వర్డ్స్‌వర్తు గీతి సాదృశ్యం గమనింపదగి ఉంది.

"అనియంతా పెద్ద యతుయపాత్ర!
అఖిలేశు హస్తమే అన్నపూర్ణమ్మ!
ఆరిపోవనిది నా ఆకలేమైతే
అంతుదొరకనిది ఆ యమృతాబ్ధి కాదా! ..."

ఇలాంటి గీతాలలో ఆనంద భిక్షకోసం అర్రులుచాస్తూ నిరీక్షించే భక్తుని ఆర్తి కనిపిస్తుంది. ఆ హారంగా శోకాన్నీ, పానీయంగా అశ్రువునూ అందిమ్మతండ్రీ! అనే ప్రార్థనలో సూఫీసాధకుల కఠినదీక్ష ప్రకటింపబడింది.

"శిథిలాలయమ్ములో శివుడు లేడోయి!
ప్రాంగణమ్మున గంట పలుక లేదోయి! .... "

అనే గీతంలో వ్యంగ్యంగా విగ్రహారాధన నిరసింపబడింది. భగవంతుడు ఇంటింటా వాడవాడలా వెలసిఉన్నాడని చెప్పబడింది. ఇక్కడ భగవంతుని సర్వాంతర్యామిత్వమే కాక, కష్టించి పనిచేయడమూ మాధవ సేవ అవుతుందనే ఆదర్శం సూచింప బడింది. ఈ సందర్భంలో -

" .. Whom dost thou worship in this lonely
dark corner of a temple with doors all shut?
Open thy eyes and see thy God is not before thee ..."[7]

అనే రవీంద్రుని చరణాల సామ్యం కనిపిస్తుంది.

ప్రార్థనామహిమ

"హరినామ మధుపానమే వినా, పరమేది మనకు సోదరులార! ...."
"నా నోట నీ పాట గానమయ్యేవేళ, నా గుండె నీ వుండి మ్రోగింపవా .... "

ఇలాంటి గీతాలలో ప్రార్థనవల్ల 'విడరాని శాంతీ', 'చెడిపోని కాంతీ' లభిస్తాయని స్పష్టం చేయబడింది. పాటపాడడంలోనూ ఈశ్వర కటాక్షా నికి గల ప్రాముఖ్యం పేర్కొనబడింది

భక్తుడు పాడి పాడి, నృత్యం చేసి చేసి, వేడివేడి పొరలాలని చెప్పబడింది. దానివల్ల ఇహమే స్వర్గమై, ఎక్కడలేని ఉత్సాహం గంగ లాగ పొంగుతుందని ప్రబోధింపబడింది. 'బ్రహ్మసుధర్మ పతాకాన్ని' ధరించి 'భక్తితో తాండవం' చేసి తరించడానికి సకల మానవాళికి స్వాగతం పలుకబడింది.

## సర్వమానవ సామరస్యం

"తెగతెంచవయ్యా ఏ, ద్వేషపు సంకెళ్లేని!
తెగనివి కావయ్యా యుగ, యుగములనైనా కానీ! ....
మాలలమేమో పనికి, మాలిన వారమె యేమో!
శ్రీ లలితేశ్వర గళనవ, మాలాకుసుమాల మేమె!"

ఈ గీతంలో సర్వమానవ సామరస్యాన్ని, అందులోను ముఖ్యంగా హరి జనాభ్యుదయాన్ని కవి అభిలషించాడు. గుణం లేనివారిది ఏ కులమైనా ప్రయోజనం లేదనీ, గుణవంతులైతే మాలలైనా పరమేశ్వరుని కంఠ మాలాకుసుమాలే అవుతారనీ కవి మహత్తరమైన సందేశమిచ్చాడు. ఈ సందర్భంలో 'మంచిచెడ్డలు మనుజులందున ఎంచిచూడగ రెండె కుల ములు' అనే గురజాడ సందేశప్రభావం గుర్తింప దగింది.

"జాగ్రత! జాగ్రత! మాయజగత్తని, శాస్త్రములెల్లను విప్పెదవు!
భాగ్యము ప్రేమయు పయఃకణములని, బైరాగి ధర్మము చెప్పెదవు..."

ఈ గీతంలో లోకం మాయఅంటూ ఐహిక జీవితంపై నిరాశా భావా న్ని ప్రచారంచేసే 'బైరాగిధర్మం' ఖండింపబడింది. సంసారికీ, స్వామ్యార్థి కీ, సన్యాసికీ ఈలోకం స్వర్గమే అని నిరూపింపబడింది.

మోక్షంకోసం 'శుష్క సాధనల' ద్వారా తపించవలసిన అవసరం లేదనీ, పరమేశ్వర కారుణ్యా భరితమైన ఈ లోకం 'అక్షయ భాండమే' అనీ వివరింపబడింది. ఈ సందర్భంలో కవికిగల ఆశావాదం వ్యక్తమవుతుంది. ప్రజలలో సామరస్యంతోపాటు ఐహిక ప్రేమకూడ పెంపొందాలని కవి కోరాడు.

## దేశాభిమానం

ఆధ్యాత్మికమైన ఔన్నత్యమూ, శాంతి సామరస్యాలతోపాటు దేశాభిమానం కూడ సమాజంలో వికసించాలని కవి కోరుకొన్నాడు. ఈ అంశాన్నికూడ ఈ భక్తిగీతాలలో కనబరచాడు.

"జయ జయ జయ ప్రియభారత, జనయిత్రీ దివ్యధాత్రి...."

"హే భారత జననీ! స్వేచ్ఛా గగన వీధీ విహారిణి!...."

ఈ దేశభక్తి గీతాలు రసజ్ఞుల మెప్పును చూరగొన్నాయి. ఇవి 'జన గణమన', 'వందే మాతరం' గీతాల కోవకు చెందినవిగా మెప్పుపొందాయి. 'జయపతాక యువపతాక...' అనే గీతం యువశక్తికీ, భారత పతాకానికీ సంకేతంగా రూపొందింది. 'పురాణ మహితాశయ భూమి'గా భారతభూమిని కవి కీర్తించాడు. బ్రహ్మర్షి గుణగానం కూడ ఉదాత్తంగా సాగింది.

"తెలుగు తల్లికి మంగళమ్! మా కల్పవల్లికి మంగళమ్!
కొలుచు మా యెదనిలుచు మా రాజ్ఞీమతల్లికి మంగళమ్! ...."

అనే మంగళగీతంతో మహతీనిస్వనం ముగిసింది. ఈ ముగింపు విశిష్టమయ్యింది. దీనిలో తెలుగుదేశ ప్రాశస్త్యాన్ని సముచితంగా పేర్కొంటూ కవి తన ఆంధ్రాభిమానాన్ని వ్యక్తం చేశాడు.

ఈ గీతాలు చాలవరకు రసవంతంగా ఒప్పారుతున్నాయి. వీటిలో 'జాగ్రత! జాగ్రత' అనే గీతంపై దువ్వూరి రామిరెడ్డి ప్రభావమూ, 'కాంచలేను కాంచలేను' 'వాడిన తీగెకె' 'దాసిగానుండుటకైన దగనా' అనే గీతాలపై బసవరాజు అప్పారావు ప్రభావమూ, 'నేడే రమ్మా నేడేరమ్మా' అనే గీతంపై రవీంద్రుని ప్రభావమూ విశిష్టంగా ఉంది. ఈ గేయసంపుటిలో పరధర్మ నిరసనం ఏమాత్రమూ లేకపోవడం ప్రశంసనీయం. "బ్రహ్మసమాజ మతానుయాయులకు కృష్ణశాస్త్రి గీతాలు త్యాగరాజు కీర్తనలే. రామదాసు భజనలే"[8] అని చెప్పడంలో సందేహం లేదు.

"నిజంగా మహతి అపూర్వభక్తికావ్య సంపుటం. ఇందలి పాటలు ప్రభుని మృదుపదాలు నొవ్వకుండా కవి పరచిన మల్లెపూల బాటలు, తెలుగు పలుకులలోని తీయని తేనెల ఊటలు, వన్నెల విరుల తోటలు. ఆధునిక భారత సాహిత్యంలో రవీంద్రుని భక్తిగీతాలకోవకు చెందిన అద్భుతగేయ రచనలో దేవులపల్లి వారిది అందెవేసిన చెయ్యి... ఈ నాటిగేయ కవులలో దేవులపల్లి 'ఎవరెస్టు' శిఖరం అన్న విషయాన్ని మహతి నిరూపిస్తున్నది."[9] అని అమరేంద్రగారు నిర్ణయించడంలో అత్యుక్తి లేదు.

# మేఘమాలాసౌందర్యం

మేఘమాల కృష్ణశాస్త్రి వ్రాసిన చలనచిత్రగీతాల సంపుటి. సరళ సుందరమైన శైలికీ, ఆదర్శ సాహిత్య ప్రమాణానికీ ఈ గేయాలు ప్రసిద్ధిచెందాయి. మహాకవి ఏ రచనచేసినా అందులో తన ఆత్మీయతనూ, విశ్వకల్యాణ దృష్టినీ వ్యక్తం చేస్తాడని చెప్పడానికి ఈపాటలు చక్కని దృష్టాంతాలు.

ఉదాత్త భావసంపద ఉట్టిపడే ఈ గీతాలలో లలిత సంగీతరీతి లావణ్యానికి ప్రమాణభూతమైన రచనలేకాక, శాస్త్రీయ జానపద రీతులకు చెందిన రచనలు కూడ కొన్ని ఉన్నాయి. ఈ మేఘమాల 1. ప్రకృతి కవిత్వం, 2. ప్రణయకవిత్వం, 3. భక్తి కవిత్వం, 4. సంస్కరణ కవిత్వం, 5. దేశాభిమాన కవిత్వం – అనే ఐదు జల్లులను అధికంగా కురిపించింది.

## ప్రకృతి ఆవర్తం

రమణీయమైన ప్రకృతి కవితా శంపాలతలు పెనవేసుకొన్న ఎన్నో గీతాలు దీనిలో ఉన్నాయి. ఇవి పండితులకే కాక సర్వసామాన్యులకు సైతం రసానంద పారవశ్యాన్ని కలిగిస్తాయి.

" అదిగదిగో గగనసీమ
అందమైన చందమామ ఆడెనోయీ
ఇది గిదిగో తేలి తేలి
చల్లనైన పిల్లగాలి పాడెనోయీ ...."

" ...ఆతోట ఆతోపు ఆకుపచ్చని గూడు
ఆ వంక గొరవంక అన్నీ ఉన్నాయిలే ...."

" కొండల కోనల సూరీడు కురిసె బంగారు నీరు
పిలిసె పురకేసే యేరు, ఆమావి గుబురు – హేయ్ హేయ్ ...."

ఇలాంటి పాటలు సహృదయుల 'మనసున మల్లెలు' పూయిస్తూ, 'కన్నుల వెన్నెల డోలలు' ఊగించడంలో సందేహంలేదు.

తెలుగు గ్రామసీమలలోని ప్రకృతీ, తెలుగువారి దైనందిన జీవిత విశేషాలూ, వారి పండుగలూ పబ్బాలూ, ఆచార వ్యవహారాలూ అన్నీ ఈ గేయాలలో కవితారూపం పొందాయి. ఇందులో తెలుగు దేశంలో వినిపించే జోలపాటలు, సంక్రాంతి పాటలు, బొమ్మలకొలువు పాటలు, పుట్టినరోజు పండుగపాటలు, ముత్తైదువల పాటలు, భజన కీర్తనలు, కథాగీతాలు, హరికథలు - మొదలైన వాటికి అన్నింటికీ ప్రాతినిధ్యం వహించే పాటలున్నాయి. వైవిధ్య పూర్ణమైన తెలుగు జాతి జీవిత మాధుర్యంతోపాటు తెలుగునేలలోని పూలూ, పంటలూ, ఋతువులూ, ప్రజల సుఖదుఃఖాలూ, ఇలవేల్పులు మొదలైన సమస్త విషయాలు ఇందులో సాక్షాత్కరించడం గమనింపదగ్గ విశేషం.

ప్రణయ సంవర్తం

కృష్ణశాస్త్రి వియోగ ప్రణయ కవిత్వాన్ని వ్రాయడంలో ఆరి తేరిన వాడనే అంశాన్ని ఈగీతాలు స్పష్టంచేస్తాయి. వియోగ సంతప్తులైన ప్రేయసీప్రియుల హృదయతంత్రులను పలికించడంలో కృష్ణశాస్త్రి స్వీయానుభూతి స్పర్శకొంత వినిపిస్తుంది. ఒక ప్రేయసి —

" ఆకాశ వీథిలో హాయిగా ఎగిరేవు!
దేశ దేశాలన్నీ తిరిగి చూచేవు!
ఏడ తానున్నాడో బావ, జాడ తెలిసిన పోయిరావా! ...."

అంటూ మేఘమాలను ప్రార్థిస్తుంది. అదే విధంగానే ఆమె ప్రియుడుకూడ-

" గగన సీమల తేలు ఓ మేఘమాలా!
మా ఊరు గుడిపైన మసలి వస్తున్నావా!
మల్లిమాటేదైన నాతో మనసు చల్లగ చెప్పిపోవా! ...."

అంటూ వేడుకొంటాడు. ప్రియుడు లేనిది బ్రతుకలేనని ప్రేయసీ, ప్రేయసిని మరువలేనని ప్రియుడూ తెలుపుకోవడానికి ఆలంబనమైన మేఘమాలకు 'మమత' 'మనసు' 'జాలిగుండెలు' — ఉన్నట్లు పేర్కొవడం మనోహరం.

కాళిదాసు మేఘసందేశ కావ్యంలో కేవలం ప్రియుడు మాత్రం సందేశం పంపగా దీనిలో ప్రేయసీప్రియులు పరస్పరం సందేశాలు పంపుకోవడం విశేషం. రసజ్ఞులను ఉర్రూతలూగించిన ఈపాట మిక్కిలి ప్రీతిపాత్రం. అందుకే ఈ సంపుటి 'మేఘమాల' అయ్యింది.

" కన్నీటి కడలిలోన - చుక్కాని లేనినావ
దిక్కైన లేవి నావ!, ఏ తీరమైన చేరునో —
ఏరాల పాల బడునో, ఏగాలి వాతబడునో ...."
" రానిక నీకోసం సఖీ, రాదిక వసంత మాసం...."

ఇలాంటి పాటలలో విధివంచితులైన ప్రణయజీవుల విషాద మాధురి చక్కగా గానంచేయబడింది. మిక్కిలి విశిష్టమైన రీతిలో —

"కుశల మా నీకు కుశలమేనా
మనసు నిలుపుకోలేక మరీ మరీ అడిగాను ...."

అనే సందేశగీతి సాగింది. ఇందులో ప్రియుడు 'పాలుగారు చెక్కిలిపై పాపాయికి ఒకటి, తేనెలూరు పెదవులపై దేవిగారికొకటి' అంటూ ప్రతిసందేశం పంపాడు. అందుకు ప్రేయసి 'ఒకటేనా?' అంటూ అసంతృప్తి చెందుతుంది. దీనిలో కవి ప్రయోగించిన 'ఒకటి'లోని రమణీయార్థాన్ని గ్రహించని వారుండరు. వ్యంజనా శక్తి మాధుర్యాన్ని సామాన్యులకు సైతం చవిచూపిన కవి నేర్పు గమనింపదగ్గది.

సంయోగ ప్రణయ కవిత్వాన్ని ఎక్కువగా వ్రాయకపోయినా అందులోకూడ కృష్ణశాస్త్రి చతురుడనే అంశాన్ని ఇందులోని గీతాలు నిరూపిస్తున్నాయి.

" మనసున మల్లెల మాలలూగెనే, కన్నుల వెన్నెలడోలలూగేనే
ఎంతహాయి ఈరేయి నిండెనో, ఎన్నినాళ్ళకీ బ్రతుకు పండెనో!....
గడియయేని యికవిడిచిపోకుమా, ఎగసిన హృదయము పగులనీకుమా ...."

" ప్రతిరాత్రి వసంతరాత్రి, ప్రతిగాలి పైరగాలి
బ్రతుకంగా ప్రతినిమిషం పాటలాగసాగాలి ...."

" వేళచూస్తే సందెవేళ, గాలివీస్తే పైరగాలి
ఏల ఒంటరి తోట కడకు-ఎందుకొరకు?....
పెదవీ పెదవీ ఎదురై ఎదురై, మధువులు వెదకేవేళా
మగువా! అదియే వసంతవేళ ... .... ...."

ఇలాంటి గీతాలలో విప్రలంభానంతరం విజృంభించే తృష్ణకూ, నవవసంత ప్రేరణతో నర్తించే యువమనోరథాలకూ చక్కని రూపకల్పన కనిపిస్తుంది. ఎన్నాళ్ళ కలలనో పండించుకోబోతున్న నవవధువును గురించి —

" ఔనే! చెలియా! సరి సరి!
ఆ హంసల నడకలిప్పుడా సొగసరీ!....
మాపటి బిడియాలన్నీ రేపటికి ఉండవులే ...."

అని చెలికత్తెలు ప్రశ్నిస్తూ పీడించడంలోని వాస్తవికత్వమూ, ఔచిత్యమూ ప్రశంసనీయం. వియోగ శృంగారంలోలాగే సంయోగ శృంగారంలోను సభ్యతను పాటించిన కృష్ణశాస్త్రి నైపుణ్యం ఆదర్శప్రాయం.

## భక్తి పుష్కలం

భక్తి కవితా రచనలో మహోన్నత శిఖరాల చేరుకొన్న కృష్ణశాస్త్రి భక్తిపారవశ్యం ఈపాటలలో పుష్కలంగా గోచరిస్తుంది. ఎలాంటి మనస్తత్వం కలవారినైనా ఆకర్షించే భక్తిగీతాలకు ఈసంపుటి పెన్నిధి.

" నీవుండేదాకొండపై, నా స్వామి నేనుండేదీ నేలపై
ఏ లీల సేవింతునో, ఏ పూల పూజింతునో ...."

ఈ ఏడుకొండలస్వామి స్తోత్రంలో 'కొండ' 'నేల' లలోని అర్థగాంభీర్యం ప్రశంసనీయం. ఇలాంటిపాటను అన్నమయ్యకూడ వ్రాయలేడని కొందరు రసజ్ఞులు తలంచడం గమనింపదగ్గది.[1]

" శ్రీశైలం మల్లన్న శిరసొంచేనా
చేలంతా గంగమ్మా వానా!
తిరుమలపై వెంకన్న కనువిప్పేనా
కరుణించు ఎండా వెన్నెలలైనా .... ...."

ఈ గీతికాపీఠంపై తెలుగువారికి ఇలవేల్పులైన మల్లన్న వెంకన్న లిద్దరూ ప్రతిష్ఠింపబడ్డారు. మల్లికార్జునుడు శిరసు వంచితే 'గంగ' కురియడమూ, వేంకటేశ్వరుడు కనువిప్పితే 'ఎండ', 'వెన్నెల' కరుణించడమూ రసవంతం. దేశం సుభిక్షం కావడానికి ఆ దేవతల కృప ఎంత అవసరమో దీనిలో వ్యక్తమవుతుంది.

మానవజాతికి మహితాదర్శ మూర్తియైన శ్రీరాముని సంకీర్తనం ఈ గేయాలలో ప్రాధాన్యం వహించింది.

"ఏమి రామకథ శబరీ! శబరీ!, ఏదీ మరియొకసారి
ఏమి రామకథ రామకథాసుధ, ఎంత తీయనిది శబరీ! శబరీ!..."
"విన్నారా జనులారా వీనులార శ్రీరామకథ
శ్రీ దశరథరాముని దివ్యకథ...."

ఇలాంటి పాటలు ప్రజల హృదయాలను భక్తిసుధాప్రవాహాలతో తరింపజేస్తాయి. శ్రీకృష్ణావతారసంబంధమైన 'నీలమోహనారారా...' 'అదిగో మారాధిక...' ఇలాంటి పాటలు కూడ మధుర మధురంగా వినిపిస్తాయి.

"హరి ఓం! హరి ఓం! హరి ఓం
ఘనాఘన సుందరా! కరుణారస మందిరా!...."

"శ్రీశైల భవనా ! మేలుకో
శ్రితచిత్త సదనా మేలుకో...."

ఇలాంటి పాటలు ప్రజాహృదయాలలో నిద్రాణమైన భక్తిభావ తరంగాలను మేల్కొలుపుతాయి.

సంస్కరణ ద్రోణం

మానవతా వాదియైన కృష్ణశాస్త్రి మానవధర్మాలను మనోహరంగా చిత్రించిన గేయాలు కొన్ని దీనిలో ఉన్నాయి.

"మనిషైతే మనసుంటే, కలలు కరగాలిరా కరగి
మరి కరుణ కురియాలిరా, కురిసి జగతినిండాలిరా..."
"ఎంతైన బ్రతుకు, ఏమైన ఇది అవసరమే మనకు...
ప్రతిగుండె వేదనతో పగిలేతీరాలి..."

ఇలాంటి గేయాలు సర్వమానవ కల్యాణానికి కరుణ ప్రాముఖ్యాన్ని, తాత్విక దృక్పథంతో బరువు బ్రతుకుల సహించే ఆత్మస్థైర్యాన్ని ప్రబోధిస్తాయి. కర్షకులు, కార్మికులు మొదలైన శ్రమజీవుల గొప్పదనాన్ని, వారిపై సానుభూతి చూపవలసిన అవసరాన్ని వ్యక్తంచేస్తూ 'కార్మికులం మేమే, మేమే, కర్షకులం మేమే...' అనే పాట వ్రాయబడింది. కృష్ణశాస్త్రి సంస్కరణాత్మకమైన సందేశం ఇట్లే చాల పాటలలో ధ్వనిస్తుంది.

" ...అంటరాని తనము - ఒంటరితనము
అనాదిగ మీ జాతికి ఆదేమూలధనము
ఇక సమభావం, సమధర్మం, సహజీవన మనివార్యం "

అనే చరణాలలో కవి ఉద్దేశించిన సంస్కరణం సిద్ధించిననాడు సాంఘిక చరిత్రలో 'నవమంగళయుగం' ప్రారంభం కావడంలో సందేహంలేదు.

దేశాభిమాన కాలజం

కృష్ణశాస్త్రి దేశాభిమానం ఈ పాటలలో చాలా వాటికి జీవనాడి. అందులో ముఖ్యంగా రెండు గేయాలలో ఈ విషయం ప్రస్ఫుటంగా కనిపిస్తుంది.

"అందాల మనదేశము ఆంద, చందాల మనదేశము పెం
పొందాలి కలకాలము ఆ, నందాల మనదేశము...."

దీనిలో దేశాభ్యుదయ దృష్టీ, భారతీయ సంస్కృతి తత్వమూ రాశీభవించాయి. 'ఒకటే కులం, ఒకడే దైవం' ఉండవలసిన ఆవశ్యకం స్పష్టం చేయబడింది.

"అడుగడుగున గుడి ఉంది, అందరిలో గుడి ఉంది ....
ప్రతిమనిషీ నడిచే దైవం, ప్రతి పులుగూ ఎగిరే దైవం .... "

దీనిలో 'ఎల్లలులేని దేశభక్తి' వెల్లివిరిసింది. ప్రతి ప్రాణిలోనూ ఉండే దివ్యత్వాన్ని ఆరాధిస్తూ, శాంతిసామరస్యాలతో లోకం వర్ధిల్లాలని కవి ఆశించడం ప్రశంసనీయం.

ఈసంపుటిలోని మల్లెల వసంతాలూ, చేమంతుల హేమంతాలూ, వెన్నెల పారిజాతాలూ, వానకారు సంపెంగలూ మొదలైనవి నిరంతరమూ సాహిత్యంలో పరిమళిస్తాయి. పంటపొలాలూ, ఎలమావితోటలూ, పచ్చని మధువనులూ మరపురావు. గాలి ఊసులూ, కోయిల పాటలూ, జోడెడ్ల బండ్లూ, ఎగిరే పావురాలూ, కళ్లుకప్పే వసంత రాత్రులూ, ఒళ్లు నిమిరే పైరగాలులూ, చీకటి వెలుగుల కౌగిళ్లూ, చుక్కలుపాడే శుభమంత్రాలూ గుండెలలో గూడుకట్టుకొంటాయి. కళ్లుతెరచే పల్లెలూ, పచ్చని పండుగ వాకిళ్లూ, మనసూగే మగువలూ, ముంగిట ముగ్గులూ - గొబ్బిళ్లూ డూడూ బసవన్నలతోపాటు, కొత్తపెళ్లి కూతుళ్లూ, కోర

చూపుల అల్లుళ్లూ నిత్యనూతనంగా కనిపిస్తూఉంటారు; పాడిచ్చే గోవులూ, ధాన్యపు గాదులూ, పాతాళగంగమ్మకు రైతుల ప్రార్థనలూ, బాధా మధువులూ, కన్నీటి కడలులూ, దిక్కులేని నావలూ హృదయాలను హర్ష విషాద మాధుర్యాలతో నింపుతూ ఉంటాయి.

కృష్ణశాస్త్రిలోని అపారమైన లోకానుభవాన్నీ, కవితా సౌందర్యాన్నీ వర్షించే ఈ మేఘమాల ప్రభావం చలనచిత్ర కవిత్వంపై నిరంతరమూ ఉంటుంది. కాని ఆ సాహిత్యం దిగజారిపోకుండ, ఉత్తమ భావ కవితారీతిని చిరకాలం పెంపొంద జేయడం అభిలషణీయం.

"...చిన్నారి సొగసు పలుకుల కులుకులతో పాటలు రాయడంలో రవీంద్ర కవీంద్రుని సరసన నిలువగల కవి చంద్రుడు కృష్ణశాస్త్రి. ఆయన పాటలు మల్లెపూల బాటలు, విరితేనె వూటలు, ఆణిముత్యాల మూటలు"[2] — అని అమరేంద్రగారు పేర్కొవడం అక్షరాల యథార్థం.



# తిరుప్పావు దివ్యత్వం

కృష్ణశాస్త్రి అనువాద శిల్పానికీ, శైలీ సౌకుమార్యానికీ, సంగీత పరిజ్ఞానానికీ తిరుప్పావు సంకీర్తనలు నికషోపలాలు. తమిళ భక్తి సాహిత్యంలో తిరుప్పావు దివ్యప్రబంధానికి అద్వితీయ స్థానముంది. దానిని వ్రాసిన కవయిత్రి గోదాదేవి. ఆమె భూదేవి అవతారంగా పరిగణింపబడింది. ఆండాళ్ళు, తాయారు, చూడికుడుత్త నాచ్చియారు, ఆముక్తమాల్యద – అనీ ఆమెకు మారు పేర్లు. వేదాంతదేశికులు అపరలక్ష్మీదేవిగా ఆమెను స్తుతించారు. 'తిరుప్పావై జీయరు'గా పేరు పొందిన శ్రీమద్రామానుజులకు తిరుప్పావు నిత్యపారాయణ గ్రంథంగా తెలుస్తుంది.

తిరుప్పావు అంటే దివ్యగీతమనీ, దివ్యవ్రతమనీ అర్థాలు. ఆ వ్రతానికి శ్రీవ్రతం, ధనుర్మాసవ్రతం లేక మార్గళి నోము అనీ పేర్లు. ఈ దివ్యప్రబంధంలో కన్యలు ఆచరించే మార్గళినోముకు సంబంధించిన ముప్పై గీతాలు ఉన్నాయి. వానలు బాగా కురిసి దేశం సుభిక్షంగా ఉండడమూ, తగిన వరుని పొందడమూ ఆ నోముకు లక్ష్యాలు. భాగవతంలో గోపికలు శ్రీకృష్ణుని వరునిగా పొందగోరుతూ చేసిన 'కాత్యాయనీ వ్రతం' దీనికి మూలం. ఈ వ్రతం ద్రావిడదేశంలో సంఘవాఙ్మయ కాలంలో అనుష్ఠానంలో ఉండినట్లు తెలుస్తుంది.[1] మార్గళినోములో కాత్యాయని ప్రసక్తి లేకపోవడం విశేషం.

గోదాదేవి శ్రీవిల్లిపుత్తూరునే వ్రేపల్లెగాను, అందులోని కన్యలనే గోపికలుగాను, వటపత్రశాయి ఆలయాన్నే నందుని గృహంగాను, ఆ స్వామిని శ్రీకృష్ణుడుగాను భావిస్తూ ధనుర్మాసవ్రతం నిర్వహించి అభీష్టసిద్ధి పొందింది. ఆ ముప్పై రోజుల వ్రతంలో ఆధ్యాత్మిక విరహంతో రోజుకు ఒక్కొక్కటి ప్రకారం ఆమె పాడిన తిరుప్పావు గీతాలకు పాశు

రములని ప్రసిద్ధి. ఆ గీతాలను అనువదించడంలో కృష్ణశాస్త్రి ప్రదర్శించిన నైపుణ్యాన్ని పరిశీలించే ముందు ఇందులోని ఇతివృత్తాన్ని సమీక్షించడం ఆవశ్యకం.

ఇతివృత్తం

కృష్ణశాస్త్రి తిరుప్పావు అనువాదానికి ప్రస్తావనగా గోదా శ్రీరంగనాథుల ప్రార్థిస్తూ వ్రాసిన 'ఆవాహాన గీతాలు' వైష్ణవ సంప్రదాయాన్ని అనుసరించాయి. ఇందులో కవి తన 'అంధమూక మందిరం'లో ఒకసారి అడుగుమోపి 'కోస వ్రేళుల కాస్త వీని గొంతు తాకి' 'మసిలే మానము గీతామణి దీపికలై వెలుగ' జేయుమంటూ గోదాదేవిని ప్రార్థించడంలో అతని విషాదజీవితమూ, భక్తిపారవశ్యమూ వ్యక్తమవుతాయి.

తిరుప్పావు గీతాలలో (1) ధనుర్మాస వ్రతానుష్ఠాన విధానం, (2) గోపికలకు మేల్కొలుపులు, (3) నంద యశోదా నీలా కృష్ణులకు మేల్కొలుపులు, (4) శ్రీకృష్ణునకు మంగళా శాసనం, (5) వ్రత ప్రయోజనాదికం, (6) ఫల శ్రుతి — అనే ఆరు ప్రధానాంశాలు ఉన్నాయి.

"రారమ్మ ఓ అమ్మలారా! రారే మమ్మ !
నీరాడ మనసున్నవారు, మీరూ- మీరు! .... "

ఇది తిరుప్పావులో తొలి గీతం. వ్రేపల్లె గోపికలను మార్గశిర స్నానానికి ఆహ్వానించడం ఇందులోని విషయం. జరుపబోయే వ్రతానికి 'యశోదమ్మ ముద్దు సింగపు కొదమ' కారుణ్యం సాధించడం ధ్యేయంగా పేర్కొనబడింది. వ్రత విధానం వివరించబడింది. త్రివిక్రముని స్మరిస్తూ తానమాడితే నెల మూడు వానలుకురిసి దేశంలో ఈతి బాధ లుండవని చెప్పబడింది. 'జగతికి హర్షము' కలిగే విధంగా వర్షం కురిపించుమంటూ

మేఘుడు ప్రార్థింపబడ్డాడు. ఈ సందర్భంలో మేఘునికీ శ్రీకృష్ణునికీ చక్కని సాదృశ్యం కల్పించిన గోదాదేవి ప్రతిభ కొనియాడదగ్గది. శ్రీ నామ సంకీర్తనవల్ల పాపాలు నశిస్తాయని పేర్కొనబడింది.

'తెలవారుచున్నదిగదే...' అనే గీతం మొదలుకొని 'ఓ చిలుత రాచిలుక లేచి రావేమే ...' అనే గీతందాక గోపికలకు మేల్కొలుపులు. ఇవి భక్తిపారవశ్యంతో మైమరచిన గోపికలకే కాక, సంసార సాగరంలో మగ్నమైన జీవాత్మలకు కూడ మేల్కొలుపులే. ఈ సందర్భంలో శ్రీకృష్ణ గుణగానంతోపాటు వ్రేపల్లెలోని ఉషఃకాల సౌందర్యం మనోహరంగా గీతికారూపం ధరించింది.

'నందగోపస్వామి మందిర రక్షకుని'కీ, నందునికీ, యశోదకూ, బలదేవునికీ, శ్రీకృష్ణునికీ మేల్కొలుపులు పాడబడ్డాయి. ఇందులో గోపికల స్వభావమూ, వారు వచ్చిన కార్యమూ స్పష్టం చేయబడింది.

" నందగోపుని కోడలా! ఓ నీల!
ఎందుకమ్మా తలుపు తీయవు? ...."

అంటూ నీలాదేవి ప్రార్థన జరిగింది. ఉత్తర భారతదేశంలో రాధకు ఉన్నంత స్థానం ద్రావిడదేశంలో నీలాదేవికుంది[2]. జగన్మాత ద్వారానే జగత్పితను ఆశ్రయించాలనే వైష్ణవ సంప్రదాయానికి అనుగుణంగా నీలాదేవి ప్రార్థన సాగింది. శ్రీరామానుజులకు ఈసందర్భంలోని 'ఉన్దు మదకళిత్తన్ ...' అనే మూలగీతం మిక్కిలి అభిమానపాత్ర మైనట్లు తెలుస్తుంది. నీలాదేవి గుణరూప సౌభాగ్యాలు రమణీయంగా వర్ణింపబడ్డాయి. అటుతరువాత అపర లక్ష్మీనారాయణులైన నీలాకృష్ణుల ప్రార్థన కొనసాగింది. స్వామి దివ్యత్వమూ కారుణ్యమూ స్తుతింపబడ్డాయి.

" మంగళమని పాడవస్తిమి
మరి మరి నీ మగటిమికి - మంగళ మని! ..."

అనే మంగళాశాసనానికి ఈ గీతాలలో ప్రముఖస్థానముంది. ఇక్కడ భగవంతుని రామావతార కృష్ణావతారాలు కీర్తింప బడ్డాయి. భగవంతునికి మంగళ శాసనం చేసిన వారిలో పెరియాళ్వారు సుప్రసిద్ధుడు. అతనిది వాత్సల్య భక్తి. గోదాదేవిది మధుర భక్తి. మూలంలోని మంగళాశాసనాన్ని కృష్ణశాస్త్రి వివరణాత్మకంగా అనువదించడం ఔచిత్య పూరితం.

'అర్థులము అనుగులము...' అనే గీతం మొదలు 'చీకాకు పడకు, చిడిముడి పడకు...' అనే గీతందాక శ్రీకృష్ణుని గొప్పదనం భక్తి పారవశ్యంతో వర్ణింపబడింది. గోపికలు విరహాన్ని విస్మరించి పరవాద్యాన్ని, పరమానందాన్ని ప్రసాదించుమంటూ వ్రతానికి కావలసిన పరికరాలను అర్థిస్తారు. స్వామితో ఎన్నో జన్మల అనుబంధాన్ని ఊహిస్తారు.

"ఒకటే కోరిక మాకిక
ఓ స్వామీ! గోవిందా! ..."

అనే గీతంలో శ్రీకృష్ణునితో ఏడేడు జన్మల బంధాన్ని కోరుతూ గోపికలు తమ ఉత్కృష్టమైన తృష్ణను వ్యక్తం చేస్తారు. స్వామి కైంకర్యాన్ని ఏ నాటికీ మానమని విన్నవిస్తారు. ఈ దివ్యప్రబంధంలోని గోపికలు గోదాదేవి హృదయానికి ప్రతిబింబాలు; సమస్త భక్తలోకానికి ఆదర్శాలు.

"శుభమగు గాత! సుఖమగుగాత!
ఉభయ విభూతి నాయకుడౌ శ్రీ
విభుని ప్రసన్న సులభుని దయచేత! ...."

అనే గీతం ఈ కావ్యానికి ఫల శ్రుతి. లోకానికి శుభం జరుగాలనీ, తిరుప్పావు కృతిని తెలుసుకొన్నవారికి ఇహ పర సౌఖ్యాలు సిద్ధించాలనీ కోరబడింది.

## అనువాద రామణీయకం

స్వతంత్ర కావ్య రచనకంటె సమర్థవంతంగా అనువాద కావ్య రచన చేయడం కష్టసాధ్యం. మూలహృదయాన్ని ఆవిష్కరిస్తూ స్వతంత్ర రచనలాగే తీర్చి దిద్దడంలో కృష్ణశాస్త్రి తన అసాధారణ ప్రతిభ ప్రదర్శించాడు. మూలంలో ఎనిమిదేసి చరణాలు గల గీతాలు పాదనియమం పాటించకుండ అనువదించబడ్డాయి. ప్రతి గీతానికీ చివర మూలంలో 'ఏలోరెమ్బావై' అనే మకుటముంది. ఆ నియమం ఇందులో పాటింపబడలేదు. ఆయా గీతాలలోని ముఖ్యాంశాన్ని ఆధారంగా చేసుకొని పల్లవి కల్పించుకొనబడి ఉండడం రసవంతం. ఇందుకు అపవాదంగా 'బంగరు కడవల నిండా పాలు'. అనే గీత మొకటి కనిపిస్తుంది.

ఇందులో యథా మాతృకంగా జరిగిన అనువాదం స్వల్పం. మూలానికి వన్నె పెట్టిన సందర్భాలూ, వివరణాత్మకంగా సాగిన సందర్భాలూ ఎక్కువ. అందువల్ల ఈ గీతావళి స్వతంత్ర రచనలాగే హృదయంగమంగా రూపొందింది. ఇందుకు కొన్ని ఉదాహరణలు పరిశీలించడం యుక్తం.

" తెలవారు చున్నది గదే! లేవే! లేవవే!
కలకలా కూసేను పులుగులు - ఓబాల! ...."

ఇందులోని 'బాల'కు మూలం 'పెణ్ణాయ్'. దానికి 'చిన్న పిల్ల' అని అర్థం. మార్గళి వ్రతం చేసే కన్యలు చిన్న పిల్లలు కాదు. అందువల్ల పదహారేండ్ల లోపలి కన్య అనే అర్థమిచ్చే 'బాల' శబ్ద ప్రయోగం సముచితం.

" విన లేదటే వెర్రి జవరాల ..."

ఇందులోని 'వెర్రి జవరాల'కు మూలం 'పేయ్ పెణ్ణే'. దానికి 'పిచ్చి మగువా' అని అర్థం. దానిని 'వెర్రి జవరాల' అని అనువదించడం రసవంతం.

"ఓ చిరుత రాచిలుక లేచి రావేమే ...."

ఇందులోని 'చిరుత రా చిలుక'కు మూలం 'ఇళజ్గిళియే'. దానికి 'లేం జిలుక' అని అర్థం. దానిని 'చిరుతరా చిలుక'గా అనువదించడం మనోహరం.

".... నేయి పెన్నమీగడలు, తీయనిపాయసము
చేయి మునుగగా ఆరగింపగా, చేయవా చిత్తగింపవా ...."

దీనికి మూలం 'పాల్ శోఱు మూడ నెయ్ పెయ్దు ముళజ్గై వళివార ... యామ్ పెఱు సమ్మానమ్' అనేది. దానికి 'క్షీరాన్నము మునిగిపోవు నటుల మోచేతి మీదుగా నేయి కారుచుండగా — మేము పొందవలయునను సమ్మానము'[3] అని భావం. మూలంలోని 'నేయి'కి తోడుగా అనువాదంలో 'వెన్న మీగడలు' చేరాయి, 'మోచేతి మీదుగా నేయి కారడానికి' బదులు 'చేయి మునగడం' ఔచిత్య పూర్ణమైన అనువాదం. కృష్ణశాస్త్రి అనువాదం తిరుప్పావు దివ్యత్వానికి భవ్యత్వం సమకూర్చింది.

మార్గశిరంలో స్త్రీ పురుష భేదం లేకుండ శ్రీవైష్ణవులు పారాయణం చేసే తిరుప్పావు గీతాలను సర్వజనోపయోగకరంగా సంకీర్తన పద్ధతిలో మృదు మధురంగా ఆంధ్రీకరించిన కృష్ణశాస్త్రి ధన్యుడు. ఈ కృతి తెలుగు సరస్వతికి ఒక అమూల్యాభరణం.

స్వచ్ఛమైన సువర్ణాన్ని నూతనమైన ఆభరణంగా తయారు చేసినట్లు కృష్ణశాస్త్రి రచన సాగింది; దీని ద్వారా కవి తమిళులకూ, ఆంధ్రులకూ గణనీయమైన సేవ చేశాడు[4] — అని ఆచార్య కె. ఎస్. శ్రీనివాస అయ్యంగారు ప్రశంసించడంలో అతిశయోక్తి లేదు.

— ❀ —

# శ్రవ్యరూపకాల స్వాస్థవం

"దృష్టపూర్వాపి హ్యర్థాః కావ్యేరస పరిగ్రహాత్
సర్వే న వేవాభాంతి మధుమాస ఇవ ద్రుమాః"

ఆధునికాంధ్ర సాహిత్య రసాలంలో సరిక్రొత్తగా చిగురించి వికసించిన శ్రవ్యరూపక శాఖకు చక్కని రూపు రేఖలు దిద్దినవారిలో కృష్ణశాస్త్రి ప్రథమ శ్రేణికి చెందినవాడు. 'సద్యః పరనిర్వృతి'కి ఈ ప్రక్రియ పెట్టింది పేరు. ఈ రచనలో కృతకృత్యత పొందడానికి వస్తుస్వీకారం లోను, దానిని మలచుకోవడంలోను, క్లుప్తంగా పాత్రోచితంగా సంభాషణలు కూర్చడంలోను, పరిమితంగా పాత్రలను ప్రయోగించడంలోను రచయిత మంచి మెళకువ పాటించాలి. కృష్ణశాస్త్రి నాటికలలో చాల వాటిలో ఈ అంశాలు కనిపిస్తాయి.

శ్రవ్యరూపకాలు రెండు విధాలు. (1) వచన నాటికలు, (2) సంగీత నాటికలు. వచన నాటిక అర్థావగాహనకు అవరోధం లేకుండ సాగిపోతుంది; సంగీత నాటిక భూదివాల మధ్య డోలగా, ఊహల హేలగా రసజ్ఞులను మైమరపిస్తుంది[1]. కృష్ణశాస్త్రి వ్రాసిన రూపకాలలో సంగీత రూపకాలే ఎక్కువ. వాటిలో మధ్య మధ్య వచన సంభాషణలుకూడ చేరి ఉండడంవల్ల శ్రోతలకు విసుగు రాని విధంగా శోభిస్తున్నాయి. ఇతివృత్త స్వభావాన్నిబట్టి కృష్ణశాస్త్రి రూపకాలు మరల రెండు విధాలు. (1) పౌరాణిక రూపకాలు, (2) సాంఘిక రూపకాలు.

## పౌరాణిక రూపకాలు

"శర్మిష్ఠ" ప్రణయ రూపకం. ఇందులో శృంగారం అంగి; శాంతం అంగం. హేమంత ఋతువునకు వీడ్కోలుతో ప్రారంభమై, వసంతఋతుగానం ప్రాధాన్యం వహించింది. దేవయానికి హేమంతమూ,

శర్మిష్ఠకు వసంతమూ సంకేతాలు. యయాతి జీవితోద్యానంనుండి వైరాగ్యంతో దేవయాని నిష్క్రమించగానే, మధుర స్వప్నాలతో శర్మిష్ఠ అందులో ప్రవేశిస్తుంది. యయాతి వయస్సు పడమటి దిక్కుకు వాలినా అతనిలో విషయవాంఛ తగ్గకపోవడం విశేషం. భారతకథలో దేవయాని ప్రతీకార నిమిత్తం వెళ్ళిపోగా ఇందులో కవి చేసినమార్పు రసవంతం.

శర్మిష్ఠ ఆగామి కథను సూచిస్తూ 'మాసిన తలువేదో తీసినయట్లు ప్రాసాదమున కవలఁ మోసి అలికిడఁలౌను ...' అని గానం చేయడం మనోహరం.

" పలిత చలిత మచ్చరణ కటకమం
జీర గళశ్రుత పింజితమ్ము.... .... "

ఇలాంటి బృందగానాలు కవి శైలీలాలిత్యానికి చక్కని రూపకల్పనలు. ఈనాటికపై రవీంద్రుని ప్రభావం ప్రస్ఫుటంగా కనిపిస్తుంది.[2].

" శ్రీ ఆండాళ్లు " లో గోదా శ్రీరంగనాథుల కల్యాణం ప్రధానాంశం. దీనికి శాంతగంభీరమైన ఉపనిషద్వాతావరణం ప్రాణం.

" తెలతెల్లవారె ప్రేపల్లెలో – వినరమ్మ, చల్లతరిచే సవ్వడి
నల్లనగు నాస్వామి నడయాడు వాడలో
వల్లమాలిన నిదుర వలదమ్మ చెలులారా! ... "

అంటూ గోదాదేవి విల్లిపుత్తూరు కన్యలను మేల్కొలుపడంతో ఈ నాటిక మొదలవుతుంది. ఆండాళ్లులాగే ఆమె (పెంపుడు) తండ్రి పెరియాళ్వారు కూడ మహాభక్తుడు. అతడు యశోదగా భావిస్తూ బాల కృష్ణునకు పాలూబువ్వా పెట్టితే, ఆమె భూదేవిగా భావిస్తూ శ్రీరంగపతికి భోగాలు సాగిస్తుంది.

పరతత్వ నిరూపణ ఫలితంగా పెరియాళ్వారు పాండ్యరాజు బహుమానాన్ని సంపాదించడమూ, ఆండాళ్లు తన సిగమాలలు భగవంతునికి సమర్పించడమూ, ఆమె ఆధ్యాత్మిక విరహమూ, శ్రీరంగం నుండి

అర్చకుడు వచ్చి గోదా శ్రీరంగనాథులకు వివాహ ముహూర్తాన్ని నిర్ణయించడమూ – ఇవి అన్నీ దివ్యసూరిచరిత్రను అనుసరించాయి[3]. వివాహం విల్లిపుత్తూరులో జరుగడం కృష్ణరాయల కల్పనను అనుసరించింది. మధుర గీతాలతో నిండిన ఈనాటికపై తిరుప్పావు ప్రభావముంది.

''గుహుడు'' వనవాసానికి వెళ్ళే సీతారామ లక్ష్మణులకు ఆతిథ్యం సమర్పించడం అద్భుతంగా చిత్రింపబడింది. శ్రీరాముడు వచ్చే తన శృంగిబేరిపురం దారిలో గుహుడు రాళ్లూ ముండ్లూ తొలగింపజేసి ఘనంగా అతిథిసేవ చేయడానికి ఏర్పాట్లు చేస్తాడు. అతని మనస్సు శ్రీరాముని సన్నిధికి పరుగెత్తుతుంది. తనకోసం స్వామి ఎదురుగావస్తున్నట్లూ, అతని అడుగుల సవ్వడి తన ఎదలో మ్రోగుతున్నట్లూ ఊహిస్తాడు. 'గుహా' అంటూ స్వామీ, 'నారామచంద్రా' అంటూ గుహుడూ కలుసుకొన్న సందర్భం ఎంతైనా హృదయంగమం. శ్రీరాముని పాదాలను తన కన్నీటితో కడిగి తన పట్టణానికి తీసుకొని వెళ్ళి ఉపచరించడంలో కవి కల్పన ప్రశంసనీయం. రామాయణంలో శృంగిబేరానికి బయటే శ్రీరాముడు విడిది చేస్తాడు. గుహుని భక్తి తాత్పర్యాలకు కృష్ణశాస్త్రి కల్పన అనుగుణంగా ఉంది. శ్రీరామునికి వీడ్కోలిచ్చే సందర్భంలో—

'' మసక మసక సందె, ఉసురుసురను గాలి, గంగజాలి మ్రోత బెంగవలన
డిల్లపడిన పడవ, అల్లన నిలుచుందు, అగుహుండు పదియు నాలుగేండ్లు''

అని కవి చెప్పిన పద్యం శ్రీరాముని దివ్యత్వాన్నీ, గుహుని దాస్య భక్తి పారమ్యాన్నీ చక్కగా వ్యక్తం చేస్తుంది. గుహుని భక్తి చిత్రణలో రవీంద్రుని ప్రభావం బాగా కనిపిస్తుంది.[4]

''ధనుర్దాసు'' తన ప్రేయసి హేమాంగి నేత్రసౌందర్యాన్ని అరక్షణంకూడ చూడకుండ ఉండలేనివాడు. శ్రీరంగ చైత్రోత్సవంలో ప్రేయసి కలువ కన్నులకు గొడుగు పట్టడాన్ని చూచి శ్రీ రామానుజులు అతనికి దివ్యనేత్ర సందర్శనం చేయించడమూ, ధనుర్దాసు పరమ భాగవతుడై భక్తి తన్మయత్వంతో స్వామిని స్తుతించడమూ మిక్కిలి

సహజ సుందరంగా చిత్రింపబడ్డాయి. ఈకథ సంప్రదాయానుగుణంగానే సాగింది.

"కావేరి రంగ రంగా నాయన్న కస్తూరి రంగ రంగా ...."
"ఈ యాదు జన్మము ఎత్తిన ఫలమేమి ..."

మొదలైన అనేక గీతాలతోపాటు కొన్ని తమిళ గీతాలుకూడ చేర్చబడి ఉండడం స్వాభావికతకు సన్నిహితంగా ఉంది.

"సాయుజ్యము"లో శివభక్తుడైన మల్లాణ మహాకవి మల్లాణి అనే వారకాంతకు తన హృదయాన్నీ, ధనాన్నీ సమర్పించడమూ, కులంతో నిమిత్తం లేకుండ ఆమె గుణాన్ని అచంచల ప్రేమతో ఆరాధించడమూ, కడకు ప్రియురాలి ప్రేరణవల్లనే మరల తన హృదయాన్ని మహేశ్వరునకు అంకితం చేసి కైవల్యాన్ని పొందడమూ అద్భుతంగా చిత్రింపబడ్డాయి. మల్లాణి సౌందర్యరాశి మాత్రమే కాదు సంగీతంలో సరస్వతి, నాట్యంలో రంభ, ప్రియుని ధనాన్ని ఆమె సత్కార్యాలకే వినియోగించింది. వేశ్యావృత్తికి ప్రేరేపించిన తల్లి ఆజ్ఞ నుల్లంఘించింది. ప్రియునిలో నిద్రాణమైన శివభక్తిని జాగృతం చేయడానికి ఆమె చేసిన ప్రయత్నం అసదృశం.

"నీ కన్న సొగసుకాడేదయా? నా స్వామి
నీ కన్న నా వేలుపేదయా? .... .... "
"కైలాసపురినుండి కాశికై, కాశికాపురినుండి దాసికై
వేంచేసినావయా విజయేశ్వరేశ్వరా! .... .... "

అని మల్లాణి పాడిన పాటలూ, మల్లాణి మహేశ్వరుని వెనుక చేరినప్పుడు—

"అరెరె! నా మ్రోల సుందర తరుణమూర్తి
నీవా మల్లణి! నా తండ్రి! నీవా నీవా! .... "

అంటూ మల్లాణుడు ప్రేయసికీ శివునకూ అభేదాన్ని ఊహిస్తూ క్రమంగా 'మద నారి'వల్ల దారి తప్పిన తనకు క్రొత్త వెలుగును ప్రసాదించు

మంటూ 'మదనారి'ని ప్రార్థించడమూ ఎంతో రసవంతంగా ఉన్నాయి.' 'అజవం జవంబను గహనంబు సింక అథవా! చొరజాలను .....' అంటూ మల్హణుడు పరితపించినట్లు చిత్రించడంలో కృష్ణశాస్త్రిలో ధూర్జటికి దీటైన భక్త్యావేశం గోచరిస్తుంది.

"కృష్ణాష్టమి"లో శ్రీకృష్ణుడు వ్రేపల్లెలో చేరిన విషయం ఇతివృత్తం. కృష్ణుడు అవతరించిన కొద్ది సేపటికే యశోద ఒడి చేరుతాడని దైవజ్ఞులవల్ల తెలుసుకొన్న రాధ, నందుడు, ఉద్ధవుడు – ఆ సుముహూర్తంకోసం నిరీక్షించడమూ, వసుదేవుడు దేవకీ పుత్రునిచ్చి యశోద పుత్రికను తీసుకొని వెళ్లడమూ, మగత నిద్రలో నున్న యశోదకు ఇదేమీ తెలియకపోవడమూ రసవంతంగా చిత్రింపబడ్డాయి. ఇందులోని కల్పనలు ఔచిత్య శోభితాలు. శ్రీకృష్ణభగవానుడు రాబోయే విషయాన్ని తెలుసుకొన్న రాధ హృదయం —

"ఈ వింత లీలాటి వేరేయి చూచేనా
ఏ వీటి అతిథి ఇపుడేగుదెంచేనా .... "

అంటూ పరవశించి పాడింది. 'జో చిన్ని కృష్ణ జో ముద్దు కృష్ణ ...' అని జోల పాటతో పాటు, 'మామక హృదయాంత సంచార ...' అంటూ వలపు పాట పాడడంలో రాధ అలౌకిక ప్రణయ చిత్రణం మనోహరంగా సాగింది. 'ఈ దారి నా స్వామి నడచేనా? పాదాల జాడలవి విడిచేనా? ...' ఇలాంటి గోపి గోపికా గీతాలు ఈ నాటికకు అలంకారాలు.

"యమునా విహారి"లో శ్రీకృష్ణుడు గోపికలతో కలసి యమునా విహారం చేయడం ఇతివృత్తం. బృందావనం నుండి బయలుదేరిన శ్రీకృష్ణుని మురళీ రవళులు గొల్లల లోగిళ్ల గుండెలను మైమరపించి గోపికలనే కాక ఉద్ధవునికూడ పరుగులు తీయిస్తాయి. 'అతనొక్కడే మగవాడు' అని ఉద్ధవుడు వాకొనడం విశేషం. గోపికలు ఒక వైపు కూర్చోగా, శ్రీకృష్ణుడు ఒకవైపు కూర్చొని పడవ నడుపుతాడు.

"తెల్లని వెన్నెల్లో, నల్లని మబ్బుల్లా
నీలపు మబ్బుల్లా, నేల నడుస్తాయా.... "
"రెల్లూ పూలా పానుపుపైనా, జల్లూ జల్లులుగా-ఎవరో
చల్లినారమ్మా! వెన్నెల చల్లినారమ్మా!...."

ఇలాంటి పాటలు ఈ నాటికలో మధురాతి మధురంగా వినిపిస్తాయి. గోపికాకృష్ణుల యమునా విహారం రసజ్ఞుల హృదయాలను ఆనంద డోలికలలో ఊగిస్తుంది.

"శివక్షేత్ర యాత్ర"లో ఆంధ్ర దేశంలోని ప్రధానమైన శివ క్షేత్రాల వర్ణన సాగింది. ఇందులోని కథల కామశాస్త్రి, పాటల కోటయ్య, సుబ్బమ్మ, సూరమ్మ మొదలైన పాత్రలు నామ మాత్రమైనవి. శ్రీకాళహస్తి, శ్రీశైలం, సప్తగోదావరంలోని ద్రాక్షారామ భీమేశ్వరాలయం మొదలైన ఆలయాల విశేషాలూ, వివిధ శివలింగాల ప్రస్తావన దీనిలో కనిపిస్తాయి.

"శివశివ అనరాదా, శివనామము చేదా! .... "
అల్లదిగో శ్రీశైలం, అదియేనా శ్రీశైలం! ...."

ఇలాంటి భక్తిగీతాలు మనోజ్ఞంగా సాగాయి. కృష్ణశాస్త్రికి గల వివిధ పుణ్యక్షేత్రాల పరిజ్ఞానం ఈ నాటికలో వ్యక్తమవుతుంది. స్థలపురాణాలలోని అంశాల ప్రస్తావన తరచు కనిపిస్తూ ఉన్నందువల్ల దీనిని పౌరాణిక రూపకాలలో చేర్చడం జరిగింది.

సాంఘిక రూపకాలు

"ఏడాది పొడుగునా" నాటికలో తెలుగు గ్రామాలలోని కుటుంబ జీవితమూ, పండుగలూ పబ్బాలూ, పొలంపనులూ మొదలైన అంశాలు ప్రాధాన్యం వహించాయి. 'అల్లుడొస్తున్న దోసపాదు' లాంటి సీతమ్మ - రామస్వామి కుటుంబం దీనికి నామమాత్రమైన ఆలంబనం.

మేనరికం పెండ్లీ, శుభ లేఖలతో అవసరం లేకుండ బంధువర్గమంతా వచ్చి వాలడమూ, వర్షాకాలంలో బసవన్నకూ నాగలికీ పూజ జరుగడంతో సేద్యపు పనులు మొదలు కావడమూ, దసరాపండుగ, శ్రావణ శుక్ర వారపు నోములూ-ఇలాగే ఏడాది పొడుగునా సాగిపోయే గ్రామీణ జీవితానికి ఈ నాటిక అద్దం పట్టింది.

"ఎవరాడబడుచమ్మ - ఎవరాడబడుచు...."

(పేరంటాలు పాట)

"మొయ్యర అమ్మోర్పి మొయ్, మెల్లగ -అ-మెల్లగ...."

(పల్లకీపాట)

"వానదేవుడా ఓ వానదేవుడా, రాణతోను రావయ్య వానదేవుడా...."

(వానపాట)

"ఏరువాకమ్మకి ఏమికావాలి?, ఎర్రనెర్రని పూలమాల కావాలి...."

(ఏరువాకపాట)

"పీరు చల్లిన ముంగిట్లో, పన్నీరు చల్లిన వాకిట్లో..."

(గంగిరెద్దువానిపాట)

"పిల్లవాళ్ళకు పెట్టు పప్పు బెల్లాలు!
అయ్యవారికిచాలు అయిదు వరహాలు!"

(దసరాపాట)

ఇలాంటి అనేక గేయాలలో జానపద జీవితమే కాక కృష్ణశాస్త్రి జాన పద కవితారీతి కూడ స్పష్టమవుతుంది.

"గౌతమి"లో కథకు ప్రాముఖ్యంలేదు. సూరన్న కాపు కుటుం బం ఆలంబనంగా గోదావరీతీరంలోని గ్రామీణజీవితం దీనిలో ప్రతి బింబిస్తుంది. కాపులకూ కరణాలకూ ఉండే అనుబంధమూ, పురాణ కాలక్షేపాలూ, గ్రామీణులకు పట్టణాల నాగరికతపైనా, సినిమాల పైనా మోజు పెరగడమూ మొదలైన అంశాలు దీనిలో కనిపిస్తాయి. గౌతమీనది వరదాయినిగానే కాక, దుఃఖదాయినిగా కూడ ఈ నాటి కలో చిత్రింపబడింది.

"ఉరకలు పరుగులు తీసి, చెంగూ చెంగున పొంగుతువచ్చే గోదారి.... "
(నీలాటిరేవుపాట)

"రండి రారండి కనరండి కనులార, రైతు జనులార మోతుబరులార ...."
(పొలంపాట)

ఇలాంటి పాటలు గ్రామీణ వాతావరణాన్ని చక్కగా వ్యక్తం చేస్తున్నాయి.

"వేణుకుంజం"లో గ్రామసీమలలో బలవంతులు బలహీనులపై జరిపే అత్యాచారాలకు ప్రాతినిధ్యం వహించే కరుణగాథ చిత్రింపబడింది. 'అచ్చోసినఆబోతు'లాంటి కొండయ్యదొర తన పాలేరు గోపయ్యకు మనసిచ్చిన 'అచ్చర' లాంటి వీరమ్మ శీలాన్ని దోచుకోవడాన్ని, కులానికి తక్కువైనా గుణానికి సాటిలేని వీరమ్మ పిడుగుపాటుతో మరణించడాన్ని, ఆమె తండ్రి వెంకటేశు విలపించడాన్ని కవి స్వాభావికంగా చిత్రించాడు. కొండయ్యను నాగేంద్రునితో కాటు వేయించడం సముచితంగా ఉంది.

"ఏం సొగసో! వీరమ్మది, ఏం సోయగ మీరమ్మది!
కందిరీగలాంటి నడుం, కదురులాంటి ఒళ్ళు..."

ఇలాగ వీరమ్మ అందాన్ని చిత్రించడంలో నండూరివారి ఎంకి లక్షణాలు కొన్ని కనిపిస్తాయి. ఈ నాటికలలో కవి అసహాయులపట్ల తన సానుభూతిని వ్యక్తం చేశాడు.

"బహుకాల దర్శనం"లో పెద్దమనిషిగా నటిస్తూ తన కట్టుకథలతో ప్రజలను నమ్మించి బిచ్చమెత్తుకొనే శ్రీరాములు అనే ఒక విచిత్రమైన వ్యక్తికథ ఇతివృత్తం. అతనికి 'నాన్‌కో ఆపరేషన్' ఉద్యమం మొదలుకొని దేశంలో సంభవించే భూకంపాలు, వరదలు మొదలైన ఎన్నో విషయాలు కరతలామలకాలు. రైల్వేప్లాటు ఫారాలవద్ద, బస్సుస్టాండులవద్ద నిలబడి, వచ్చిపోయే ప్రయాణికుల వివరాలు వా

సంభాషణద్వారానే పసిగట్టి, తిన్నగా దగ్గరికిపోయి 'బహుకాల దర్శనం-బహుకాల దర్శనం' అంటూ పలుకరిస్తూ, ఏదోవిధంగా వారితో 'బాదరాయణ సంబంధం' కల్పించుకొని, కడకు టికెట్టు పోయిందనికాని పరుసు పోయిందనికాని లేదా ఏదో సహాయనిధికనిగాని సమయోచితమైన కట్టుకథ అల్లి రాలినంతమాత్రం దులుపుకొంటాడు. విశేషమేమంటే నిజం తెలుసుకొని నిందించినవారు సైతం ఎంతోకొంత ముట్టజెప్పుకొనేటట్లు చేసే ఇంద్రజాలం శ్రీరాముల కుంది. నేటి సమాజంలోని నాగరికులైన వంచకులకు ఈ పాత్ర ప్రాతినిధ్యం వహిస్తుంది. ఈ నాటికకు సుకుమారమైన హాస్యం వన్నె పెట్టింది.

"మైలురాయి" భావనాత్మకమైన నాటిక. ఎప్పుడో మంత్రి వస్తేతప్ప మరమ్మత్తులేని రోడ్డుప్రక్కన కత్తిపాలెం సత్రం దగ్గరుండే మైలురాయి స్వగతం దీనికి కేంద్రం. రాజులకాలం మొదలు మంత్రులకాలందాక ఆ రాయికి అరవై ఏండ్ల అనుభవముంది. ఆ రోడ్డునపోయే మనుషులూ, పశువులూ, సైకిళ్లూ, బండ్లూ వగైరా అన్నీ దానికి పరిచితాలు. ప్రక్కన ఉండే సత్రంలో రహస్య కార్యకలాపాలు జరిపే మత్రిపాడు మనసబూ, చల్లలమ్మే గొల్లసుబ్బమ్మ హొయలూ, ఆమె కోసం పడిచచ్చే రసికులూ దానికి తెలుసు. ఆ రోడ్డున పోయే బస్సులో నూటయాభై మంది ఉక్కిరి బిక్కిరవుతూ ఉండడమూ, అందులో సగం ఒక సెట్టి ఆక్రమించుకోవడమూ, ఆడవాళ్ళ సీట్లలో మగవాళ్ళు జొరబడడమూ, కండక్టరు విచిత్రభాషణమూ బాగా తెలుసు. 'శనోరం పిట్టాపురం సంతసూసుకొని, సోంవారం దాచ్చారం సంతకు' వెళ్ళే పశువుల వ్యాపారుల లాభ నష్టాల చర్చలూ, పెళ్లిళ్లకు వెళ్లేవారి కట్నాల కానుకల ముచ్చట్లూ, పొట్టల బరువుతో బండిలో కాస్త చోటిమ్మని అడిగే బాపనయ్యలతో 'ఎల్లండెల్లండోయ్ సాత్తుంలూ... కొత్తెద్దు కొనుక్కోలేను ఈ కరవు రోజుల్లో' అంటూ బండ్లవాళ్లు

చెప్పే సమాధానాలూ ఆ రాయికి క్రొత్తవికావు. జబ్బునయం కావ డానికి 'స్లీప్లూ - ఈ బూతీ' అడిగే అమాయకులనుండి దక్షిణలు తీసు కొని కనిపించిన ఏ రాయినో దేవుడంటూ నమ్మిస్తూ, కడకు మైలు రాయిలో 'నూకాలమ్మ వెలసింది' అంటూ బెంకాయకొట్టే శాస్త్రిలూ ఇందులో కనిపిస్తారు. సుకుమారమైన హాస్యంతోపాటు సునిశితమైన సాంఘిక విమర్శతో కూడిన ఈ నాటిక కృష్ణశాస్త్రి ప్రతిభకు చక్కని నిదర్శనం.

> " The road is my wedded companion;
> She speaks to me under my feet all day
> She sings to my dreams all night "[4]

అనే రవీంద్రుని ప్రవచనానికి సన్నిహితంగా కృష్ణశాస్త్రి 'మైలురాయి' రూపొందింది.

గుహుడు, ధనుర్దాసు, సాయుజ్యం మొదలైన పౌరాణిక నాటి కలలో కృష్ణశాస్త్రికి రసపోషణలోను పాత్రపోషణలోను గల నైపు ణ్యమూ, గేయాలలోను పద్యాలలోను హృదయంగమమైన కవితా రామణీయకమూ సహృదయులకు అసాధారణమైన రసానందాన్ని ప్రసాదిస్తాయి. సాంఘిక నాటికలలో ఆంధ్ర దేశంలోని ప్రకృతి విశే షాలూ, సాంఘిక స్థితిగతులూ సంస్కరణాత్మకమైన దృక్పథం వెల్లి విరిసే సన్నివేశాలూ వినోద విజ్ఞానాలు రెంటినీ అందిస్తాయి.

" Heard melodies are sweet, but those unheard are sweeter "[5] — అని కీట్సు పేర్కొన్నట్లు 'విన్న మాధుర్యాన్నే కాక వినని మాధుర్యాన్నికూడ వినిపింపజేసే' శ్రవ్యరూపక ప్రక్రియలో కృష్ణశాస్త్రి నాటికల సౌష్ఠవం ప్రశంసనీయం.



# వచన రచనల వైశిష్ట్యం

> "రమ్యం జుగుప్సిత ముదార మథాఽపి నీచం
> ఉగ్రం, ప్రసాది గహనం వికృతం చ వస్తు
> యద్వాప్యఽవస్తు కవి భావుక భావ్యమానం
> తన్నాస్తి య న్నరసభావ ముపైతిలోకే"

'గద్యం కవీనాం నికషం వదంతి' అంటూ పెద్దలు సాహిత్య ప్రక్రియలన్నింటిలోను రచయిత సామర్థ్యానికి వచనరచననే గీటు రాయిగా పరిగణించారు. యజ్ఞంలాంటి వచనరచనలో బహుముఖ ప్రజ్ఞాసంపన్నులే కృతకృత్యులవుతారని భావం. కృష్ణశాస్త్రి వచన రచనలు పండిత పామర రంజకాలై సాహిత్యంలో ఒక విశిష్ట స్థానాన్ని అందుకొన్నాయి.

కృష్ణశాస్త్రి వ్యాసాలు విషయ వైవిధ్యంతో పాఠకులను ఆశ్చర్య మగ్నులుగాచేస్తూ అతని సంస్కార సంపత్తినీ, ఉదాత్తమైన సంస్కరణ దృక్పథాన్నీ వ్యక్తం చేస్తున్నాయి. విషయ ప్రాధాన్యాన్నిబట్టి ఈ వ్యాసాలను నాలుగు వర్గాలుగా విభజించవచ్చు. 1. సారస్వత వ్యాసాలు 2. వివేచనాత్మక వ్యాసాలు 3. భావనాత్మక వ్యాసాలు 4. సాంఘిక వ్యాసాలు.

## సారస్వత వ్యాసాలు

"పాతిక సంవత్సరాల తెలుగు కవిత్వము" అనే వ్యాసంలో 1923 నుండి 1948 వరకు గల నవ్యాంధ్ర సాహిత్యం సమీక్షింపబడింది. పాతికేండ్లలో తెలుగు సాహిత్యా పరిణామాన్నీ, దాని స్వరూప స్వభా వాలనూ దీనిలో సంగ్రహంగా చర్చించడం జరిగింది. అధునికకవుల లోని ఏకత్వ భిన్నత్వాలను పేర్కొని, సామాజిక స్థితిగతులను అనుస రించి సాహిత్యం మారవలసిన ఆవశ్యకం స్పష్టం చేయబడింది.

నవ్యసాహిత్య వికాసానికి దోహదం చేసిన కాల్పనికోద్యమాన్నీ, మానవోద్యమాన్నీ, హైందవ జాతీయోద్యమాన్నీ, జాతీయోద్యమాన్నీ—వాటి విశిష్ట లక్షణాలనూ, ఆ ఉద్యమాలకు ప్రతినిధులైన కవులనూ పేర్కొనడంలో కృష్ణశాస్త్రి నైపుణ్యం వ్యక్తమవుతుంది. నవ్యసాహిత్యాన్ని ప్రచారం చేయడంలో పత్రికలూ, సాహితీ సమితీ చేసిన కృషి విశదీకరింపబడింది. అందులో కృష్ణశాస్త్రి నిర్వహించిన పాత్రనూ, అక్కిరాజు ఉమాకాంతంలాంటి సంప్రదాయవాదుల దాడికి తట్టుకో గలిగిన నవ్యకవుల ధైర్యస్థైర్యాలనూ కవి చక్కగా వివరించాడు.

గురజాడ, వేంకట పార్వతీశ్వరులు, రాయప్రోలు, విశ్వనాథ, అబ్బూరి, బసవరాజు, ఇంద్రగంటి, శ్రీ శ్రీ, ఆరుద్ర మొదలైన వారి సాహిత్యవిశేషాలనూ, స్వీయకవితా విశేషాలనూ ఆత్మాశ్రయ కవితా ప్రయోజనాన్ని ప్రతిభావంతంగా పేర్కొనడం గమనార్హం. కవులు సమాజానికి దూరమైన నిర్జీవ రచనలు చేయరాదని స్పష్టం చేయబడింది. ఈ వ్యాసంలో కృష్ణశాస్త్రి నవ్యసాహిత్య పరిజ్ఞానమూ, నిష్పాక్షపాత వైఖరీ సుస్పష్టమవుతాయి.

"బసవరాజు అప్పారావు మధురస్మృతి" – బసవరాజు గీతాలకు పీఠిక. ఇందులో బవరాజు సాహిత్య వ్యక్తిత్వాలు సముచితంగా సమీక్షించబడ్డాయి. కృష్ణశాస్త్రి దృష్టిలో బసవరాజు అమరలోకంనుండి అవతరించినవాడు. అతని కవిత 'నిట్టూర్పు'; దానిలో 'నెత్తురుజీర' అంటుకొని ఉంటుంది అతడు ప్రథమ భావకవి మాత్రమే కాక, భావకావ్య జగత్తుకు 'ప్రవేశిక' లాంటివాడు. మామూలు శబ్దాలను దాటిపోని అతని కవితలో గీతిది పైచేయి. కొన్ని సందర్భాలలో గురజాడను మించిపోతాడు. అతని గీతాలలో మంగళప్రదమ్మా స్మృతీ, నరసింహకుమారుని స్మృతీ అగ్రగణ్యాలు. రెండవ దానిలోని 'కాపురమ్మొచ్చిన కన్నెపాపాయి, ఇల్లు ఖాళీచేసి వెళ్ళిపోయాడు' అనే

దానిలోని రెండవ చరణం 'ప్రపంచ కావ్యభాండారంలో గొప్ప పంక్తుల్లో' ఒకటిగా నిర్ణయింపబడింది.

"ఏకాంతసేవ" అనే రచన వేంకట పార్వతీశ్వరకవుల ఏకాంత సేవ కావ్యానికి పీఠిక. ఇందులో నవ్యకవుల స్వభావమూ, నవ్యకవితా స్వరూపమూ, నవ్యాంధ్ర సాహిత్యంలో ఏకాంతసేవకు గల విశిష్ట స్థానమూ చర్చించబడ్డాయి. కవిత్వం 'ఈశ్వరప్రసాద' మనీ, దానికి రసోజ్జృంభణమూ, ఛందోబద్ధమైన 'మనోహర శబ్దసముదాయమూ కావాలనీ, కేవలం గణయతి ప్రాసల కూడికమాత్రం కవిత్వం కాదనీ పేర్కొనడం గమనార్హం. మధుర భక్తిమయమైన ఏకాంతసేవ రవీంద్రుని గీతాంజలికి సమానమని నిర్ణయిస్తూ కావ్యకర్తలను గురించి వైయక్తిక ప్రశంస ఏ మాత్రమూ చేయకపోవడం విశేషం. ఈ వ్యాసాన్ని డా॥ బెజవాడ గోపాలరెడ్డి ఆంగ్లంలోనికి అనువదించడం దీని ప్రాశస్త్యానికి నిదర్శనం.[1] నవ్యకవుల 'Literary Testament' గా ఏకాంతసేవ పీఠిక ప్రసిద్ధిపొందడం స్మరింపదగ్గ విశేషం.[2]

## వివేచనాత్మక వ్యాసాలు

"శ్రీకృష్ణావతార తత్వము"లో శ్రీకృష్ణుని అతిమానుషత్వం పేర్కొనబడింది. కవి దృష్టిలో శ్రీరాముడు మానవుడు ఎలా ఉండాలో నిరూపిస్తూ మానవుడుగా కనిపించేదైవం. కాని శ్రీకృష్ణుడు మానవుడుగా ఉంటూనే మహాకార్యాలు చేశాడు. "నేనేమి చేస్తున్నానో, ఎలాగ చేస్తున్నానో నీకెందుకు? దివ్యపద్ధతి నీకేం తెలుసు? ఫలితం చూచుకో. అది నీకోసమే. లోకకల్యాణం కోసం కూడా". అంటాడట శ్రీకృష్ణుడు. కృష్ణావతారంలోని వైవిధ్యమూ, చైతన్యమూ కృష్ణశాస్త్రిని ఆకట్టుకొన్నాయి. శ్రీకృష్ణుని రూపాలన్నీ 'జగన్మోహనాలు' ఐనా రాధాకృష్ణుడు కవికి ప్రియతముడు. ఈ అంశానికి కృష్ణ

పక్షంలోని 'అన్వేషణం' ఒక సాక్ష్యం. కవి హృదయంలో శ్రీకృష్ణుడు తాండవిస్తున్నట్లు సూచింపబడింది. ఐనా "శ్రీకృష్ణావతారతత్వం అంటే నాకు తెలియదు" అని కవి చెప్పడంలో పూర్తిగా తెలియక పోవడమే దైవతత్వ రహస్యంగా ధ్వనిస్తుంది.

"అన్నమాచారి" వ్యాసంలో తెలుగు వాగ్గేయకారులలో త్యాగరాజుకూ - తాళ్ళపాక అన్నమయ్యకూ గల భేద సాదృశ్యాలు చర్చించబడ్డాయి. అంతేకాక కవిత్వ సంగీతాలకు గల భేద సాదృశ్యాలూ వివరించబడ్డాయి. 'దివ్యరహస్యాలు' దర్శించి, 'అతిలోక వాతావరణం'లో జీవిస్తూ 'ఆత్మాశ్రయ కృతులు' వ్రాసే అలౌకిక ప్రతిభావంతు'లైన మొదటివర్గం గాయకులలో త్యాగరాజును చేర్చి, 'లోకరంగం'లో పూర్తిగా కాలూది, ప్రతిభా ఏకాగ్రతా నిరంతర కృషీ కలిగి, ఐహిక జీవితంలోని మాలిన్యాన్ని అంతగా పట్టించుకోక; సంగీత సాహిత్యాలు రెండు రెక్కలుగా 'అర్ధ్రభావ ప్రధానాలు'గా కృతులువ్రాసే 'బ్లేక్' లాంటి రెండవ వర్గం గాయకులలో అన్నమయ్యను చేర్చడం జరిగింది. త్యాగరాజు కృతులు 'నాదరచనా ప్రధానాలు'గాను, అన్నమయ్య కృతులు సంగీతసాహిత్య సమన్వితాలుగాను నిర్ణయింపబడింది. ఈ వ్యాసంలో కృష్ణశాస్త్రి సంగీత సాహిత్యాల అనుభవమూ, వివేచనాశక్తీ వ్యక్తమవుతాయి. కావ్యభావ ఇంకా విస్తృతి పొందాలనీ, ప్రజానీకానికి సన్నిహితం కావాలనీ దీనిలో కృష్ణశాస్త్రి కోరడం గమనింపదగ్గది.

"మలుపు తిరిగితే" అనే రచనలో సూక్ష్మదర్శిత్వంతో కూడిన కృష్ణశాస్త్రి జీవిత తత్వం వ్యక్తమవుతుంది. కవి దృష్టిలో మార్గం నిర్విరామంగా పరుగెత్తుతుంది, అందుకు సైకిళ్లూ, కార్లూ వగైరా పరుగెత్తడం నిదర్శనం. అలాంటి మార్గానికి మలుపులు అవసరమనీ, 'మార్గం రాగమైతే మలుపులు సంగతులు' అనీ, వాటికి తోడు ఎగుడు

దిగుడులు కూడ ఉండాలనీ, అవి లేకుంటే జీవితంలో ఒకరోజుకు మరొక రోజు 'ప్రతిధ్వని'గా మారి నిస్సారంగా ఉంటుందనీ వివరించబడింది. అంటే మార్గానికి లాగే జీవితానికి మలుపులు ఆవశ్యకమని భావం. మలుపులుంటేనే మానవుడు మహాత్ముడవుతాడని సోదాహరణంగా వ్యాఖ్యానింపబడింది. మలుపు లన్నింటి వెనుక మంగళకరమైన సంఘటనలు లేకున్నా వాటివల్ల 'మధురస్మృతి' ఏర్పడుతుందని చెప్పబడింది. నిరంతరం చైతన్యంతో కూడిన జీవితమే నిజమైన జీవితమనే అంశం ఇందులో స్పష్టం చేయబడింది.

" I love my way and I wander,
I seek what I cannot get,
I get what I do not seek "[3]

అనే రవీంద్రుని తత్వానికి అనుగుణంగా కృష్ణశాస్త్రి ఈ వ్యాసాన్ని రూపొందించాడు.

## భావనాత్మక వ్యాసాలు

"గుహుడు" అనే వ్యాసంలో శృంగిబేరపుర ప్రభువైన గుహుడు శ్రీరామచంద్రునిపట్ల ప్రదర్శించిన లోకోత్తరమైన భక్తి వివరింపబడింది. ఈ కథనే శ్రవ్యరూపకంగా వ్రాసినప్పటికీ కృష్ణశాస్త్రికి తృప్తి కలుగలేదని ఈ వ్యాసం నిరూపిస్తుంది. ఆ రూపకంలో కంటె మరికొన్ని కల్పనలు ఈ వ్యాసంలో చోటు చేసుకొన్నాయి. శ్రీరాముని ఆతిథ్య మివ్వడానికి అల్లనేరేడిపళ్లూ, కరి ఆలపాలూ, తేనెలూ సమకూర్చుకొని గుహుడు నిరీక్షించాడు. అతనిలో క్షణక్షణానికీ తొందర అతిశయించింది స్వామి పాదాలు నిరంతరంగా తన హృదయంలో నడుస్తున్నట్లు భావించాడు. శ్రవ్యరూపకంలో చిత్రించబడిన విధంగానే ఈ సందర్భంలో–

"Have you not heard his silent steps?
He comes, comes, ever comes.
Every moment and every age, every day and
every night he comes, comes, ever comes"[4]

అనే రవీంద్రుని చరణాల సాదృశ్యం కనిపిస్తుంది.

శ్రీరాముడు అల్లంత దూరాన వస్తుండగానే గుహుడు పరుగెత్తాడు. స్వామి పాదాల్రవాలి గంగాజలంతో వాటిని కడిగి, ఆతిథ్యమిచ్చాడు. మరునాడు వీడ్కోలిచ్చేటప్పుడు గుహుని దుఃఖానికి మేర లేదు. స్వామి పాదాలు మరల స్పృశించడానికోసం "రామయ్యా తండ్రీ! ఒకసారి నీపాదాన్ని కడిగితేగాని నా పడవలో అడుగు పెట్టనీయను... నా పడవకూడ స్త్రీగా అవుతుందేమో" అంటూ కాళ్ళుకడిగి అవతలి ఒడ్డు చేర్చాడు. "తండ్రీ! పద్నాలుగేడులపై ఒక్కగడియ ఆలస్యమైతే నేబ్రతుకను సుమా" అని తననిర్ణయాన్ని తెలిపాడు. అందుకు స్వామి 'అలాగే' అని సెలవిచ్చాడు. గుహుడు 'పదియునాలుగేండ్లు' 'అల్లన నిలుచుండడం'లో అతని స్వామిభక్తి పరాకాష్ఠ చెందింది. తులసీదాసు రామచరితమానసంలో స్వామి పాదస్పర్శకోసం గుహుని సేవకుడైన ఒక నావికుడు చేసిన ఉపాయాన్ని కృష్ణశాస్త్రి గుహునికి అన్వయించడంలోని ఔచిత్యం ప్రశంసనీయం.[5]

"అప్పుడు పుట్టిఉంటే" అనే వ్యాసంలో ప్రభుత కవితకు పల్లకీ ఎత్తిన విషయం చిత్రింపబడింది. రాయలు పెద్దన మనుచరిత్రను అంకితం తీసుకొనే సుముహూర్తాన్ని పురస్కరించుకొని దేశంలోని కవిపండితులూ, కళాకారులూ విజయనగరం చేరడమూ, విద్వద్గోష్ఠులూ, పెద్దన ఊరేగింపూ, పల్లకీని స్వయంగా రాయలు ఎత్తడమూ, కృతిస్వీకారమూ, పెద్దన ఇంటిలో కవుల విందూ మొదలైన విషయాలు దీనిలో కన్నులకు కట్టినట్లు ఆవిష్కరింపబడ్డాయి అవి కవులకు గొప్ప రోజులని వ్యాఖ్యానిస్తూ "అప్పుడు పుట్టిఉంటే నేనే పెద్దన్ననై పుట్టి

ఉండును'' అని కృష్ణశాస్త్రి చెప్పడంలో నేటి కాలంలో కవులకు తగిన గౌరవం లేకపోవడం వ్యంగ్యంగా సూచింపబడింది. ప్రబంధ వాఙ్మయంపై కృష్ణశాస్త్రికి గల అభిమానం ఈ వ్యాసంలో స్పష్టమవుతుంది.

''పుష్పలావికలు'' అనే రచన ప్రధానంగా ప్రబంధయుగానికి సబంధించిందే. ఆ రోజులలో పూలమ్ముతూ ఉండిన నెరజాణలైన పుష్పలావికల కౌశలమూ, సోయగమూ చమత్కారంగా వర్ణింపబడింది. 'చెట్టుకొమ్మపైన పుట్టించడం మొదలుకుని, సిగపాయలో కట్టించడం దాక వివిధకళలలో విరులమ్మే వెలదులవిద్య' వ్యాఖ్యానింపబడింది. తీరిక తక్కువైనా గౌరవం ఎక్కువగా ఉండిన పుష్పలావికలపై కాళిదాసు మొదలు తెలుగు కవులదాక ఉండిన జాలి పేర్కొనబడింది. పూలుకొనే రసికుల ప్రశ్నలకు వారు 'కాయజుతూపు' లమ్ముతూ 'కందువ మాటల'తో చెప్పే సమాధానాల విన్నాణాన్ని కృష్ణశాస్త్రి చక్కగా చిత్రించాడు.

''సువాసన ద్రవ్యాలు'' అనే వ్యాసంలో పూర్వపు రాజుల కాలంలో వాడుకలో ఉండిన సుగంధద్రవ్యాల సౌరభాలు గుబాళిస్తున్నాయి. అగరు. చందనం, జవ్వాది మొదలైన వాటితోపాటు మల్లెలు, సంపెంగలు మొదలైన పుష్పాలు కూడ పరిమళ ద్రవ్యాలలోనే చేర్చబడ్డాయి. ప్రభువుల దినచర్యలో అత్యధిక భాగాన్ని ఆక్రమించిన సుగంధద్రవ్య సంసేవనం సవివరంగా పేర్కొనబడింది. ప్రణయ జీవితంలో సుగంధద్రవ్యాల ప్రాధాన్యం చక్కగా వ్యాఖ్యానింపబడింది. ''ఆమోదానికి స్వార్థంలేదు. కలసిగట్టుదనం ఎక్కువ; అందరికీ అనుభవం పంచిపెడుతుంది.'' అంటూ సుగంధ ద్రవ్యాలవల్ల గ్రహింపదగ్గ పాఠాన్ని వివరిస్తూ, దేవాలయంలో వాటి జన్మచరితార్థం కావడాన్ని కవి చక్కగా వ్యాఖ్యానించాడు.

"అవ్వ తిరునాళ్లలో తప్పిపోయింది", "అవ్వ బస్సుప్రయాణం" అనే వ్యాసాలలో తెలుగు కుటుంబాలలో పూర్వసువాసినులైన అవ్వలకు ప్రతినిధిగా సుబ్బమ్మవ్వ చమత్కారంగా చిత్రింపబడింది. 'గడ్డు బ్రహ్మచారిణి' 'మార్కండేయాది మనుషుల లిస్టు'లోని సుబ్బమ్మవ్వ స్వరూపస్వభావాలు వాస్తవికత తొణికిసలాడే విధంగా పేర్కొనబడ్డాయి. అవ్వ శివరాత్రి తీర్థానికి వెళ్ళి అంగళ్ళవాళ్ళతో 'రామరావణ యుద్ధాలు' చేస్తూ తప్పిపోవడమూ, ఇంటిలో వాళ్ళను బాగా ఏడ్పించి తీవిగా 'పోలీసు జవాను' వెంట రాత్రి ఇంటిముందు ప్రత్యక్షం కావడమూ రసవంతంగా చిత్రింపబడింది. ఆమె ఎన్ని పేచీలు పెట్టినా ఆమెపై అందరికీ అభిమానం తగ్గకపోవడం విశేషం. ఇంటిలో వాళ్లతోపాటు బంధువుల పెండ్లికి 'వెధవ్వాళ్ల వంటలు' చేయడానికి అవ్వ బయలుదేరి, బస్సులో 'ఆస్ట్రేలియాఖండం' లాగ 'అడ్డంగా పెరిగిన' షావుకారు ప్రక్కన కూర్చొని, అతనికి 'ఉచిత సలహాలు' ఇస్తూ, 'హనుమాన్లు' అంటూ సంబోధిస్తూ అతనిని ఏడ్పించినవైనం కడుపుబ్బ నవ్వేవిధంగా వివరింపబడింది. ఇలాంటి 'పెద్దఘటాల' పట్ల సానుభూతి కనబరచాలనే ధ్వని ఈ అవ్వకథలలో అంతర్లీనంగా ఉండడం గుర్తింపదగి ఉంది.

"కోవెల-కొలను" వ్యాసంలో తెలుగు గ్రామీణ జీవితంలో కోవెలకూ, కొలనుకూ ఉండే ప్రాముఖ్యం చిత్రింపబడింది. ఇందులో సర్పవరం, పిఠాపురం, చామర్లకోటలలోని ఆలయాల ప్రశంస ఉంది. కోవెలగోపురం గ్రామీణులను తండ్రిలాగ నడిపిస్తుందనీ, కొలను తల్లిలాగ లాలిస్తుందనీ పల్లెకూ గుడికీ గల అనుబంధం వివరింపబడింది. పిఠాపురంలోని మాధవ పుష్కరిణినీ, పాదగయతీర్థాన్నీ కవి బాల్యస్మృతి తరంగాలలో మునిగి చక్కగా ఆవిష్కరించాడు. "దేవళంలో కాగడాలేకాని విద్యుద్దీపాలు బాగుండవు" అని చెప్పడంలో విద్యుద్దీ

పాల 'దుస్సహమైన వెలుగు' సర్వేశ్వరుని దివ్యజ్యోతి ముందు దిగదుడుపనే సత్యం ధ్వనిస్తుంది. అరిషడ్వర్గవ్యాకులమైన అధోజీవితం నుంచి ఆధ్యాత్మిక శిఖరాన్ని చేరుకోవడానికి కోవెల - కోలనులు ఏ విధంగా స్ఫూర్తినిస్తాయో కవి చక్కగా వ్యాఖ్యానించాడు.

సాంఘిక వ్యాసాలు

"మా ఊళ్లో వీథి అరుగు" అనే రచనలో తెలుగు గ్రామీణ వ్యవస్థలో వచ్చిన పరిణామం స్పష్టం చేయబడింది. పల్లెకూ పట్టణానికీ గల తారతమ్యాన్ని వివరిస్తూ "పల్లి తల్లివంటిది; పట్టణం ప్రియురాలు వంటిది; పల్లె కుటుంబం-పట్టణం సంత; పల్లెలో కాలాలు తెలుస్తాయి-పట్టణానికి ఋతువులు లేవు" అని వివేచింపబడింది. పల్లెలోని వీథి అరుగు 'స్వాగత వచనం' లాంటిదనీ, అలాంటి అరుగులు సన్నగిల్లిపోవడం ప్రజలలో తరిగిపోయిన స్నేహసౌహార్దాలకు సూచకమనీ స్పష్టం చేయబడింది. కవి స్వగ్రామమైన చంద్రంపాలెంలోని వీథి అరుగులు ఈ వ్యాసంలో చక్కగా చిత్రించబడ్డాయి.

"మా ఊరు పోయింది" అనే వ్యాసంలో కృత్రిమమైన పట్టణ వాతావరణాన్ని పల్లె పులుముకోవడం చమత్కారంగా వ్యక్తం చేయబడింది. చిన్ననాటి మధురస్మృతులతో పల్లెకు పోయిన కృష్ణశాస్త్రి అక్కడి 'రోడ్డు', 'బస్సు', 'టూరింగు సినిమాడేరా' వగైరాలు దాని పై ఖరిసే మార్పుడాన్ని చూచి 'మా ఊరు పోయింది' అంటూ వాపోవడం స్వాభావికంగా ఉంది.

"ఇద్దరు సత్యవాదులు"లో 'నేనుచస్తే అబద్ధమాడను' అంటూనే అనేకులు అసత్యదోషాన్ని అంటించుకోవడం అలవాటుగా పేర్కొనబడింది. అలాంటివారిలో దినచర్యగా అబద్ధం చెప్పేవారూ, అవసరానికి

చెప్పేవారూ, భయంకరమైన అబద్ధం చెప్పి కారణం వెదకేవారూ కోకొల్లలుగా ఉన్నట్లు వివరింపబడింది. హరిశ్చంద్రుడు, ధర్మరాజు - ఇలాంటిపేర్లు గల పెద్దమనుషులు ఎత్తుకు పై ఎత్తుగా అబద్ధాలు చెప్పడం చమత్కారంగా చిత్రింపబడింది. కాని 'రామాయణంలోని రజకుని వారసుల' కంటె నిరపాయకరమైన అసత్యం చెప్పేవారు నయమన్న విషయం ఇందులో ధ్వనిస్తుంది.

"రిక్షావాలా" అనే రచనలో నిరుపేదవైన అహమద్ 'గజ్జెల గుర్రం' లాంటి రిక్షామీద 'జులాయి'గా తిరుగుతూ అసాధారణమైన వ్యక్తిత్వాన్ని ప్రదర్శించడం చక్కగా వ్యాఖ్యానింపబడింది. "పుట్టుకతోనే అతడొక పాచ్చా. అతనిది ఎత్తునుండి దిగేగుణం కాదు" అని అతని గొప్పదనం గుర్తింపబడింది. గంపెడు సంసారభారాన్ని మోయడంలో భాగస్వామినియైన భార్యపోయిన తరువాత అహమద్ రిక్షా మువ్వలు తీసివేయడాన్ని పురస్కరించుకొని "అహమద్ అసలే ఉన్నతుడు; ఇప్పుడు వేదనాకిరీటంతో మరీ ఉన్నతుడై పోయాడు" అంటూ కృష్ణశాస్త్రి ఆ శ్రమజీవికి అక్షరనీరాజనం పట్టడం హృదయంగమం.

"బూట్ పాలిష్" అనే వ్యాసంలో చెప్పులు కుట్టే నారయ్య జీవితం మానవతా పూరితంగా ఆవిష్కరింపబడింది. చెప్పులు కుట్టడం కాని, బట్టలు ఉతకడం కాని కృష్ణశాస్త్రి దృష్టిలో అగౌరవ ప్రదమైనవి కావు. భగవంతుడే అలాంటి మహాకార్యాలు చేస్తున్నట్లు పేర్కొనబడింది. "లోకమందిరానికి పునాది కోట్లమంది సామాన్యజనం. సౌధభారం మోసే పునాది మనకి కనబడదు; కాని ప్రసాద సౌందర్యం చూసి బలే అని కనుబొమ లెగరేస్తాం" అని చెప్పడంలో కష్టజీవుల ప్రాముఖ్యప్రాశస్త్యాలు చక్కగా వ్యక్తం చేయబడ్డాయి. "నారయ్య కొడుకు మాత్రం చెప్పులు కుట్టడు - పాలిష్ వెయ్యడు. చదువుకుంటున్నాడు. పాత

చెప్పులాంటి నారయ్య గుడిసెకు ఎప్పటికైనా వాడే మాసికలు వేయాలి'' అని చెప్పడంలో శ్రామిక లోకానికి మంచిరోజులు వస్తాయని కృష్ణశాస్త్రి ఆశాభావాన్ని వ్యక్తం చేశాడు.

''కృష్ణశాస్త్రి వచన రచనలు ముద్దులు మూటగట్టే ముత్యాల సరాలు. హృదయాన్ని రసప్లావితం చేసే వియోగగీతికలు; కవిత్వం లాగే తెలుగు సాహిత్యసీమలో అజరామరాలు''[6] అనీ, ''వారు వ్రాసిన ప్రతివ్యాసంలోను ఏదో ఒక ప్రత్యేకత ప్రతిబింబిస్తుంది. శాస్త్రిగారి వ్యక్తిత్వం, ప్రతిభ తొంగి చూస్తూనే ఉంటాయి. ఇంకా వాక్యసరళి, పదప్రయోగం, శబ్దసంపద, అక్కడక్కడ వాడే సామెతలు, జాతీయాలు, అచ్చ తెనుగు మాటలు, అవసరమైనచోట పడిన యితర భాషా పదాలు వ్యాసముయొక్క ప్రభావాన్నీ, సొగసునీ యినుమడింప చేస్తాయి''[7] అనీ క్రమంగా రామమోహన్ రాయ్‌గారూ, పెన్మెత్స అప్పలరాజుగారూ కృష్ణశాస్త్రి వచన రచనల వైశిష్ట్యాన్ని ప్రశంసించడంలో అత్యుక్తి లేదు.



# కృష్ణశాస్త్రి సాహిత్య సమాలోచనం

" From the words of the poet
men may take what meanings
please them, yet their best
meaning points to Thee " — Tagore

## వ్యక్తిత్వం – కావ్యవస్తువులు

"మొదటినుండి జీవితంలో తటస్థపడిన పరిస్థితులు, చారిత్రక సందర్భాలు కృష్ణశాస్త్రి వ్యక్తిత్వాన్ని అసాధారణంగా కళాత్మకంగా నిర్మించాయి."[1] ఆంగ్ల కాల్పనికోద్యమమూ, మానవోద్యమమూ అతి వేలమైన ప్రభావాలను ప్రసరించడంవల్ల కృష్ణశాస్త్రి వ్యక్తిత్వంలో ద్వైవిధ్యం (Dual Personality) చోటు చేసుకొన్నది. అంతేకాక జీవిత సమరంలో మాయని గాయాలు కలుగడంవల్ల అతనిలో కొంత కాలం నిరాశా నిస్పృహల కారుచీకట్లు క్రమ్ముకొన్నాయి. కాని అనతి కాలంలోనే అతడు కాల్పనికావేశాన్ని అధిగమించి, లౌకిక వేదననుండి విముక్తి పొంది, సంఘజీవిగా ప్రజాకవిగా పరిణమించాడు.

కృష్ణపక్షం దారుణమైన వేదనా ప్రాధాన్యంతో రూపుదాల్చింది. ప్రవాసంలో దాని పరాకాష్ఠదశ విప్పారింది. 'చైత్ర శుభోత్సవ విభాత కల్యాణం' కోసం నిరీక్షించే తృష్ణకూడ ప్రవాసంలో తొంగిచూచింది. ఈ కృతులలోని ప్రణయగీతాలలో ఆత్మీయమైన వేదనతోబాటు 'లోకసామాన్యమైన బాధలూ, కోరికలూ' స్పందించడం గమనింపదగ్గ విశేషం. ఊర్వశిలో కవి ఊహాలోకాలలో స్వైరవిహారంచేసి విశ్వ సౌందర్యామృతాన్ని దర్శించి విసూత్న కవితాలతాళ్యాలతో పునర్జన్మపొందాడు. ఈ కావ్యంలో కాల్పనిక కవితాలోకపు టంచులనుండి వాస్తవిక

లోకంవైపు తనదృష్టిని మరలించడానికి పూనుకొన్న 'చైత్ర శుభోత్సవ విధాతానికి' చెందిన అరుణకాంతులు ఆవిర్భవించాయి.

ఊర్వశి తరువాతి రచనలలో కృష్ణశాస్త్రి వ్యక్తిత్వంలోని రెండవదశ క్రమవికాసాన్ని పొందింది. బ్రహ్మసమాజ సంబంధమైన మహతి, కన్నీరు మొదలైన కృతులలో కృష్ణశాస్త్రిలోని లౌకిక కాలు ష్యమూ, విశ్వమానవప్రేమ కన్నీరుగా ప్రవహించి 'క్షాళనం' పొందాయి. పల్లకీ సంపుటి అతని అభ్యుదయ భావాలకు పరమనిదర్శనం. ఆకలి, కార్తికి మొదలైన కృతులు అతని జాతీయభావాలకు చక్కని దర్పణాలు-శ్రవ్యరూపకాలలో ప్రాచీన నవీన కవితారీతులు రెండూ సమన్వయంపొంది కవి వ్యక్తిత్వంలోని ద్వైవిధ్యానికి చక్కని సామ రస్యాన్ని ప్రదర్శిస్తున్నాయి. వచన కృతులలో సంపూర్ణ సంఘ జీవిగా కృష్ణశాస్త్రి దర్శన మిస్తాడు. వీటిలో అతడు 'ఆర్తమానవ కోటికి ఆప్తబంధువు'గా 'సామాన్యుల సుఖదుఃఖాల'లో పాలు పంచు కొన్నాడు.

కృష్ణశాస్త్రిలోని వ్యక్తిత్వ ద్వైవిధ్యంలో ఏది బలీయం? అనే ప్రశ్నకు సమాధానంగా "కృష్ణశాస్త్రిలో కృష్ణపక్షం వ్రాసిన కవి ఒక మూల ఉన్నాడు. మరొకమూల లోకాన్ని బాగా దగ్గరగా ఎరిగున్న గడసరీ, మనుషుల్ని-అన్నిరకాల వాళ్ళనీ - కొంటె చిరునవ్వుతో పరి శీలిస్తూ, వాళ్ళంటే పిచ్చి ఇష్టంతో పడిచచ్చే సంఘజీవి ఉన్నాడు. అప్పుడూ ఇప్పుడూ కూడా ఈ రెండో వ్యక్తే బలవంతుడు"[2] అని పాల గుమ్మి పద్మరాజుగారు నిర్ణయించడం సమంజసం.

కృష్ణశాస్త్రి తన కవితా విపంచికలో 'స్వాతంత్రధ్వని' పలికించాడే కాని ఒకరికి 'ప్రతిధ్వని' ఎప్పుడూ పలికించలేదు. మానవ కల్పితాలైన తరతమ భేదాలను నిరసించాడు. బ్రహ్మసమాజ గీతాలలోని ఏకేశ్వర

తత్త్వానికీ తక్కిన కృతులలోని భక్తి చిత్రణకూ పైకి భేదం కనిపించినా మూలతత్త్వం ఒకటే. "విశ్వాసియైన కృష్ణశాస్త్రికి ఎక్కడా మూఢ భక్తి కనిపించలేదు."[3] అతని 'మధురభక్తి'కీ సూఫీదృక్పథానికీ చెప్పుకోదగ్గ భేదంలేదు. పరిమితత్వంనుండి అపరిమితత్వాన్ని అందుకోవడమే ఆ రెంటిద్వారాను అతడు ఆశించాడు. సూఫీతత్త్వానికి మన ఉపనిషత్తులే మూలమనే సంగతి ఇక్కడ గమనించాలి.[4]

తాత్కాలికమైన ప్రయోజనం కలిగిన రచనలు చేయడం అతనికి నచ్చదు. అందువల్ల ఇతర నవ్యకవులలాగ జాతీయోద్యమాన్నీ, ఆంధ్రోద్యమాన్నీ పురస్కరించుకొని అతడు రచనలు చేయలేదు. "హృదయంలో కదలిక లేనిదే అనుభూతి వాగ్రూపందాల్చనిదే ఆయన అక్షరరూపంలో కన్పించదు."[5] సంఘ సంస్కరణ పరంగా, జాతీయభావ ప్రేరితాలుగా అతడు వ్రాసిన మహతి, ఆకలి, కార్తికి మొదలైన కృతులు ఆలస్యంగా వెల్లడించబడ్డాయి. ఇలాంటి కారణాలవల్ల అతన్నిపై అపోహాలు బయలుదేరాయి. నిజానికి కృష్ణశాస్త్రి సార్వకాలికులైన మహాకవుల కోవకు చెందినవాడని చెప్పడంలో అతిశయోక్తి లేదు.

## ప్రాత క్రొత్తల మేలికలయిక

కృష్ణశాస్త్రి కావ్యవస్తువులను స్వీకరించడంలోను, భాషా భావ రచనలలోను ప్రాత క్రొత్తల మేలికలయికను సాధించాడు.

సలక్షణమైన గ్రాంథిక భాషతోపాటు శిష్టవ్యావహారిక భాషను విశేషంగా ఆదరించాడు. శ్రవ్యరూపకాలలోను, వ్యాసాలలోను పాత్రోచిత భాషను సైతం ప్రయోగించి ఉండడం మరొక విశేషం. సందర్భోచితంగా అన్యదేశ్యాలను సైతం ఉపయోగించాడు. 'అతిథిశాల', 'రిక్షావాలా' మొదలైన రచనలలో హిందూస్తాని పదాలనూ, 'తిరుప్పావు',

'శ్రీఆండాళ్ళు కల్యాణాలలో' తమిళ పదాలనూ ప్రయోగించి ఉండడం ఇందుకు ఉదాహరణలు.

తిమిరలత, మూగకన్నీరు, శోకంపు టెడారులు, నిశ్వాస తాళ వృంతాలు, విశ్వగాన వియత్తరంగిణి మొదలైన వినూత్న పదబంధాలను ప్రయోగించడంలోను, 'హృదయ తంత్రికలను స్పందింపజేయు' పద చిత్రాలను ప్రయోగించడంలోను కృష్ణశాస్త్రి వైశిష్ట్యం స్పష్టమవుంది. ఊర్వశి నీలికన్నులలో 'అనంతాంబరంపు నీలినీడలూ', 'వినిర్మలాంబు పూర గంభీర శాంత కాసార చిత్రహృదయములలోని గాటంపు నిదుర చాయలూ,' 'సంధ్యావసాన సమయమున నీపపాదపశాఖశాఖాగ్ర పత్ర కుటిల మార్గముల లోపలవసించు ఇరులగుసగుసలూ' ఉన్నట్లు వర్ణించడంలోను, ఇట్లే ఇంకా అనేక సందర్భాలలోను కృష్ణశాస్త్రి ప్రయోగించిన పదచిత్రాలు పండితామోదాన్ని చూరగొన్నాయి.[6] పదచిత్రాలుగా పరిగణింపబడ్డ భావప్రకర్షనూ, ఊహాప్రకర్షనూ వ్యక్తం చేసే ఉపమారూపకాలంకారాలనే కాక, సంప్రదాయానుగుణమైన అలంకారాలను సైతం సముచితంగా, పరిమితంగా కృష్ణశాస్త్రి ప్రయోగించాడు.

నవ్యకవుల సంప్రదాయాన్ని అనుసరించి కృష్ణశాస్త్రి సర్వసాధారణమైన ఛందోరీతులనే పాటించాడు. అందులో తేటగీతు లెక్కువ. భావప్రవాహాన్ని అనుసరించి పద్య పాదాలను పెంచవచ్చు లేక తగ్గించవచ్చునని కృష్ణశాస్త్రి మతం. ఇది ఒక నవ్యత అనక తప్పదు. ఇలాంటి ప్రయోగాలు తేటగీతిలో ఎక్కువగా జరిగాయి. కొన్నిచోట్ల పద్యపాదాన్ని ఖండికతో ప్రారంభించడమూ, అలాగే ఖండికతో ముగించడమూ కనిపిస్తుంది. భావపరిపూర్తి పాఠకుల ఊహకే వదలి వేయబడ్డ సందర్భాలుకూడ ఉన్నాయి. మిక్కిలి సాభిప్రాయంగా కూడ ఈపని జరిగినట్లు '...గయాసుర నిరాసన తీవ్రతగోడి గోడిరూపై...' (నిగమశర్మ) వంటి ప్రయోగాలు సాక్ష్యమిస్తాయి.

కృష్ణశాస్త్రి గేయాలలో నిర్ణీతమైన మాత్రల ఆవృత్తితో కూడినవీ ఉన్నాయి. వాగ్గేయకారుల బాణీలో రాగ తాళలయాన్వితంగా సాగినవీ ఉన్నాయి. ఆరేసి, ఐదేసి, నాలుగేసి మాత్రల ఆవృత్తితో కూడిన గేయాలూ, మూడు నాలుగు మాత్రల సమ్మేళనంతో కూడిన గేయాలూ (ముత్యాల సరాలు) ఉన్నాయి. ఇందులో ఐదేసి మాత్రలున్న గేయాలూ (ఖండగతి), నాలుగేసి మాత్రలున్న గేయాలు (చతురస్రగతి) అధికంగా కనిపిస్తాయి. గేయరచనలో ఒకటి రెండు మాత్రలు అధికంగాను ఉండవచ్చు, తక్కువగాను ఉండవచ్చు. అధికంగా ఉన్నచోట కొన్ని స్వరాలను హ్రస్వంగా, తక్కువగాఉన్న చోట కొన్ని స్వరాలను దీర్ఘంగా పలుకడం జరుగుతుంది. 'అంతర్లయ' ప్రధానమైన వచనగేయాలనుకూడ కొన్నింటిని కృష్ణశాస్త్రి వ్రాశాడు. అభ్యుదయ భావకవితా విభాగంలో ఇవి కనిపిస్తాయి. శాస్త్రీయమైన సంగీత రీతులనూ, లలితసంగీత రీతులనూ, జానపద సంగీతరీతులనూ మూడింటినీ తనగేయాలలో ఆదరించిన కృష్ణశాస్త్రి నైపుణ్యం ప్రశంసనీయం.

ఎంతచక్కగా వ్రాసినా సమకాలంవారు కొందరు మెచ్చక పోవడం తరతరాలుగా ఉన్నదే. కృష్ణశాస్త్రిపై వచ్చిన అపోహాలలో సత్యం చాలతక్కువ. వాటిని పరిశీలించే ముందు భావకవిత్వంపై వచ్చిన అపప్రచారాలను పరామర్శించడం యుక్తం.

భావకవిత్వంపై అపప్రచారాలు

1. సంప్రదాయవాదులు భావకవిత్వాన్ని 'బావకవిత్వం', 'అభావ కవిత్వం', 'అహంభావ కవిత్వం', 'అపస్మార కవిత్వం'– ఈవిధంగా హేళన చేశారు. ఒక నూతనమైన ఉద్యమం వచ్చినప్పుడు ఇలాంటి విమర్శలు రావడం సహజమే.

2. అక్కిరాజు ఉమాకాంతం 'నేటికాలపు కవిత్వము' అనే విమర్శగ్రంథంలో నవ్యకవిత్వాన్ని దుయ్యబట్టాడు. ఈ పండితుడు తన

బాణాన్ని మొదట నన్నయభట్టుపైనే ప్రయోగించాడు. భాషాచ్ఛందో వ్యతిక్రమం, ఊకుదుమాటలు, నిదర్శన పరంపరలు, అయోమయత్వం, పులుముడు, శబ్దవాచ్యత, సంకుచితత్వం, క్షుద్రశృంగారం - మొదలైన దోషాలు నవ్యకవులపై ఆరోపించాడు. కేవలం నవ్యకవుల దోషాలు మాత్రం గుర్తింపబడ్డాయి. విశేషమేమంటే ఒక్క సుగుణం కూడ ఆ మహాపండితునికి కనిపించలేదు. కొంతవరకైనా 'ఆర్ద్ర దృష్టి'తో, 'కవితా హృదయం'తో పరిశీలించిఉంటే నవ్యకవిత్వంలోని లావణ్యం కనిపించేది.[7]

3. అనంతపంతుల రామలింగస్వామి 'శుక్లపక్షము' అనే హేళన కావ్యంలో అర్థంలేని మాటల ప్రోగుగా భావకవిత్వాన్ని నిరూపించ డానికి ప్రయత్నించాడు. భావకవిత్వంలోని దోషాలు 'భూతద్దం'లో లాగా దీనిలో పెద్దవిగా కనిపిస్తాయి. కృష్ణపక్షానికి పూర్వపక్షంగా వెలసిన ఈ శుక్లపక్షంకూడ భావకవితారీతిలో సాగిఉండడం ఒక విశేషం.[8]

4. భావగీతాలకు అర్థంలేదు అనేవాదం ఉంది. ఇదీ శుక్ల పక్షాన్ని అనుసరించిందే. కాని దీనికి ప్రాతిపదిక 'అర్థమ్ములేని భావ గీతమ్ములవి' అని కృష్ణశాస్త్రి ఊర్వశి నేత్రాలను వర్ణించడం. ఈ వాదాన్ని లేవదీసినవారు ప్రకరణాన్ని విస్మరించి నేలవిడిచి సాము చేశారు.

5. అభ్యుదయ వాదులు భావకవిత్వంలోని ప్రణయ కవిత్వాన్ని మాత్రం విశేషంగా నిరసించారు. అందులో 'సందేశం' లేదన్నారు. ఇక్కడ ఒక ముఖ్యాంశాన్ని గుర్తించాలి. సాహిత్య వికాసంలో సంప్ర దాయ ప్రభావమూ, సమకాలీనమైన ఇతర సాహిత్యాల ప్రభావమూ కొంతవరకైనా ఉండక తప్పదు. ఏదో ఒక పెద్దవిప్లవం వస్తే సాహి త్యమూ, సమాజమూ సత్వరంగా మారవు. భావకవిత్వం పుట్టడానికి

ముందున్న ప్రబంధ కవిత్వమూ, సమకాలీనమైన భారతీయ సాహిత్యాల ప్రభావమూ, ఆంగ్లకాల్పనిక కవిత్వమూ - ఇవి అన్నీ తమ ప్రభావాలను ప్రసరించి తొలుతొల్త ప్రణయకవిత్వం వికసించడానికే తోడ్పడ్డాయి. భావకవిత్వంపై తిరుగుబాటుగా బయలుదేరిన అభ్యుదయ కవిత్వంకూడ సర్వసమ్మతం కాలేదు.[9] కావ్యానికి 'సద్యః పర నిర్వృతీ', 'కాంతా సమ్మితమైన ఉపదేశమూ' ముఖ్యప్రయోజనాలు. ఇందులో ఏ ఒక్కటి ఉన్నా అది ఆస్వాదయోగ్యం కాకపోదు.

## కృష్ణశాస్త్రిపై అపోహాలు

1925 తరువాత కృష్ణశాస్త్రి దూషణ భూషణలకు గురియైనంతగా మరొక ఆంధ్రకవి గురికాలేదు. దూషించిన వారిని కూడ అతడు ప్రేమించాడు.[10] అతనిపై వచ్చిన అపోహాలు కేవలం పాక్షికమైనవి. కృష్ణపక్షంలో కనిపించే అతని వ్యక్తిత్వంలోని మొదటిదశ వాటికి ముఖ్యాధారం.

1. కృష్ణశాస్త్రి దివినుండి భువికి దిగిరాని ఊహాలోక విహారి- అనే అభిప్రాయం చాలమందికుంది. ''రిక్షావాడు మొదలుకొని అంతరిక్షంలో కొలువైయున్న ఈశ్వరునిదాకా ఆయన ఆలోచనలు పరచుకొన్నాయి.''[11] అంతేకాక ''ఈ నేలమీద నడయాడే ప్రతి చిన్న ప్రాణినీ మమతా బంధంతో పెనవేసుకున్నాడు.''[12] ఈ విషయం తెలిసిన వారెవరూ ఈ వాదాన్ని నమ్మరు.

2. 'కృష్ణశాస్త్రి పంథా సామాజిక జీవితానికి దూరం' - అన్నది కొందరు అభ్యుదయవాదుల మతం. తిలక్ 'కవిత్వం ఆల్కెమి' తెలిసిన వాడుగా గుర్తించినా ''మంత్రనగరికి వెళ్లొచ్చినవాడు, మధ్వరసం చేదంటాడు, వధ్యశిలపై వవిరహగీతం రాస్తాడు, మనతో వస్తాడా?'' అని సందేహించాడు.[13] కృష్ణశాస్త్రి సంఘసేవను తెలిసిన

వారు చేసే విమర్శకాదిది. ఊర్వశీ కావ్యాన్ని కె. వి. రమణారెడ్డిగారు 'పరుషంగా అవహేళన' చేయడంలో సత్యంలేదు.[14]

3. కృష్ణశాస్త్రి వేదనలోని పరమార్థాన్ని గ్రహింపలేక 'ఏడుపుకవి'గా కొందరు భావించారు. ఇది స్థూలదృష్టికి నిజంగానే కనిపిస్తుంది. కాని ఆ ఏడుపు సామాన్యమయ్యింది కాదు. పెద్దాడ రామస్వామి 'వేడి కన్నీటి ధారలంగార్చినంతనే హృదయము పాప గ్రహమునుండి విముక్తి' పొందుతుందనీ, 'జీవనభారం' తోనే కాక, ఆధ్యాత్మిక విరహంతో కృష్ణశాస్త్రి ఏడ్చాడనీ, అతని కన్నీరూ, దుఃఖమూ క్రమంగా 'blessed tears', 'sacred sorrow' అని పేర్కొనడం గమనింపదగ్గది[15]. చలంకూడ ఈ అంశాన్ని స్పష్టంగా గుర్తించాడు. 'కృష్ణశాస్త్రి బాధ ప్రపంచపు బాధ'[16] అని తాను చెప్పిన మాటలకు స్వయంగా 'నీకోసం, నాకోసం, ఇట్లా ఇంత బాగా తనని అర్థం చేసుకునే విమర్శకులకోసం' ఏడ్చాడని వివరించాడు[17]. ఆచార్య ఖండవల్లి లక్ష్మీరంజనం ఈశతాబ్ది తృతీయ దశకంలో లోకాన్ని ఆవరించిన నిరాశా నిస్పృహలే కృష్ణశాస్త్రి ప్రభృతుల శోకానికి కారణమని చెప్పడంకూడ గమనింపదగి ఉంది.[18]

4. ప్రవాసం, ఊర్వశీ కృతులలో రెండు మూడు పద్యాలకు కాళిదాసు పెద్దనాది కవుల భావాలతో పరోక్షమైన పోలికలు ఉండడాన్ని పురస్కరించుకొని వేదాల తిరువేంగళాచార్యులుగారు 'ప్రాత సారాయి - క్రొత్తసీసాలు' అని తేల్చివేయడం శోచనీయం. ఆంగ్ల కవులతో రవీంద్రునితో చాలపోలికలున్నాయని వేదాలవారు గుర్తించక పోవడం ఒకందుకు మేలే. అనుకరణ మానవసహజం. ప్రతిభావంతమైన అనుకరణ దోషం కాదు. అనుకరణలేని కావ్యం అరుదు. ప్రతిబింబాకార సంవాదం మాత్రమే త్యాజ్యం. ఆలేఖ్యాకార, దేహాంతర తుల్య

సంవాదాలు లాక్షణికులు అంగీకరించినవే[19]. అలాంటివే కృష్ణశాస్త్రి సాహిత్యంలో కనిపిస్తాయి.

కృష్ణశాస్త్రిపై అపోహలు ప్రబలడానికి కారణమైన ఒక ముఖ్యాంశాన్ని గమనించాలి. కృష్ణశాస్త్రి 'వేషపుటీరేకాక ఆయన వాడిన పదాలు దాదాపు రెండు దశాబ్దులు భావకవులను విడువక పట్టుకొన్నాయి'.[20] ప్రతిభాశూన్యులైన అనుకరణ వాదులను చలం కూడ గర్హించాడు.[21] 'నకిలీ కృష్ణశాస్త్రుల' లోపాలకు అసలు కృష్ణశాస్త్రిపై విమర్శకులు విరుచుక పడడంలో అర్థం లేదు. కృష్ణపక్షాన్ని అనుకరిస్తూ బయలుదేరిన అనేక కృతులు వసుచరిత్ర ముందు పిల్లవసుచరిత్రలయ్యాయి.[22]

భావకవిత్వం మీద, కృష్ణశాస్త్రి మీద వచ్చిన పైవిమర్శలు సహృదయ విమర్శలు కావు. భావకవిత్వం హృదయ ప్రధానమనే విషయాన్ని విస్మరించడం జరిగింది. 'తప్పులెన్నువారు తమతప్పులెఱుఁగరు'.

## నవ్యసాహిత్యం – కృష్ణశాస్త్రి స్థానం

నవ్యసాహిత్య చరిత్రలో కృష్ణశాస్త్రికి గల స్థానం అద్వితీయం. నవ్యసాహిత్యాన్ని బాలారిష్టాలనుండి గట్టెక్కించడమేకాక అతడు 1925 తరువాత కొన్ని సంవత్సరాలు శకకర్తగా వెలిగాడు.[23] కవితా ప్రచారంలో తిరుపతి వేంకట కవుల తరువాత అంతవాడుగా ప్రసిద్ధిపొందాడు.[24] "నాప్రభావం పడని క్రొత్త కవి లేదు"[25] అని కృష్ణశాస్త్రి స్వయంగా పేర్కొవడంలో అతిశయోక్తి లేదు. అభ్యుదయ కవిత్వానికి యుగకర్తయైన శ్రీ శ్రీ సైతం కృష్ణశాస్త్రి ప్రభావానికి గురియైనట్లు స్పష్టమవుతుంది.[26] ఈవిధంగా నవ్యకవితోద్యమంలో అతడు ఒక పీఠాన్ని ఆక్రమించాడు.[27]

భావకవితాప్రక్రియలో తెలుగులోనే కాక సుప్రసిద్ధులైన భారతీయ కవులలో కృష్ణశాస్త్రికిగల స్థానం చిరస్మరణీయం. మలయాళంలో

శంకర్ కురూప్, కన్నడంలో దత్తాత్రేయ రామచంద్ర బేంద్రే, హిందీలో సుమిత్రానందన్ పంత్‌లకు వారి వారి సాహిత్యాలలో ఉన్న స్థానమే తనకు తెలుగులో ఉన్నట్లు కృష్ణశాస్త్రి చెప్పడం సత్య సమ్మతం. కృష్ణ శాస్త్రికీ-బేంద్రే పంత్‌లకూ నవ్య కవితా ప్రచారంలో సాదృశ్యమూ, కావ్య వస్తువులలో సాన్నిహిత్యమూ కనిపిస్తుంది. పాశ్చాత్యకవుల ప్రభావమూ, రవీంద్రుని ప్రభావమూ ఈ కవులలోని సామ్యాలకు ముఖ్య హేతువులు.

"నా తరం కవులు అందరిలోనూ ప్రాతక్రొత్తలూ ప్రాక్పశ్చిమాలూ నాలో సమరసంగా కలసినట్లు మరెవ్వరిలోనూ లేవని నేను చెప్పగలను. ఈదృష్టితో చూస్తే రవీంద్రులు మొదలైన నేటి నాయకులకు నాఅంత సన్నిహితుడు సంస్కృతిలో మరొకడు లేడు"[28] — అని కృష్ణశాస్త్రి తనలోని సాంస్కృతిక సమన్వయాన్ని పేర్కొనడంలోని యథార్థం లోకవిదితం. అందుకే అతను 'ఆంధ్రరవీంద్రు' డయ్యాడు.

కృష్ణశాస్త్రి కేవలం కవితారామణీయకాన్ని ఆవిష్కరించడానికీ, ఆత్మశుశోధనకూ ఆత్మాశ్రయకవిత్వాన్ని చెప్పాడు. ఇక తక్కిన రచనలు విశ్వమానవ ప్రేమపై కేంద్రీకృతమయ్యాయి. పదాల ఎన్నికలోను, విచక్షణాత్మకంగా వ్రాయడంలోను అతడు అసాధారణమైన కృషి చేశాడు.[29] కృష్ణశాస్త్రి కృతులలో ఊర్వశి, ఋగ్వేధి, తిరుప్పావు, పల్లకీలోని కొన్ని భాగాలు, గుహుడు సాయుజ్యం మొదలైన నాటికలు, 'అన్నమాచారి', 'శ్రీకృష్ణావతార తత్వం' మొదలైన వ్యాసాలు చిరకాలం నిలువదగ్గవి. కృష్ణశాస్త్రి కృతులలో చాలవరకు నిలుస్తాయని కొందరు తలంచగా, కృష్ణశాస్త్రి పద్యకృతులు ఎంత మధురంగా ఉన్నా అవి 'క్షణప్రభలు' అనీ, కొన్ని నాటికలు మాత్రం మిగులుతాయనీ నోరి నరసింహశాస్త్రి చెప్పడం జరిగింది[30] ఈ విషయంలో —

"Certain works survive and certain others, for more precious are lost and forgotton, apparently for no reason. The wheels of chance alone seem to determine the course of literary immortality"[31] —
అని ఆచార్య వి. కె. గోకాక్ పేర్కొనడం స్మరింపదగి ఉంది.

"కాలగమనంతో పాటు కవితా ప్రస్థానం సాగించి విశ్వజనీన కాలాతీత దర్శనంతో అక్షరతపస్సు చేసిన మహాశిల్పి కృష్ణ కవి చంద్రుడు."[32] నవ్యకవులలో 'కొంతమందిది యువత, కొంతమందిది నవత, కృష్ణశాస్త్రిది కవిత'[33]



గమనిక:- ఈ క్రింది విషయాన్ని 84 వ పుటకు అనుబంధంగా పాఠకులు గుర్తించ వలసిందిగా కోరుతున్నాము.

కృష్ణశాస్త్రి పల్లకీ సంపుటిలోని 'యువతరం', 'నవ్యశక్తి', 'జీవనశంఖం', 'అప్పుడుగాని అరుణోదయం కాదు' - ఇలాంటి గేయాలు ఈ వర్గానికి అలంకారాలు.

9. ఆత్మీయ చిత్రణం

నవ్యకవులు తమ వ్యక్తిత్వ విశేషాలనూ, స్వీయ జీవితానికి సంబంధించిన అంశాలనూ ఖండికలుగా వెలయించడం కనిపిస్తుంది. ఇవి ఆత్మ కథాకావ్యాల కోవలో చేరవు. అందువల్ల ఇలాంటి ఖండికలను 'ఆత్మీయచిత్రణం' అనే వర్గంగా పరిగణించడం యుక్తం. ఈ రచనలకూ పూర్వకవుల కావ్యావతారికలలోని అంశాలకూ విషయ విన్యాసంలోను, రచనలోను స్పష్టమైన భేదం కనిపిస్తుంది.

కృష్ణశాస్త్రి పల్లకీసంపుటిలోని 'గొంతు చీకటి', 'సంక్రాంతి', 'భావకవి', 'స్నేహాక్షీరము' మొదలైన ఖండికలు ఈ వర్గానికి చేరుతాయి.



# సూచికలు

## నవ్యసాహిత్యం - కృష్ణశాస్త్రి

1. శ్రీ పెన్మెత్స అప్పలరాజు: రచయితగా శ్రీ కృష్ణశాస్త్రి: భారతి-జూలై 1971
2. శ్రీ ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి: రెండు మాటలు: కృష్ణశాస్త్రి కృతులు
3. ప్రకాశకులు: వక్తవ్యం: కృష్ణశాస్త్రి కృతులు
4. చూ॥ శ్రీ యల్. యస్. శేషగిరిరావు: An Introduction to Modern Knnada Literature - P. 6

5, 7. శ్రీనాగళ్ళ గురుప్రసాదరావు: అరవయ్యేళ్ళ ఆంధ్ర సాహిత్యం: శుభకృతు సంవత్సరాది ఆంధ్ర పత్రిక

6, 8, 9, 16. ఆచార్య పి. నారాయణరెడ్డి: ఆధునికాంధ్ర కవిత్వము: పు. 179-80, 414-15, 356, 476.

10. చూ॥ ఆచార్య పి. నారాయణరెడ్డి: ప్రణయ కవిత్వము: ఆధునికాంధ్ర కవిత్వము.
11. చూ॥ డా. ముకురాల రామారెడ్డి: తెలుగు సాహిత్య వికాసం: పు. 41

12, 15. ఆచార్య ఖండవల్లి లక్ష్మీరంజనం: ఆధునిక యుగము: తెలుగు వాఙ్మయము: తెలుగు విజ్ఞాన సర్వస్వము.

13. డా. ముకురాల రామారెడ్డి: భావకవిత-ప్రణయం: తెలుగు సాహిత్య వికాసం,
14. చూ॥ డా. విమల్‌కుమార్ జైన్: సూఫీ-అస్థా: సూఫీమత్ ఔర్ హిందీ సాహిత్య.
17. డా. కె. కె. రంగనాథాచార్యులు: సింహావలోకనం: తెలుగు సాహిత్య వికాసం.
18. చూ॥ కృష్ణశాస్త్రి స్వీయచరిత్రాత్మక రచన; భారతి-జూలై 1980
19. చూ॥ శ్రీ కె. శ్రీరామ్: ఇంగ్లీషు రొమాంటిక్ కవులు: భారతి-డిసెంబరు 1956
20. శ్రీ రామమోహనరాయ్: కృష్ణశాస్త్రి క్రొత్త తెన్నులు: భారతి-జనవరి 1968
21. చూ॥ శ్రీ త్రిపురారిభట్ల వీరరాఘవస్వామి: ఉపోద్ఘాతము: రవీంద్రనాథ ఠాకూర్ ఏకోత్తరశతి

పద్యకృతుల ప్రాభవం:-

కృష్ణపక్ష ప్రకాశం

1, 18. Stray Birds.
2. The Invitation.
3. John Keats P. 71.
4, 15, 22. Lover's Gift.
5. కృష్ణశాస్త్రి: పీఠిక: ఏకాంతసేవ
6. Ode to Liberty.
7. కాళిదాసు కుమారసంభవము 5–82.
8. Fruit Gathering.
9. Gerusalemne liberata.
10. Love's Philosophy.
11. చూ॥ ఆచార్య పి. నారాయణరెడ్డి : ఆధునికాంధ్ర కవిత్వము పు. 421
12. చూ॥ కృష్ణశాస్త్రి కవితాస్వర్ణోత్సవ సంచిక పు. 43
13. చూ॥ కాసులు : ముత్యాల సరాలు.
14. The Poetical works of John Keats P. 326
15, 22. Lover's Gift.
16. The woodmen and the Nightingale.
17. Ode to the West Wind.
19. Stanzas written in Dejection near Naples.
20. Ode to a Nightingale.
21, 24. Gitanjali.
23. ఆచార్య పి. నారాయణరెడ్డి : ఆధునికాంధ్ర కవిత్వము పు. 446
25. చూ॥ శ్రీ రామమోహన రాయ్: కృష్ణశాస్త్రి క్రొత్తతెన్నులు: భారతి-జనవరి 1968
26. చూ॥ తల్లావఝ్ఝల శివశంకరశాస్త్రి : కృష్ణపక్షసింహావలోకనము.

ప్రవాస మాధుర్యం

1, 9. The Gardener.
2, 7. Lover's Gift.

3. To Fanny (Sonnet)
4. Fruit Gathering.
5. A Wordsworth Selection P. 28
6. Stanzas writ'en in Dejection near Naples.
8. చూ॥ శ్రీరామమోహనరాయ్ : కృష్ణశాస్త్రి క్రొత్తతెన్నులు : భారతి-జనవరి 1968.

ఊర్వశీ హృదయం

1, 2. చూ॥ ఆచార్య పి. నారాయణరెడ్డి : ఆధునికాంధ్రకవిత్వము: పు. 364, 363
3, 4. చూ॥ కృష్ణశాస్త్రి : మూప్రణయలేఖలకథ : తణి: రుధిరోద్గారి పుష్య సంచిక.
5. Julian and Maddalo.
6. కాళిదాసు కుమారసంభవము 1-49.
7. Endimion.
8. శ్రీ అద్దేపల్లి రామమోహనరావు : విమర్శవేదిక పు. 52
9, 15, 23. The Gardener.
10, 13, 26. Lover's Gift.
11, 12, 14, 17. The Fugitive and other Poems.
16. కాళిదాసు కుమారసంభవము 5-24.
18. Stray Birds.
19, 22, 25. Gitanjali.
20. Fruit Gathering.
21. Premetheus Unbound.
24. Epipsychidian.
27. శ్రీ టి. యల్. కాంతారావు : సాహిత్యోపనిషత్. పు. 60
28. శ్రీ పి. పద్మరాజు : Krishna Sastry – Man and Poet : Triveni - January 1955.

పల్లకీ మహత్త్వం

1. The Fugitive and other Poems XIII.
2, 4, 5. చూ॥ Fruit Gathering XXXI, XXXV, XLVIII.
3. దేశభక్తి : ముత్యాలసరాలు.
6. The Gardener LXVIII.

గేయకృతుల ప్రాశస్త్యం:-

మహతీ నిస్వనం

1. చూ॥ కృష్ణశాస్త్రి స్వీయచరిత్రాత్మక రచన : భారతి-జూలై 1980.
2. కృష్ణశాస్త్రి : 'అన్నమాచారి'
3, 5, 7. Gitanjali VII, LXXXIII, XI.
4, 9. శ్రీ అమరేంద్ర : కృష్ణశాస్త్రిగారి మహతి : భారతి-నవంబరు 1980.
6. Wordsworth's Poems Vol. II P. 85.
8. శ్రీరామమోహనరాయ్ : కృష్ణశాస్త్రి క్రొత్తతెన్నులు : భారతి-జనవరి 1968.

మేఘమాలా సౌందర్యం

1. చూ॥ శ్రీ అమరేంద్ర : అక్షర తపస్వి కృష్ణశాస్త్రి : ఆంధ్రజ్యోతి (వారపత్రిక) 4-7-1980.
2. శ్రీ అమరేంద్ర : అక్షరతపస్వి కృష్ణశాస్త్రి : ఆంధ్రజ్యోతి (వారపత్రిక) 4-7-1980.

తిరుప్పావు దివ్యత్వం

1, 2. శ్రీ సుదర్శనాచార్య శిరోమణి : పీఠిక : తిరుప్పావు - తిరువెమ్పావు.
3. శ్రీ సుదర్శనాచార్య శిరోమణి : తిరుప్పావు - తిరువెమ్పావు వ్యాఖ్య పు. 65
4. చూ॥ Foreword : కృష్ణశాస్త్రి తిరుప్పావు.

శ్రవ్యరూపకాల సౌష్ఠవం

1. చూ॥ శ్రీ శశాంక : మహతి (యువభారతి ప్రచురణ) పు. 199.

2. చూ॥ The Cycle of Spring.
3. చూ॥ శ్రీ సుదర్శనాచార్య శిరోమణి : తిరుప్పావు - తిరువెమ్బావు వ్యాఖ్య.
4. చూ॥ Gitanjali XLV.
4(a) Lover's Gift XLVII
5. On a Gracian Urn.

## వచన రచనల వైశిష్ట్యం

1, 2. కృష్ణశాస్త్రి స్వీయచరిత్రాత్మక రచన: భారతి - జూలై 1980.
3. The Gardener XV.
4. Gitanjali XLV
5. చూ॥ చౌపద్ 2 - దోహా 102 : ద్వితీయ సోపాన్ - అయోధ్యాకాండ్.
6. కృష్ణశాస్త్రి క్రొత్తతెన్నులు : భారతి - జనవరి 1968.
7. రచయితగా శ్రీ కృష్ణశాస్త్రి : భారతి జూలై 1971.

## కృష్ణశాస్త్రి సాహిత్య సమాలోచనం

1. శ్రీ పెన్మెత్స అప్పలరాజు: రచయితగా శ్రీ కృష్ణశాస్త్రి : భారతి-జూలై 1971
2. ఉ॥ రచయితగా శ్రీ కృష్ణశాస్త్రి : భారతి-జూలై 1971.
3, 5, 20. శ్రీరామమోహనరాయ్ : కృష్ణశాస్త్రి క్రొత్తతెన్నులు : భారతి జనవరి 1968.
4. చూ॥ శ్రీ వాపిరెడ్డి పార్థసారథి : సూఫీ దృక్పథము ; భారతి-నవంబరు 1958
6. చూ॥ ఆచార్య సి. నారాయణరెడ్డి : ఆధునికాంధ్ర కవిత్వము పు. 488-91
7. చూ॥ కృష్ణశాస్త్రి : 'పాతిక సంవత్సరాల తెలుగు కవిత్వము'
8. చూ॥ శ్రీ పరాశరం గోపాలకృష్ణమూర్తి : ఆధునిక హేళనకావ్యము - 'శుక్లపక్షము' : భారతి.
9. చూ॥ ఆచార్య ఖండవల్లి లక్ష్మీరంజనం : ఆధునికయుగము : తెలుగు వాఙ్మయము : తెలుగు విజ్ఞానసర్వస్వము.
10. చూ॥ అక్షరతపస్వి కృష్ణశాస్త్రి : ఆంధ్రజ్యోతి (వారపత్రిక) 4-7-1980.
11. శ్రీ పాలగుమ్మి విశ్వనాథం : మరపురాని పాటలు సృష్టించిన కృష్ణశాస్త్రి: విజయదుర్గ నవంబరు 1974.

12. 32. శ్రీ అమరేంద్ర : అక్షరతపస్వి కృష్ణశాస్త్రి ఆంధ్రజ్యోతి (వారపత్రిక) 4—7—1980.

13 ఉ॥ కృష్ణశాస్త్రి క్రొత్తతెన్నులు : భారతి-జనవరి 1968.

14. చూ॥ కృష్ణశాస్త్రి క్రొత్తతెన్నులు ; భారతి-జనవరి 1968.
('....నగ్నోర్వశి ప్రతిమ ప్రతిష్ఠించి - ఊర్వశీపూరుసీమలోని పుట్టుమచ్చను - కాలిగోటిని, నోటి పుమ్మిని, బాహుమూల పలితరోమాల్ని - తలచి, తలపించి - కన్నీరు మున్నీరుగా కురిపించగాని నిమ్మళపడలేదు'.)

15. చూ॥ పీఠిక : 'కన్నీరు'

16. చూ॥ యోగ్యతాపత్రం : మహాప్రస్థానం.

17. చూ॥ మ్యూజింగ్స్.

18. చూ॥ ఆధునిక యుగము : తెలుగు వాఙ్మయము : తెలుగు విజ్ఞానసర్వస్వము.

19. చూ॥ 'ప్రవాసము - ఊర్వశి' : భారతి - జూన్ 1954;
చూ॥ శ్రీ సన్నిధానం సూర్యనారాయణశాస్త్రి ; కావ్యాలంకార సంగ్రహ వ్యాఖ్య పు. 122-24.

21. యోగ్యతాపత్రం : మహాప్రస్థానం.
('ఉన్నత హిమాలయాల్లో కురిసిన కవితావర్షం .... సైడుకాలువల్లో పలుకుతున్నది')

22. చూ॥ శ్రీరామమోహనరాయ్ : కృష్ణశాస్త్రి క్రొత్తతెన్నులు : భారతి-జనవరి 1968.

23, 24, 27. చూ॥ కృష్ణశాస్త్రి స్వీయచరిత్రాత్మక రచన : భారతి-జూలై 1980.

25, 28. కృష్ణశాస్త్రి స్వీయచరిత్రాత్మక రచన : భారతి జూలై 1980.

26. చూ॥ ఆచార్య సి. నారాయణరెడ్డి : ఆధునికాంధ్ర కవిత్వము పు. 537-38.

29. చూ॥ శ్రీ పి. పద్మరాజు : Krishna Sastry – Man and Poet: Triveni-January 1955.

30. అరవై యేళ్ల ఆంధ్రసాహిత్యంలో విలిచేది : భారతి - నవం. 1974.

31. ఆచార్య వి. కె గోకాక్ : Bendre Poet and Seer P. 11.

33. శ్రీ ఆరుద్ర : కూనలమ్మ పదాలు.

# ఉపయుక్త గ్రంథసూచి


1. ఆంధ్ర రచయితలు - శ్రీ మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి - అద్దేపల్లి అండ్‌కో., రాజమండ్రి - ప్ర. ము. 1950.

2. ఆణిముత్యాలు - శ్రీ వేమూరి రాధాకృష్ణమూర్తి-ఎం. శేషాచలం అండ్ కో., మచిలీపట్టణం - ప్ర. ము. 1963.

3. ఆధునికాంధ్ర కవిత్వము - సంప్రదాయములు: ప్రయోగములు - ఆచార్య సి. నారాయణరెడ్డి - ఆంధ్రప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్స్, సికిందరాబాదు - ప్ర. ము. 1967.

4. కావ్యాలంకార సంగ్రహము - వివరణకర్త శిరోమణి సన్నిధానం సూర్య నారాయణశాస్త్రి - ఎం. శేషాచలం అండ్ కో., మచిలీపట్టణం - 1965.

5. గౌరాంగ చరిత్రము-కూచి నరసింహం-రచయిత పిఠాపురం-ప్ర.ము. 1916

6. జాతివెలుగులు - శ్రీ గొట్టిపాటి బ్రహ్మయ్య - తెలుగు విద్యార్థి ప్రచురణలు, మచిలీపట్టణం - ద్వి. ము. 1979.

7. తిరుప్పావు - తిరువెమ్బావు - విద్వాన్ శ్రీ సుదర్శనాచార్య శిరోమణి - తిరుపతి తిరుమల దేవస్థానము - ప్ర. ము. 1957.

8. తెలుగు సాహిత్యవికాసం - సంపా. డా॥ కె కె రంగనాథాచార్యులు - ఆంధ్ర సారస్వత పరిషత్, హైదరాబాదు.

9. తెలుగు విజ్ఞాన సర్వస్వము - నాల్గవ సం. తెలుగు భాషాసమితి.

10. నవ్యాంధ్ర సాహిత్య వీథులు - శ్రీకురుగంటి సీతారామాచార్యులు, శ్రీ పిల్లలమర్రి వేంకట హనుమంతరావు

11. నా వాఙ్మయ మిత్రులు - శ్రీ ఏకుమళ్ళ కామేశ్వరరావు- ప్ర. ము. 1966.

12. మరపురాని మనీషి - శ్రీ తిరుమల రామచంద్ర - యువభారతి, సికిందరాబాదు - ప్ర. ము. 1975.

14. మాపిఠాపురం - శ్రీ కురుమెళ్ళ వేంకటరావు - ప్ర. ము. 1978.

15 మాతృస్తవ తారావళి (ద్వి. భా.) - శ్రీ దేవులపల్లి వేంకట్రామయ్య.

16. విమర్శవేదిక - శ్రీ అద్దేపల్లి రామమోహనరావు - ప్రభాకర్ పబ్లికేషన్స్, కాకినాడ - ప్ర. ము. 1979.

17. వ్యాసక్రీడలు-శ్రీ శ్రీ - నవోదయ పబ్లిషర్స్, విజయవాడ - ప్ర.ము. 1973
18. శతకవాఙ్మయ సర్వస్వము - విద్వాన్ వేదము వేంకటకృష్ణశర్మ.
19. సమకాలిక భారతీయ సాహిత్యము - సాహిత్య అకాడెమి, న్యూఢిల్లీ - ప్ర. ము. 1965,
20. పాగుతున్నయాత్ర - శ్రీ ఆచంట జానకిరాం - ఆదర్శ గ్రంథమండలి-విజయవాడ - ప్ర. ము. 1962.
21. సాహిత్యోపనిషత్ - శ్రీ టి. ఎల్. కాంతారావు - శైలజ పబ్లిషర్స్ మచిలీపట్టణం.
22. ఆలూరిబైరాగి సంస్మరణ సంచిక - మద్రాసు - ప్ర ము. 1979.
23. కృష్ణశాస్త్రి కవితాస్వర్ణోత్సవ సంచిక - కృష్ణశాస్త్రి సన్మాన సంఘం ప్ర. ము. 1975
24. విజయమర్గ - కృష్ణశాస్త్రి ప్రత్యేకసంచిక - ఆంధ్రమహిళాసభ. హైదరాబాద్ - సంచి. నవం. 1974
25. కుమార సంభవము - వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్, మద్రాసు
26. రవీంద్రనాథ ఠాకూర్ ఏకోత్తరశతి - శ్రీ త్రిపురారి భట్ల వీరరాఘవస్వామి, సాహిత్య అకాడెమి, న్యూఢిల్లీ.
27. రామచరితమానస్ - వ్యాఖ్యాత - శ్రీ శ్యామసుందరదాస్, ఇండియన్ ప్రెస్, లిమిటెడ్, ప్రయాగ్.
28. సూఫీమత్ ఔర్ హిందీసాహిత్య - డా. విమల్‌కుమార్ జైన్ - ఆత్మారాం అండ్ సన్స్, న్యూఢిల్లీ.
29. A Keats Selection – Ed. by Norman Howlings, Macmillan & Co., Ltd., London – 1966.
30. A Wordsworth Selection – Ed. by F. B. Pinion, Macmillan & Co., Ltd., London – 1963.
31. An introduction to Modern Kannada Literature by L. S. Seshagiri Rao-Kannada Sahitya Parishat, Bangalore – 1977.
32. Bendre – Poet and Seer by Prof. V. K. Gokak, Somaiya Publications Ltd., Bombay.

33. Collected Poems & Plays of Ravindranath Tagore– Macmillan & Co., London – 1967.

34. John Keats by Robin Mayhead – Cambridge University Press – 1967.

35. Shelley, his thought and work by Desmond King – Hele Macmillan & Co., Ltd., London – 1960.

36. Six centuries of English Literature Vol. V Selection by Richard Ferror Patterson – The Standard Literature Co., Pvt. Ltd., London – 1963.

37. The Poetical works of John Keats, Oxford, University Press London – 1962.

38. Wordsworth's Poems Vol. II – Ed. by Philip Wayne – J. M. Dent & Sons Ltd., London – 1955.



# సవరణలు

| పుట | పంక్తి | ఉన్నది | ఉండవలసింది |
|---|---|---|---|
| 47 | 27 | సూచిక 92 | 29 |
| 49 | 14 | బాహుమతిగా | బహుమతిగా |
| 76 | 1 | రూఢమై పోయినది'' | రూఢమై పోయినది.''[8] |
| 82 | 14 | నంఘసంస్కా ణ కవిత్వం | సంఘసంస్కరణ కవిత్వం |
| 86 | 4 | ఉద్దేశింవబడ్డవే | ఉద్దేశింపబడ్డవే[18] |
| 88 | 10 | కానకావు | కానరావు |
| 93 | 18 | మారిపోవాలని | ఇత్యాదిగా మారిపోవాలని |
| 98 | 20 | షెల్లీ | కీట్సు |
| 99 | 16 | తలపులపేటి | వలపులపేటి |
| 100 | 2 | Lover's | Love's |
| 100 | 20 | దివ్యతేజోమయానంద | నిత్యతేజోమయానంద |
| 111 | 8 | షెల్లీ | కీట్సు |
| 115 | 10 | రాశీభవించిది | రాశీభవించింది |
| 123 | 15 | కీట్సు | షెల్లీ |
| 126 | 25 | Urvas | Urvasi |
| 132 | 2 | పురుగులాంటి | పురుగులలాంటి |
| 146 | 6 | Master | Mother |
| 150 | 15 | ఎవరెస్డు | ఎవరెస్టు |
| 153 | 7 | ఈపాట | ఈపాట కవికి |
| 162 | 3 | మంగళశాసనం | మంగళాశాసనం |
| 163 | 7 | ఏలోరెమ్బావై | ఏలోరెమ్బావాయ్ |
| 164 | 5 | పెన్నమీగడలు | వెన్నమీగడలు |
| 166 | 6 | మాపిన | మూపిన |
| 167 | 7 | శృంగిబేరి | శృంగిబేర |
| 169 | 19 | గోపిగోపికా | గోపగోపికా |
| 172 | 18 | ఈనాటికలలో | ఈనాటికలో |
| 178 | 21 | సూక్ష్మదర్శిత్వ్తో | సూక్ష్మదర్శిత్వంతో |
| 184 | 21 | ప్రసాద | ప్రాసాద |
| 181 | 3 | క్షుద్రశృగారం | క్షుద్రశృంగారం |
| 191 | 16 | అర్థమ్ములేని | అర్థమ్ముకాని |
| 191 | 24 | వస్తే | వస్తేతప్ప |
| 192 | 20 | సామాజక | సామాజిక |
| 193 | 11 | ప్రపంచపుబాధ | ప్రపంచానికిబాధ |



## KRISHNA SASTRY JEEVITHAM SAHITYAM

*By G. Chennaiah & Dr. B. Bhaskara Chowdary*

*Price Rs. 15/-*

---

## మా తొలి ప్రచురణ డా॥ బి. భాస్కరచౌదరి రచించిన 'జాషువ జీవిత కవితా ప్రస్థానం' గురించిన పత్రికాసమీక్షలు

"ఇది తూర్పుసముద్రంనుండి ఉదయించే సూర్యునికి తీసిన ఛాయాచిత్రంలా పరమరమణీయంగా ఉంది." – ఆంధ్రప్రభ సచిత్రవారపత్రిక

"ఈ విమర్శగ్రంథంలో ఉన్న ఒకానొక ప్రత్యేకత - కవి జీవితానికి, అతని కవిత్వానికి ఉన్న సంబంధాన్ని విశ్లేషించి చూపడం." – భారతి

"ఒక మహాకవి జీవితాన్ని, కావ్యాలను పరిశీలించి, పరిశోధించి రచించిన ఈ పుస్తకం జాషువమూర్తికి జీవంపోసి నిలిపినట్లుంది." – ఆంధ్రజ్యోతి

"చిన్న పుస్తకమే అయినా ఇది మంచిపుస్తకం." – ఆంధ్రపత్రిక

"డాక్టర్ భాస్కరచౌదరి సమర్పించిన 'జాషువ జీవిత కవితా ప్రస్థానం' ఉన్నతమైన సాహిత్య పరిశోధనాపత్రంగా భాసిస్తోంది." – విశాలాంధ్ర

"విషయ సేకరణలో రచయిత తీసుకొన్న శ్రద్ధ ప్రశంసనీయం. ఇదిగాక డాక్టరుగారి సహజమైన చక్కని జానుతెనుగు రచన ఔన్నత్యానికి వన్నె తెచ్చింది." – ఆంధ్రజ్యోతి సచిత్రవారపత్రిక

"ఈ పుస్తకం సాహిత్యాభిమానులందరూ చదవదగింది." – ఈనాడు

"ఇది చదివిన అనంతరం జాషువా కావ్యాలు చదవాలన్న ఆసక్తి ప్రతివారికి తప్పక కలుగుతుంది." – ఆంధ్రప్రభ

---

SAMATHA PUBLICATIONS,
20-11-36/1 Jailkhana St.,
Chittoor-517 001

NAVODAYA PUBLISHERS,
Eluru Road,
Vijayawada-520 002